ఆంధ్రసచిత్రవారపత్రిక

విజయవాడ **21-9-1990** శక సం.1912 భాద్రపదమాసం30వతేదీ

విడిప్రతి వెల నాలుగు రూపాయలు!

సంపుటము 83 | స్థాపితం 1908బొంబాయి : 1914మద్రాసు | సంచిక 5

వ్యవస్థాపకులు : దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు

(1938-1972 సంపాదకులు : శివలెంక శంభుప్రసాద్)

ఆంధ్రపత్రిక ప్రెస్, గాంధీనగరం, విజయవాడ-3, ఫోన్లు : 75667, 61247, 61248

# వీక్లీ పోస్ట్

### వివిధ రూపాలు

"శ్రీ సిద్ధి వినాయకుడు" ముఖచిత్రం (24-8-90)తో మన పత్రిక బాగుంది. వినాయకుడి వివిధ రూపాలు వాటి గురించిన వివరాలు బాగున్నాయి. ముఖ్యంగా ప్రముఖ నటుడు కీ. శే. శ్రీ యస్వీరంగారావుగారి తొలి అగ్రిమెంటు వారి వివరాలు అనుభవాలు ఫోటోలతో సేకరించి పత్రిక ద్వారా పాఠకుల కందించిన శ్రీ ఆరిపాక సూరిబాబుగార్కి మా సాహితీ వందనములు. అలనాటి మేటి నటుడు, తెలుగువారు మరిచిపోలేని మహోన్నత నటుడు నిజంగా ఘటోద్గజుడి పాత్ర ఊహించుకుంటే ఆ పాత్ర వేరే ఏ నటుడిని ఊహించలేము. ఇక సీరియల్స్ అన్నీ బాగానే ఉంటున్నాయి. పత్రిక అన్ని రకాల పాఠకులనలరిస్తూ 83 సం. లోకి అడుగిడి, అభిమానాన్ని చూరగొందంటే వీటి వెనుక ఎడిటర్- సిబ్బంది కృషి ఎంతైనా అభినందనీయం.

- పోలోజు వెంకటాచారి, జోడుప్పల్

## పాఠకులకు విజ్ఞప్తి

కొన్ని సాంకేతికపరమైన యిబ్బందుల వల్లను- మరికొన్ని అనివార్య కారణాల చేతను- ఆంధ్రసచిత్ర వారపత్రిక మధ్యమధ్య కొంచెం ఆలస్యంగా మార్కెట్‌లోకి విడుదల అవుతున్నది అంతేగాని నిలిచిపోలేదు. నిలిచిపోదు అని పాఠకులకు మనవి చేస్తూ- ఆలస్యంగా విడుదలయినప్పుడు మాతో సహకరించమని కోరుతున్నాము.

-ఎడిటర్

### ఎవరు దోషి?

24-8-90 వినాయక చవితి ప్రత్యేక సంచికలో 'ఎవరు దోషి?' ఆలోచనాత్మకంగా ఉంది. రచయిత గార్కి నా సాహితీ అభినందనలు.

నివాస్, వికారాబాద

(72 వ పేజీ చూడండి)

# పదండి లోపలికి!



ముఖచిత్రం : కిమీ కాట్‌కర్

(ఫొటో : జగ్‌మోహన్)

ఒరులేయవి యొనరించిన నరవర యప్రియము తన మనంబున కగు దా
నొరులకు నవి సేయకునికి పరాయణము పరమ ధర్మపథములకెల్లన్!

ఆంధ్రపత్రిక

ఎడిటోరియల్ అడ్వయిజర్ : శివలెంక రాధాకృష్ణ  ఎడిటర్ : వీరాజీ  ముద్రాపకుడు ప్రచురణకర్త : శివలెంక నాగేశ్వరరావు

# పంజాబ్‌లో ఎన్నికలు సాధ్యమా?

పంజాబ్‌లో పరిస్థితులు "ఎక్కడ వేసిన గొంగళీ అక్కడనే" అన్నట్లుగా వున్నాయి. వి.పి.సింగ్‌గారు చెప్పినట్లు "ప్యార్ సే' [ప్రేమతో] కాని లేదా గవర్నమెంట్ తీసుకుంటున్న "హత్యార్ సే" [ఆయుధాలతో] చర్యల వల్ల గాని అక్కడ యెటువంటి మార్పు కనిపించలేదు - పోలీసులకు ఉగ్రవాదులకు మధ్య మాత్రమే అక్కడ పోరాటం జరుగుతున్నది అనుకోడానికి వీలులేదు ***1990*** జనవరి నుంచి జూలై ***1*** దాకా గడచిన ***6*** మాసాల కాలంలో అక్కడ జరిగిన హింసాత్మక దారుణకాండలో వెయ్యి మందికి పైగా పౌరులు తమ నిండు ప్రాణాలు కోల్పోయారు. ఈ నష్టానికి ప్రతిగా ఐదువందల మంది ఉగ్రవాదులు నిహతులు కాగా మరణించిన పోలీసుల సంఖ్య రెండు వందల లోపే వున్నది. దీన్ని బట్టి చూస్తే పంజాబ్‌లోని సామాన్య ప్రజానీకం యెంతటి దారుణ మారణ హింసాకాండకి గురి అయిపోతున్నదో మిగతా ప్రాంతాల వారు వూహించుకోవచ్చును.

*1987* మే నెలలో మొట్టమొదటిసారి రాష్ట్రపతి పాలన క్రిందకు వచ్చిన పంజాబ్ రాష్ట్రం యిప్పటికి ఐదుసార్లు రాష్ట్రపతిపాలన విధింపుకుగాని లేదా విధింపు పొడిగింపుకి కాని గురి అయ్యింది. ఇప్పుడు మళ్లీ పంజాబ్ మీద - అటు రాష్ట్రపతి పాలనా? లేక ఎన్నికల నిర్వహణా? అన్న చిక్కు ప్రశ్న ఎదురైంది. ప్రస్తుతం అక్కడ అమలులో వున్న రాష్ట్రపతి పాలన గడువు నవంబర్ నెల *10*తో ముగిసిపోనున్నది. ఈ లోగా యేదో నిర్ణయం తీసుకోకపోతే - విషమ సంకట స్థితి నెలకొంటుంది. ఈ కారణంగానే యిప్పుడు నేషనల్ ఫ్రంట్ గవర్నమెంటు - మిత్ర పక్షాలతోను అమిత్రపక్షాలతోను కూడా నేరుగా, పరోక్షంగా చర్చలకు - మంతనాలకి దిగింది. కాంగ్రెస్ పార్టీ నాయకుడు మాజీ ప్రధాన మంత్రి శ్రీ రాజీవ్‌గాంధీకి - ప్రధానమంత్రి శ్రీ వి.పి.సింగ్‌కి మధ్య ఉత్తర ప్రత్యుత్తరాల రాపిడి ఎక్కువైంది. మీ వైఖరి ఏమిటి? అని యీయన అడిగితే - మీ పథకాలు ఏమిటి? అని ఆయన ఎదురు దాడి చేస్తున్నారు! - దీని వల్ల 'వేడి' తప్ప "వెల్తురు" రావటం లేదు.రాష్ట్రపతి పాలన విధింపుకు మరోసారి రాజ్యాంగ సవరణ చేస్తే తప్ప సాధ్యం కాదు. దానికి పార్లమెంటులో వున్న "ఫ్రంట్" బలం - దాని మిత్రపక్షాల సంఖ్యా చాలవు కనుక కాంగ్రెస్ (ఐ)ని బ్రతిమాలుకోవాలి. అయితే అక్కడ మరో సారి రాష్ట్రపతి పాలన విధించేలోగా ఫ్రంట్ గవర్నమెంట్ పంజాబ్‌లో శాంతి భద్రతల ఉద్ధరణకి తీసుకున్న చర్యలేమిటో చెప్పమంటూ కాంగ్రెస్ పార్టీ నిలదీస్తున్నది. శ్రీ వి.పి.సింగ్ ప్రధాన మంత్రి కాంగానే టోపులేని జీపులో చేసిన పర్యటనలో ఆయనకు స్వర్ణదేవాలయం దగ్గర లభించిన జేజేధ్వానాలన్నీ యిందిరాగాంధీ పట్ల - ఆమె "బ్లూస్టార్" చర్య పట్ల సిక్కులలో చాలా మందికి కలిగిన కోపతాపాల ప్రతిబింబాలేనని గ్రహించడానికి శ్రీ వి.పి.సింగ్‌కి కూడా అట్టే కాలం పట్టలేదు - ఇటీవల ఎర్రకోట బురుజు మీద నుంచి "నేను పంజాబ్‌లో శాంతియాత్ర చేస్తానంటూ వీరావేశంతో అన్న ప్రధాని శ్రీ వి.పి.సింగ్ - ఆ పర్యటనను వాయిదా వేసుకున్నారు. సిక్కుల హృదయ గాయాలను మాన్పడానికి ఆయన తీసుకున్న చర్యల ఫలితాలు కూడా "శూన్యమే" అయినాయి. తమ ఆశాజ్యోతిగా భావించి ఎంతో ఆదరణతో మన్ననతో - సిమ్రాంజిత్ మాన్‌ని నెత్తిన పెట్టుకుంటే అతను కాస్తా ఏకుమేకుగా మారిపోయి "ఖలిస్తాన్" జిందాబాద్ అంటున్నాడు. పైగా సమితి ఆధ్వర్యంలో పంజాబ్ ప్రజలకు యేమి కావాలో "రిఫరెండం" ద్వారా తేల్చమని కూర్చున్నాడు. పంజాబ్‌లో రాజకీయ పార్టీల ప్రాబల్యం కన్నా - టెర్రరిస్టుల సమాంతర పాలన వల్ల ప్రజలలో ఎక్కువ భయ "భక్తులు"న్నట్లుగా వార్తల వల్ల తెలుస్తున్నది. ఈ సందిగ్ధ స్థితిలో "ఫ్రంట్" గవర్నమెంట్ ముందు రెండు పద్ధతులున్నాయి. ఒకటి కాంగ్రెస్ కాళ్లు, చేతులూ పట్టుకుని - మరోసారి రాజ్యాంగాన్ని సవరించి నవంబర్ పది నుంచి అక్కడ రాష్ట్రపతి పాలనను ఆరోసారి విధించడం - లేదా ఎన్నికలకు అక్టోబర్ *6* నాడు ఆదేశ పత్రాలు జారీ చేసి బుల్లెట్‌లనో బ్యాలట్‌లనో - అల్లకల్లోల స్థితిలో - ఎదుర్కొని పర్యవసానాన్ని భరించడం - అక్కడ అసెంబ్లీని ఎన్నికల ద్వారా కాని యితరత్రా యిప్పుడున్న దాని పునరుద్ధరణ ద్వారా కాని ఏర్పాటు చేస్తే - ఉగ్రవాదుల వొత్తిడికి గురి అయి ఆ అసెంబ్లీయే "ఖలిస్తాన్"కి అనుకూలంగా తీర్మానం చేస్తే? - ఏం చెయ్యాలి? దీనికే సమాధానం వి.పి.సింగ్‌గారి అనుయాయులు ఆలోచిస్తున్నారు. కొత్త అసెంబ్లీలోనే యిలాంటి స్థితి వస్తే రాజ్యాంగాన్ని అడ్డుపెట్టుకుని యిప్పుడనుకున్న రాష్ట్రపతి పాలనను విధించవచ్చును. కాని యిది "డైనమెట్"ను బంతిగా చేసి [ఆ] వాడుకోడం లాంటి "ఐడియా". ఎన్నికలంటూ నిర్వహించాలి అంటే యీ పాటికే "ఫ్రంట్" దాని మిత్రపక్షాలు అక్కడ చాలా పునాది పని చేయాల్సింది కాని - ఒక్క లోంగోవాల్ పార్టీ - ఉగ్రవాదుల ప్రాబల్యంతో మరి కొన్ని ప్రాంతీయ యితర పార్టీలు ఎన్నికలు అంటున్నాయ్ తప్ప - జాతీయ పక్షాలు మాత్రం అందుకు సిద్ధంగా లేవు - కాని సెప్టెంబర్ రెండో వారం చివర తాజా స్థితి చూడగా ఫ్రంట్ నాయకుడు ప్రధాన మంత్రి తన మిత్రపక్షాలను ఎన్నికలకు వొప్పించాలనుకుంటున్నట్లు అభిజ్ఞవర్గాలు వెల్లడి చేస్తున్నాయి. ఇది శ్రీ వి.పి.సింగ్ తన దుస్సాహస ప్రవృత్తితో దేశానికి; పంజాబ్‌లోని సాధారణ అమాయక ప్రజానీకానికి; మరోసారి తీసుకొని వస్తున్న "ముప్పు" తప్ప మరొకటి కాదు అని హెచ్చరించకా తప్పటం లేదు.

**[13-9-90]**

# ముచ్చటైన మెరుపు కలిసి వచ్చే పొదుపు

# స్వర్ణ క్లీనింగ్ పౌడర్



- పొదుపును దృష్టిలో పెట్టుకొని మా లేబరేటరీలో ఎంతో శ్రమ, వ్యయానికి ఓర్చి స్పెషల్ ఫార్ములాతో తయారుచేసి ప్రజలకు తక్కువ ధరలో మంచి క్లీనింగ్‌పౌడర్‌ను అందజేయుట మా ధ్యేయం
- బంగారు వస్తువులు తప్ప మిగతా అన్ని లోహపు వస్తువులు, పింగాణి పాత్రలను తళతళలాడేలా శుభ్రపర్చును




- మీ పాత్రలకు కొత్త మెరుగులు చేకూర్చి మీ ఖర్చుకు మించిన ఫలితాన్ని చేకూరుస్తుంది
- అతి తక్కువకాలంలో క్లీనింగ్ పౌడర్‌ల అమ్మకాలలో అత్యధిక ప్రజాదరణ పొంది రికార్డు సృష్టించినది మా స్వర్ణ క్లీనింగ్ పౌడర్

TARA-346

**NATIONAL CHEMICAL ENTERPRISES**

Mf Washing & Cleaning Powder

Suppliers Dyes & Chemicals

T B Road, Tenali-522 201 Guntur Dist (A P) Phone 5397

మా క్లీనింగ్ పౌడర్ అమ్ముటకు జిల్లాల వారీగా, తాలూకాలు, మండలాల వారీగా డిస్ట్రిబ్యూటర్లుగా స్టాకిస్టులుగా, డీలర్లుగా పనిచేయుటకు ఆర్థిక స్థోమత, ఏజన్సీ లైనులో అనుభవము కలిగి అన్ని వసతులు వున్నవారు మా సంస్థకు నేరుగా వచ్చి సంప్రదించగోరుతున్నాము.



# అందానికి అడ్డదారు లున్నాయా?



సాధారణంగా లావుగా వున్న వాళ్ళు సన్నబడాలనుకున్నట్లే సన్నగా వుండే వాళ్ళు లావు అవాలని కోరుకుంటారు ఎక్కువ తింటే లావయి పోతామను కుంటారు కాని ఎంత ఎక్కువ భుజిస్తున్నా మన్నది కాకుండా, ఏ విధమైన ఆహారం తీసుకుంటున్నా మన్న దానిమీద లావు అవటం ఆధారపడి వుంటుంది పిండి పదార్థం ఎక్కువగా వుండే రొట్టె, పంచదార, జామ్, స్వీట్లు, బిస్కట్లు కేకులు లాంటివి క్యాలరీలు ఎక్కువగా లభ్య మవుతాయి ఆకు కూరలు, పండ్లు లాంటి వాటిలో క్యాలరీలు తక్కువ వుంటాయి తాజా పండ్లు, కూరగాయలు తింటే శరీ రంలో విటమిన్లు తగ్గకుండా వుంటాయి అన్నింటి లోకి క్రొవ్వు పదార్థాలు ఎక్కువ క్యాలరీలు కలిగి లావు అయేట్లు చేస్తాయి కాబట్టి మీగడ పాలు వెన్న, జున్ను అవీ ఎక్కువ తీసుకోవాలి

పాదాలు అరచేతులు మృదువుగా వుండాలంటే చేతులు శుభ్రం చేసుకుని స్కిన్, నరిషింగ్ క్రీమ్ దేనితో నైనా రోజుకు 3 లేక 4 సార్లు మర్దన చేయాలి యువతులు కనుబొమలు షేప్ చేసుకోవటం ఈ రోజుల్లో సాధారణ మయిపోయింది ఐబ్రోలు షేపు చేసేటపుడు కొన్ని మెలకువలు పాటించాలి ముఖ్యంగా వీటిని ఆ వృత్తిలో వున్న బ్యూటీషియన్ల చేత చేయించుకోవాలి గాని ఎవరికి వారు చేసుకో కూడదు ఈ భాగంలో వెంట్రుకల పెరుగుదల చాలా తక్కువగా వుంటుంది కాబట్టి కనుబొమల షేప్ పోతే త్వరగా మామూలుగా అవదు



ఐబ్రోను షేప్ చేసేటపుడు ఎపుడూ క్రింది వైపు వెంట్రుకలనే నెమ్మదిగా తొలగించాలి పైవైపు వెంట్రుకలు తీసేస్తే షేప్ సరిగా రాదు

ముఖం మీద, చేతుల మీద జుట్టు ఎక్కువ వుంటే ఎలక్ట్రాలిసిస్ పద్ధతి ద్వారా తీయించుకుంటే మంచిది ఈ ఎలక్ట్రాలిసిస్ పద్ధతి బ్యూటీ క్లినిక్స్‌కు వెళ్ళి చేయించుకోవాలి ఇపుడు ఎలక్ట్రాలిసిస్ కిట్స్ అమ్ముతున్నారు కాని వీటితో ఎవరికి వారు స్వయంగా ఎలక్ట్రాలిసిస్ చేసుకోవటం దుష్ఫలితాలను యిస్తున్నది ముఖంలోని చర్మ రంధ్రాలు తెరుచుకోవటం నరం దెబ్బ తినటం లాంటివి జరుగుతాయి కాబట్టి ఆ వృత్తిలో నేర్పరులైన వారిచేత ఎలక్ట్రాలిసిస్ చేయించుకుంటేనే మంచిది

– జె శాంతి



# ఆ ఇద్దరి మధ్యా.....

-జయచంద్ర



రవీ,

నాకు తెలుసు ఈ ఉత్తరం చేరే సమయానికి నీవు నీ స్వంత గ్రంథాలయంలోని ఏ ఉద్గ్రంథంలోనో మునిగిపోయి ఉంటావని, దేనికోసమో అన్వేషిస్తూ ఉంటావనీను.

నీ యీ అన్వేషణకు అంతం లేదా రవీ! జీవితాన్ని నీవెందుకు తేలిగ్గా తీసికోవు? ప్రతి చిన్న విషయాన్నీ అంత సీరియస్‌గా తీసికొంటావు గనుకనే నీవు మనశ్శాంతికి దూర మౌతున్నావు. రాత్రి భోజనాల తర్వాత, నీ ఉత్తరాన్ని మా వారు చదువుతూంటే మళ్లీ శ్రద్ధగా విన్నాను. అది చదివిన తర్వాత మా యిద్దరి మనసులూ ఒక క్షణం భారమైనాయి. అయినా నీవు యీ విషయాన్ని యింత సీరియస్‌గా తీసికోవటానికేం వుంది! నీవు వ్రాసినట్లు నీ వెక్కడికైనా వెళ్లిపోయినంత మాత్రాన మనశ్శాంతి లభిస్తుందా! నీ అశాంతి నిన్ను నీడలా వెంటాడదా!

వివాహమనేది మనిషి జీవితంలో ఒక మలుపు అయితే, వివాహం తర్వాత జీవిత గమనం, ఆ మనిషి అదృష్ట దురదృష్టాలను బట్టి ఉంటుందన్న నీ సిద్ధాంతాన్ని నేనూ అంగీకరిస్తాను. అది మన జీవిత భాగస్వాములుగా వచ్చేవారి సంస్కారం మీద, ప్రవృత్తి మీద, ఆధారపడి వుంటుంది. నిజమే! కానీ ప్రయత్నిస్తే అసాధ్యమైనదేదీ ఉండదనే సిద్ధాంతాన్ని కూడా నేను నమ్ముతాను. నీవు ప్రయత్నిస్తే ఆమెను మార్చలేవా! ఆ మనిషిలో ఆలోచనలు రేకెత్తించి, నీ సిద్ధాంతాలను అంగీకరించేట్టు చేయలేవా! రవీ! ఆలోచించు. ఆచరణ సాధ్యం కాని దేదీ నేను వ్రాయలేదు. ఒక వేళ మీ మధ్య కలతలకు నా ఉత్తరాలే కారణం అయితే నేను వ్రాయటం మానుకుంటాను. కానీ దళసరి కళ్లద్దాల్లోంచి ఎప్పుడూ దేన్నో అన్వేషిస్తూండే అమాయకమైన రవి ముఖం నాకెప్పుడూ గుర్తుకొస్తుంటుంది.

నీ స్నేహితురాలు
సుధ

సుధా;

నా జీవితంలో నాకానందాన్ని కల్గించే క్షణాలు రెండే రెండు. ఒకటి నీవద్ద నుండీ వచ్చిన ఉత్తరం చదువుతున్నప్పుడు. రెండవది నేను నీకు ఉత్తరం వ్రాస్తున్నప్పుడు. సుధా! మన కాలేజీ రోజుల్లో నీవు నన్ను ఆటపట్టిస్తూండే

దానివి.

"మొద్దబ్బాయ్! నీకు గడసరి పెళ్లాం వచ్చి రెండు చెవులూ పట్టి ఆడిస్తుంది" అని. అలా సరదాగా ఆడించగల భార్యే వచ్చి వుంటే నేనెంత ఆనందించే వాడినో గదా! మంచి భార్య వద్ద మొద్దబ్బాయిగా వుండడమే నాకిష్టం. నేనలా ఎన్నో కలలు గన్నాను. కానీ జరిగిందేమిటి?

తను యింట్లో ఉండే క్షణాలే బహు కొద్ది. ఆ కొద్ది క్షణాలు యిల్లు కురుక్షేత్రంలా ఉంటుంది. మాయింట్లో ఏ రోజయినా గొడవ లేదూ అంటే అందుకు కారణాలు రెండు అయి ఉంటాయి. ఒకటి, ఆ రోజంతా ఆమె యింటికి వచ్చి వుండకుండా అయినా వుండాలి. లేక నేను రోడ్లు సర్వే చేస్తూ యింటిదారి మర్చిపోయి అయినా ఉండాలి. ఇద్దరమూ ఇంట్లో ఉన్నరోజు గొడవలు తప్పవు. ఆమెకు క్లబ్బులూ మహిళా మండలుల మీదున్న ఉత్సాహం వైవాహిక జీవితం మీద లేదేమో అన్పిస్తుంది. నేను కన్న కలలన్నీ ఏమయ్యాయి. సుధా! నా జీవిత మెందుకిలా అయిపోయింది? నేను అలసి ఆఫీసు నుంచి వచ్చేసరికి చిరు నవ్వుతో ఎదురు వచ్చే భార్య కోసం నేను కలలు కన్నది. స్నేహితురాళ్లను పోగేసుకొని చందాల సాకుతో ఊరంతా చెడతిరిగే భార్యను కాదు నేను అభిలషించింది. సాయం సంధ్యలలో ఏ కొండ అంచునో, సముద్ర తీరాన్నో తీయటి కబుర్లతో నాతో గడపగల యిల్లాలు కోసం నేను కలలుగన్నాను. అంత చిన్న కోరిక కూడా తీరలేదేమి?

నీవనేదానివి "నీవు నోట్లో వెండి స్పూనులతో పుట్టావోయ్ రవీ" అని. కానీ ఎంత డబ్బు వెచ్చించినా మన శ్శాంతి లభిస్తుందా!

కట్నం తీసికోకుండా వివాహం చేసికొని నేనేదో ఆదర్శానికి నిలబడ్డానని తృప్తి పడ్డానేగానీ, ఎదుటి మనిషి తన పంతానికి నన్నొక పావుగా ఉపయోగించుకొందని తెలుసుకొనే సరికి నేనెంత దగాపడ్డానో అర్థమయ్యింది. కట్నమివ్వకుండా వివాహం చేసికున్న ఆదర్శ మహిళగా ఆమె స్నేహితులామెను ఆకాశానికి ఎత్తేశారు. సాయంత్రం అలసి యింటికి వచ్చిన నాకు బాధ్యతగా కాఫీ తెచ్చి యిచ్చే నౌకరును చూస్తే ఆవేశం కట్టలు తెంచుకుంటుంది.

కానీ ఏం చేయను? ఆ ఆవేశాన్ని నౌకర్ల మీద చూపించి చులకనైపోనా! ఈ జీవితానికిక శాంతి లేదు సుధా! నేనామెను మార్చటానికి ప్రయత్నించలేదని అనుకుంటున్నావా సుధా! ఆమెతో వాదించి అలిసిపోయాను. పర్యవసానమేమిటో తెలుసా! నన్నొక దుర్మార్గుడుగా, స్త్రీ స్వాతంత్ర్యానికి వ్యతిరేకిగా చిత్రించిందామెతన స్నేహితులలో!

నా యీ చేదు జీవితంలో అప్పుడప్పుడూ అమృతపు చుక్కల్లా తగిలేవి నీ ఉత్తరాలే. మీ యిద్దరి దాంపత్యం ఒక్కసారి చూడాలని వుంది. త్వరలో వస్తాను-రావుగార్ని మరీ మరీ అడిగానని చెప్పు. నా సమస్యలతో నీకు విసుగు కల్గిస్తుంటే మన్నించు సుధా! ఆమెతో వాదించి కానీ, నచ్చచెప్పిగానీ ప్రయోజనం లేదు. మనిషికి అర్థం చేసుకోగల హృదయమైనా ఉండాలి. సర్దుకుపోగల సంస్కారమైనా ఉండాలి. అవి రెండూ లేని వ్యక్తులతో మాట్లాట్టం వ్యర్థం. తప్పక ఉత్తరం వ్రాయి.

స్నేహితుడు
రవి.

రవీ,

నీ ఉత్తరం చదివాను. నీ ఆవేదన నాకర్థమైంది. కానీ ఆలోచనల్లో కూడా మొద్దబ్బాయివేనని నిరూపించుకున్నావు. మంచి తనంతో నీవు ఆమె ప్రవర్తనను మార్చలేవప్పుడు కరకు దనాన్ని ఎందుకు ప్రదర్శించవు? ఆమె చేష్టలను తీవ్రంగా ప్రతిఘటించి, ఆమె స్వేచ్ఛను ఎందుకు అరికట్టవు? ఆమె జీవితాన్ని నీవెందుకు శాసించవు? మావారు కూడా అదే అన్నారు. 'మెత్తగా ఉన్న వారిని చూస్తే మొత్త బుద్ధేస్తుందట' నీ పలాయనం సమస్యలను మరింత జటిలం చేస్తుందే కానీ పరిష్కరించదు. ఆదర్శాలు అర్హులయిన వారికే గానీ, అనర్హులకు వాటి అర్థాలు స్ఫురించవు. అటువంటి వారిపట్ల ఆదర్శంగా ఉండటం అవివేకం. నీ మంచి తనం నలుగురి దృష్టిలో నిన్ను చేతగాని వాడిని చేస్తుంది. ఆలోచించు. సరియైన నిర్ణయం తీసుకో!

స్నేహితురాలు
సుధ.

సుధా!

వైవాహిక జీవితం పట్ల నేను కన్న కలలన్నీ సమాధి చేసి, ఒక చిన్న బిడ్డకు తండ్రిగా ప్రేమను పంచిపెడదామనీ, ఆ బిడ్డ ఆలనా పాలనలో బాహ్యప్రపంచాన్ని మరచిపోదామనీ కల కన్నాను.

ఆమె పట్ల ఎంత విముఖత ఉన్నా ఆమె కని నాకివ్వబోయే బిడ్డకోసం రెండు నెలల నుంచీ ఎంతో ఆశగా ఎదురు చూస్తున్నాను. ఆమె రెండు రోజుల నుండీ యింటికే రాలేదు. నాకది మామూలే కాబట్టి పెద్దగా పట్టించుకోలేదు. మూడవరోజు సాయంత్రం వరండాలో కేన్ ఛైర్‌లో కూర్చుని వున్నాను నేను. టాక్సీలో నుండి అతి నీరసంగా దిగింది ఆమె. ఆదుర్దాగా ఎదురు వెళ్లాను నేను. చాలా రోజుల నుండీ మా మధ్య మాటలు లేవు. "ఇన్ని రోజులు ఎక్కడున్నావు?" అభిమానం చంపుకొని అడిగాను.

"హాస్పిటల్లో" నిర్లక్ష్యంగా చెప్తూ లోనికి వెళ్లిందామె. వెనుకనే వెళ్లాను గాభరాగా. "ఎందుకు?"

"అబార్షన్ చేయించుకున్నాను."

నివ్వెరపోయాను నేను. నా ఆశా సౌధాలన్నీ నాముందే కూలిపోయాయి. ఆమె ఒక మనిషిగా కాక రాక్షసిగా, హంతకిగా, కన్పించింది నా కళ్లకు.

"ముందుగా నాకు చెప్పాలని కూడా అన్పించలేదా భారతీ!" దుఃఖం నాగొంతు నొక్కుతుండగా నీరసంగా అడిగాను నేను.

"కడుపు వచ్చింది నాకు. కనటం కనకపోవటం నా యిష్టం. నీకు చెప్పాల్సిన అవసరమేముందీ?"

మంచంపై పడుకుని ముసుగు బిగించిందామె. నాలో కోపం, అసహ్యం పెల్లుబికాయి. ఒక్క ఉదుటున మంచం

## ఆ ఇద్దరి మధ్యా...

వద్దకు వెళ్లి ముసుగు లాగేశాను.

"భారతీ! భిన్న ధృవాలమైన మనం యిప్పటి వరకూ కల్సి ఉన్నామంటే కారణం, నాకు సంతానంపై వున్న ఆశలే! నీవు ఆ ఆశ లేకుండా చేసిన తర్వాత మనం కల్సి ఉండటంలో అర్థం లేదు." అనేసి బయటకు వచ్చేశాను. తెల్లవారి చూసేసరికి ఆమె గదిలో లేదు. బెడ్ పై ఒక ఉత్తరం కన్పించింది.

"నేను నిన్ను వదిలి వెళ్లిపోతున్నాను. భార్యంటే బిడ్డను కని మీకిచ్చే యంత్రం కాదు. ఇంత సంకుచితంగా ఆలోచించే మీతో యికపై ఒక్క క్షణం కూడా కల్సి జీవించలేను. నా అభిప్రాయాలను గౌరవించే వ్యక్తి దగ్గరకు వెళ్లిపోతున్నాను." భారతి, శేఖర్ అనే యింజనీరుతో తిరుగుతూందని విన్నాను. బహుశా అక్కడికే వెళ్లివుంటుంది.

నా వైవాహిక జీవితం యిలా పరిసమాప్తమైంది సుధా! శేష జీవితాన్ని ఒంటరిగానే గడిపేయదల్చాను. నా ఒంటరి జీవితానికి మీ ఉత్తరాలే ఓదార్పులు. త్వరలో ఉత్తరం వ్రాస్తావు కదూ!

స్నేహితుడు
రవి.

రవీ,

నీ ఉత్తరం ఎన్నిసార్లు చదివానో గుర్తేలేదు. సాయంత్రం మావారు ఆఫీసు నుంచీ రాగానే నీ ఉత్తరాన్ని అతని చేతుల్లో వుంచి గుండెల మీద వ్రాలి భోరుమన్నాను. ఉత్తరం చదివి ఓదార్పుగా నాతల నిమిరారు. వారికి కన్నుల నుండీ రెండు కన్నీటి బొట్లు రాలి నా తలపై పడ్డాయి.

రవీ! కష్టాలు లోకంలో మంచి వారి చిరునామాను అతి తేలిగ్గా తెలుసుకొని వారి మీదకు దాడి చేస్తాయి కాబోలు. చాలాసేపటి తర్వాత వారేమన్నారో తెలుసా! "లోకంలో స్త్రీలందరూ సుధలే కాదు. భారతులూ ఉంటారు. రవికి భారతి దొరికింది. నాకు సుధ దొరికింది. రవిని యిక్కడకు రమ్మను. మనశ్శాంతి దొరుకుతుందేమో!" అని. మీ వివాహానికి మేమిద్దరం వచ్చినప్పుడు వారు నిన్ను చూసి ఏమన్నారో తెలుసా రవీ! 'నీ స్నేహితుడు చాలా సున్నిత మనస్కుడు. ఏ చిన్న ఒడుదుడుకులనూ తట్టుకోలేడు' అని. మనసుకు కుసుమ సౌకుమార్యమే కాదు. వజ్రకాఠిన్యం కూడా వుండాలి. అప్పుడే జీవితంలోని ఒడుదుడుకులను తట్టుకోగలం. నీవు ఒకసారి యిక్కడకు రా రవీ! కొంత మార్పు యినా ఉంటుంది.

స్నేహితురాలు
సుధ.

సుధా,

మీ దంపతులు నామీద చూపిన సానుభూతి నాకు ఊపిరిపోసింది. మీ వివాహానికి వచ్చినప్పుడు పెళ్లి పీటలమీద మిమ్మల్ని చూసి ఎంత మురిసిపోయానో తెలుసా సుధా! నిండైన విగ్రహంతో, గంభీరమైన చూపుల్తో ఉన్న రావుగారు నాకెంతో నచ్చారు. మన స్నేహాన్ని ఆయన అభినందించినప్పుడు ఆయనలోని ఔన్నత్యాన్ని చూడగల్గాను నేను. నీవు అన్ని విధాలా అదృష్టవంతురాలివి సుధా! పెళ్లయిన క్రొత్తల్లో వ్రాశావు మీదెంతో అన్యోన్య దాంపత్యమని! భార్య భర్తలు ఒకరి అభిప్రాయాలు ఒకరు గౌరవించుకొంటూంటే, అంతకంటే స్వర్గధామం మరేం వుంటుంది?

'ఆయన యింటికి రావటం ఒక అరగంట ఆలస్యమైతే నేనెంతో తల్లడి





## రష్యాలో శశి సినిమా ఫ్లాప్

శశికపూర్ చిత్రం 'అజూబా' మాస్కోలో విడుదలై ఫ్లాప్ కూడా అయిందిట రష్యన్లు యిప్పటికీ రాజ్‌కపూర్, మిథున్ చక్రవర్తుల చిత్రాల్నే చూస్తున్నారు. ఆనందిస్తున్నారు కాని 'అజూబా' మాత్రం వాళ్లను ఆకట్టుకోలేక పోయింది ఈ విషయమై శశికపూర్‌ని అడిగితే అదంతా నిజం కాదని బుకాయిస్తున్నాడట

ల్లిపోతాను' అని వ్రాశావు

ఏ భర్తయినా భార్య నుంచీ కోరుకునేది అదే గదా!

సుధా! నేను ఒంటరి జీవితానికి అలవాటు పడటానికి ప్రయత్నిస్తున్నాను నా పరిధిలో కొన్ని వ్యాపకాలేర్పరచుకోటానికి ప్రయత్నిస్తున్నాను ఇప్పుడు ఎక్కడికీ రాలేను రావుగారిని క్షమించమని చెప్పు నీ ఉత్తరం కొరకు నిరీక్షిస్తూ-

స్నేహితుడు
రవి

సుధా,

ఎందుకిలా జరిగింది? నీ వద్ద నుండీ వచ్చిన టెలిగ్రాం చూసిన తర్వాత నా హృదయంలో జరిగిన పెనుతుఫాను ఏమని వర్ణించను సుధా! అడ్రస్ నాది కాదేమోనని పదేపదే వెనక్కు త్రిప్పి చూశాను ఏర్‌పోర్టుకు ఎలా చేరుకున్నానో ఎలా అక్కడకు రాగలిగానో నాకిప్పటికీ గుర్తు లేదు రావుగారి శరీరం మీద వున్న అనేక వందల మాలల్లో నా పూలా కుసుమమూ ఒకటి వేశాను ఎప్పుడూ గంభీరంగా ఉండే ఆయన కళ్ళు, మూసుకుని ఉన్నా ఏదో ఆలోచిస్తున్నట్లే ఉన్నాయి దుఃఖాన్ని ఆపలేక శవంపైపడి భోరున ఏడ్చేశాను నేను అంతగొప్ప స్నేహితుని పోగొట్టుకున్న నేను ఎంత దురదృష్టవంతుడిని? లోపలికి వచ్చి నీ పరిస్థితి చూసి నేనెంత బాధపడ్డానో నీకెలా వర్ణించను? నన్ను చూసి నీవు హృదయం బ్రద్దలయ్యేలా ఏడ్చినప్పుడు, నిన్ను ఓదార్చటానికి తెలుగు భాషలో ఒక్క పదం కూడా గుర్తుకు రాలేదు నాకు అతను అరగంట ఆలస్యంగా యింటికి వస్తే భరించలేనిదానివి అతను లేని జీవితాన్ని ఎలా గడపగలవు సుధా! విధి లీలలు ఎంత వింతగా ఉంటాయి? కాకపోతే స్కూటరు నడపటం రావుగారు క్రొత్తగా నేర్చుకున్నారా? ఇన్నికోట్ల జనంలో ఆ దురదృష్టం నిన్నే ఎందుకు వరించాలి సుధా! ఆ ఏక్సిడెంటేదో నాకయ్యుంటే ఏ సమస్యలూ ఉండేవి కాదు గదా!

అతి గాఢంగా పెనవేసుకొన్న బంధం ఒక్కసారిగా త్రెగిపోయింది ఈ పరిస్థితుల్లో నిన్నెలా ఓదార్చాలి? నా సంగతివేరు మా బంధం మొదటి నుంచీ అంత బలంగాలేదు రోజు రోజుకూ అది బలహీనమై చివరకు తెగిపోయింది కానీ నీ పరిస్థితి అలాగాదే "రవీ! నేనెందుకు బ్రతకాలి? ఏం చూసుకొని బ్రతకాలి?" అని హృదయ విదారకంగా నీవు దుఃఖించినప్పుడు, గడ్డప్పగించి నీవైపు చూస్తుండిపోయానే గానీ ఏమీ మాటాడ లేకపోయాను సుధా! ఒకప్పుడు నీవే వ్రాసినట్లు హృదయానికి కుసుమసౌకుమార్యమే కాదు వజ్రకాఠిన్యం కూడా ఉండాలి రేగిన గాయాలను కాలమే మాన్పుతుంది ఈ పరిస్థితులలో నీవు అక్షరాలను కుదుర్చుకొని ఉత్తరం వ్రాయగలవని నేననుకోవటంలేదు కష్టాలలో ఆత్మబంధువుల ఆప్యాయత కంటే, ప్రాణ స్నేహితుల ఆదరణే ఊరట కల్గిస్తుందని నేను స్వానుభవంతో తెల్సుకొన్న నిజం నా ఉత్తరాలు నీకు కొంతైనా ఉపశాంతిని కల్గిస్తే ధన్యుడిని

స్నేహితుడు
రవి

రవీ,

నీవీ మధ్య వ్రాసిన ఉత్తరాలన్నీ చదివాను అవినాకు జీవంపోశాయి నాలో ధైర్యాన్ని నెలకొల్పాయి అమ్మ, అన్న, అందరూ నన్ను యింటికి రమ్మని పిలిచారు కానీ ఎలా వెళ్లను రవీ! ఆయనతో పాటు, ఈ యింటిలో వారితో గడిపిన మధుర స్మృతులను కూడా వదిలేసి వెళ్లిపోనా? ఈ యింటి చుట్టూ ఆయన ఎన్ని ఆశలను అల్లుకొన్నారు ఆ జ్ఞాపకాలలో బ్రతుకుతూ యిక్కడే వుండటానికి నిశ్చయించుకొన్నాను ఇప్పుడు నేను ఆయన్ను వెతుక్కుంటూ మరో లోకంలోకి వెళ్లటానికి కూడా అస్వతంత్రురాలిని నాలో పెరుగుతున్న ఆయన రూపం నాకు వారు మిగిల్చిన చివరి జ్ఞాపకం అదే నన్ను భవిష్యత్తువైపు నడిపే ఆధారం అప్పుడప్పుడూ నీవు వ్రాసే ఉత్తరాలలో శాంతిని వెతుక్కుంటూ శేష జీవితాన్ని గడిపేస్తాను

స్నేహితురాలు
సుధ

## ఏక్ లడ్‌కీ భీగీ భీగీసీ....

# సార్థక నామధేయురాలు మధుబాల

కిర్రెక్కించే కిషోర్ పాట ఒక చరణం హీరో మీద చిత్రీకరించి– ప్రతిగా ఒక్క క్లోజప్ హీరోయిన్ మధుబాల మీద వేస్తే – ఆమె ముంగురులు మొహాన నృత్యమాడుతుండగా కనుబొమ లు విరిచి వొక్క నవ్వు విసిరేస్తే చాలు!.... అంతకుముందు సీను హుష్ కాకి అయిపోయేది. వలు వరుస పగిలినా– వోర చూపు సంధించినా– వొళ్ళు విర్చుకుంటే యింక చెప్పాలా మధుబాల ఒక మన్మథ బాణం - ఆ రోజులే వేరు...!

నాల్గు దశాబ్దాల క్రితం హిందీ చిత్రసీమలో అగ్రస్థానం వహించిన తారల్లో మధుబాలని ప్రముఖంగా పేర్కొనాలి.

సుందర రూపము, చక్కని నటన, వయ్యారపు నాట్యము వీటన్నిటినీ మించిన మధుర దరహాసము ఈమెను ఉన్నత స్థానంలోకి తీసుకు వెళ్ళాయి. మొఘల్–ఏ–ఆజమ్, మహల్, షిరిన్–ఫరహాద్, హౌరాబ్రిడ్జ్ వంటి చిత్రాలు చూచిన నాటి సినిమా ప్రేక్షకులు మధుబాలను మరచిపోలేరు. ఆమె ఓర చూపు నవ్వు ప్రేక్షక హృదయాల్లో గిలిగింత కల్గించేది. ఆనాడు మధుబాల ప్రేక్షకులకు స్వప్నసుందరిగా మైకం కల్గించేది. ఈ సుందరి తన జీవితంలో ఎన్నో కష్టాలను ఎదుర్కోవలసి వచ్చింది... ఈ తరం సినిమా అభిమానులు ఈమె గురించి తెలుసుకోవడం కోసమే ఈ వ్యాసము ప్రత్యేకంగా రాస్తున్నాను...

మధుబాల తండ్రి అతవుల్లాఖాన్ అప్పుడు ఢిల్లీలో వ్యాపారం చేస్తుండేవాడు. వ్యాపార విషయమై బొంబాయి వెళ్ళేటప్పుడు కూతురుని కూడా తనతో పాటు తీసుకువెళ్ళేవాడు. అప్పుడు ఆమెకు 6 ఏళ్ళ ప్రాయం. అప్పుడు సాగర్ మూవీటోన్ సినిమా సంస్థలో పని వుండి ఇతను వెళ్ళాడు. ఆరేళ్ళ ఆ పసిపాప ఆ సినిమా వాతావరణం చూచి సంతోషపడింది. అంతేకాదు వేషాలు వేయాలనిపించింది.

బొంబాయి నుంచి తిరిగి ఢిల్లీ వచ్చేశాక ఈ పాపకు సంగీతం, నాట్యం నేర్పించాడు తండ్రి. ఆ చిన్నవయస్సులో శ్రద్ధాసక్తులతో నేర్చుకునేది. మనసులో సినిమాల్లో వేయాలనే కోరిక ప్రబలమవుతునే వుంది.

అదృష్టవశాత్తు అఖిలభారత వార్షికోత్సవానికి రేడియోలో పిల్లల కార్యక్రమ దర్శకుడు ఖుర్షిద్ అన్వర్ చలాకీ పిల్లలను కార్యక్రమానికి ఎంపిక చేసుకున్నాడు. ఆ పిల్లలలో ముంతాజ్ అనే బాలిక వుంది... ఆ కార్యక్రమంలో అందరి కంటే ఆట, పాటల్లో ముంతాజే ప్రథమస్థానం కావడం, ఆ కార్యక్రమాన్ని బొంబాయి టాకీస్ అధిపతి కీ. శే. చునీలాల్ ఢిల్లీలో వుండగా వినడం జరిగింది. ఆ బాలిక గురించి తెలుసుకొని వాళ్ళింటికి వెళ్ళాడు. పిల్ల తండ్రితో చెప్పాడు. ''మీ అమ్మాయిని బొంబాయి తీసుకు వెళ్ళి మా చిత్రాలలో నటింపజేస్తాను. మీ అంగీకారం తెలియజేయండి'' అన్నాడు.

''మిస్టర్- మిస్సెస్ 55''లో...



తండ్రి అంగీకరించి ముంతాజ్‌తో పాటు కుటుంబ సభ్యులను తోడుగా పంపించాడు.

బొంబాయిలో ముంతాజ్ దేవికారాణి సంరక్షణలో వుండేది. అప్పుడు బొంబాయి టాకీసు వారు 'బసంత్' తీస్తున్నారు. అందులో ఉల్లాస్, ముంతాజ్ శాంతి, ముంతాజ్ అలీ, సురేష్ ప్రధాన పాత్రలు నటించారు. ఉల్లాస్ కూతురుగా ముంతాజ్ నటించింది. అప్పటికి ముంతాజ్ వయస్సు 8 సంవత్సరాలు. చిత్రదర్శకుడు అమియా చక్రవర్తి. ఈ చిత్రం ప్రజాదరణ పొందింది.

దేవికారాణికి ముంతాజ్ పేరు నచ్చలేదు. అందుచేత మధుబాల అనే పేరు పెట్టింది. ముద్దుగా చూచుకొనేది. అప్పుడు నెలకు జీతం రు. 150 లు మధుబాలకు ఇచ్చేవారు.

మళ్ళీ ఢిల్లీ చేరుకుంది మధుబాల. నాట్యం, సంగీతంలో బాగా అభివృద్ధి సాధించింది, అలా మూడేళ్ళు గడచిపోయాయి.

మధుబాల 11 ఏళ్ళ బాలిక. నాటి ప్రముఖ దర్శకుడు అమియా చక్రవర్తి ఢిల్లీ వెళ్ళి మధుబాల తండ్రిని కలుసుకొని, మధుబాలను సినిమాలో నటించడానికి పంపమన్నాడు. నెలకు 300 లు జీతం ఇస్తానన్నాడు. ఈ సారి మధుబాలతో పాటు కుటుంబం

అంతా బొంబాయి బయలుదేరింది బొంబాయిలో చిన్న ఇల్లు అద్దెకు తీసుకొని వుంటున్నారు

## ముంతాజ్ మహల్

రంజిత్ కంపెనీ అధిపతి చందూలాల్‌షా తమ "ముంతాజ్ మహల్"లో నటించ డానికి మధుబాలతో ఒప్పందం చేసుకున్నాడు ఈ చిత్రంలో చంద్రమోహన్, ఖుర్షీద్ నాయికా నాయకులుగా నటించారు మధుబాల ఈ చిత్రంలో 'జహనారా' పాత్రను ప్రశంసనీయంగా నటించింది దీంతో రంజిత్ వారి చిత్రాల్లో వరసగా నటించే అవకాశం లభించింది ధన్నాభగత్, పూజారి ఫుల్‌కరీ, రాజ్‌పురాని, చిత్రాల్లో నటించాక మధుబాలకు పేరు, పైసాతో పాటు అనేక మంది సినిమా ప్రముఖులతో పరిచయం లభించింది అందులో కేదార్ శర్మ ఒకడు బహుముఖ ప్రజ్ఞాశాలి

అయిన ఇతని దర్శకత్వంలో 'నీల్ కమల్" తీయ నారంభించి మధుబాల నాయకిగా రాజ్‌కపూర్‌ని నాయకుడిగా, మరో ముఖ్య పాత్రకు బేగం పారాను నియమించుకున్నాడు చిత్రం కళా విలసితంగా తయారయింది మధుబాల నాయకిగా నిలద్రొక్కుకోడానికి ఈ చిత్రం దోహదపడంది ఈ చిత్రంతో రంజిత్ కంపెనీ వారి 3 ఏళ్ల ఒప్పందం పూర్తయింది

తర్వాత మోహన్‌సిన్హా "మురారి పిక్చర్స్"తో నటించడానికి ఒప్పందం కుదిరింది వీరి 5 చిత్రాలలో నటించింది అవి మేరె భగవాన్, దునియా, ఖూబ్ సూరత్, దిల్ కి రాణి, ఇతిహాస్ చితౌడ్– విజయ్ ఈ ఐదు చిత్రాలు అఖండ విజయం పొందాయి దిల్ కీ రాణి, చితౌడ్– విజయ్‌లో రాజ్‌కపూర్ నాయక పాత్ర నటించాడు ఖూబ్ సూరత్, దునియాలో వాస్తి నాయక పాత్ర నటించాడు మేరె భగవాన్ చిత్రంలో సురేష్ నాయక పాత్ర నటించాడు

## అమర ప్రేమ

1948 నుంచి సంవత్సరాల ఒప్పందాలు లేకుండా నటించడం జరిగింది నటరాజ్ ప్రొడక్షన్స్ వారి "అమరప్రేమ' "రాదా" చిత్రాలలో నటించింది 'రాదా" చిత్రంలో కృష్ణ భూమికను ఎవరు ధరించారో తెలుసా!రాజ్‌కపూర్ ('వాల్మీక లో నారదుడు పాత్రను రాజ్‌కపూర్ వేశాడు) నజాం నక్వీ వారి 'పరాయి ఆగ్"లో ఉల్హాస్‌తో నాయకిగా నటించింది పూనా ప్రభాత్ వారి "అపరాది లో రాంసింగ్‌తో నటించింది కె బి లాల్ వారి "లాల్‌దు పట్టా" లో రాజన్ హాక్ సర్‌తో నటించింది

మధుబాల కీర్తి చంద్రికలు దేశమంతటా విస్తరించాయి అనేక మంది నిర్మాతలు– దర్శకులు తమ తమ చిత్రాల్లో నటించమని కోరారు వచ్చిన అవకాశాలు కాదనకుండా ఒప్పుకుంది నటించింది

కేదార్‌శర్మ స్వంత స్టూడియో నెలకొల్పి, స్వంత చిత్రాలు తీయడం అరంబించాడు "ఓరియంటల్ పిక్చర్స్" అనే సంస్థ పేరు మీద ప్రధమ చిత్రం "నెక్



'చల్తీ కా నామ్ గాడీ'లో ...



ఖౌర్ బడీ" తీశాడు. ఇందులో మధుబాల, కేదార్‌శర్మ నాయకీ- నాయకులుగా నటించారు.

తర్వాత వరుసగా మలారి, పారస్, నిశానా, బేకసూర్. మహల్ చిత్రాల్లో నటించింది. ఈ నాల్గు చిత్రాల్లో వైవిధ్యమైన భూమికలను చక్కగా నటించింది. 'మహల్' ఆర్థికంగ విజయవంతమై, నటిగా మధుబాలకు ఉన్నత స్థానం లభించింది.

నిరాలా, ఆరామ్, ఖజానా, నాజ్‌నీన్, బాదల్, సాఖి, పరదేశి, తరానా, సంగ్‌దిల్, అమర్, కాలాపానీ, చల్తీకా నామ్ గాడీ, ఇన్‌సాన్ జాగ్ ఉఠా, పాగున్, మిస్టర్ అండ్ మిస్సెస్ 55, అర్మాన్, లడ్కీ, షరాబీ, జ్వాలా, జాలీనోట్, ఏక్‌సాల్, దో ఉస్తాద్, రాజీహత్, పోలీస్, పాస్‌పోర్టు, హౌరా బ్రిడ్జ్, మధుబాల, షిరిన్ పరహాద్, బర్సాత్‌కి రాత్, మొఘల్-ఎ- ఆజమ్, మహలోంకి ఖ్వాబ్, దేఖేకిమల్‌మల్, హాఫ్ టికెట్, జుమ్రూ, చలాక్ మొదలగు చిత్రాలలో నాయకిగా నటించి యావద్భారత దేశ ప్రజల హృదయాల్లో స్థానం సంపాదించుకుంది. ఎప్పుడూ చిరునవ్వులు చిందిస్తూ, ధవళ వస్త్రాలను ధరిస్తూ దేవకన్యలా కనిపించేది

తెలుగులో విజయవంతమైన జెమినీ

## మధుబాల

వారి 'బాలనాగమ్మ' చిత్రాన్ని ఎస్. ఎస్. వాసన్ హిందీలో తీయ తలపెట్టి కాంచనమాల నటించిన పాత్రను మధుబాల చేత నటింపజేశాడు. (గాంధ్లసంగు పాత్ర మన సావిత్రి నటించింది).

మధుబాల ఒకసారి ప్రముఖ హిందీ పత్రికలో తన గురించిన విశేషాలు వివరించింది. "నేనప్పుడు చిన్నపిల్లను.



రంజిత్ స్టుడియోలో 3 వందలు జీతానికి వారి చిత్రాల్లో నటిస్తుండేదాన్ని మా తండ్రి వ్యాపారం మందగించడం చేత ఆర్థికంగా ఇబ్బందులకు లోనవుతుండే వాళ్ళం ఒక్కోసారి రాత్రికి భోజనం ఉండేదికాదు ఆ దినాలు చాలా నికృష్టమైనవి'

మా అమ్మకు పురుడు వచ్చిందప్పుడు చాలా ప్రమాద పరిస్థితి ఏర్పడింది బ్రతుకుతుందని ఆశ లేకుండా పోయింది వెంటనే ఆస్పత్రికి తీసుకు వెళ్లాం చికిత్స కోసం రెండు వేలు అవుతుందన్నారు డాక్టరుగారు అంత డబ్బు ఎలా సంపాదించడం అనే బెంగ మా నాన్నకు నాకు కలిగాయి మా నాన్న నేను రంజిత్ స్టుడియోకి వెళ్లి శేఠ్ రతీభాయ్‌కి మా పరిస్థితి విశదం చేశాం వెంటనే రెండు వేలు ఇచ్చాడు ధన్యవాదాలు అర్పించి, ఆ డబ్బు డాక్టరుకి అందజేశాం అమ్మ బ్రతికింది పుట్టిన శిశువు మరణించింది మమ్మల్ని ఆదుకున్న శేఠ్ రతిబాయ్‌ని నా జీవితంలో మరిచిపోను'

'అనేక ఉత్తమ చిత్రాలు తీసిన కేదార్‌శర్మ నా గురువుగారు వరే నాకు నటన అంటే ఏమిటో నేర్పారు సాహసించి నాతో నీలకమల్'లో నాయికగా నటింపజేశారు ఇలాంటి గురువును పొందినందుకు ఆనందిస్తుంటాను

మద్రాస్ జెమినీవారి బహుత్ దిన్ హుయే' లో నటించడానికి మద్రాస్ వెళ్ళి కాన్‌మెరా హోటల్‌లో బస చేశాం రెండు రోజులు చిత్రీకరణ అయ్యాక నా ఆరోగ్యం దెబ్బతింది లేవలేని పరిస్థితి ఏర్పడింది అప్పుడు వాసన్‌గారు పేరుపొందిన విదేశి డాక్టర్‌ని తీసుకువచ్చి నాకు చికిత్స చేయించారు నా అనారోగ్యం వల్ల చిత్రం తీయడం కొన్నాళ్ళు ఆపు చేయించారు వాసన్ దంపతులు- నా దగ్గరుండి పళ్ళు అవి తినిపించి తల్లిదండ్రుల్లాగా సేవ చేశారు ఇలాంటి సహృదయ దంపతులను నేనెలా మర్చిపోగలను?"

"నటుడు అశోక్‌కుమార్ భార్య శోభ నటుడు భారత్‌భూషణ్ భార్య సరళ ఇద్దరూ నా జీవితంలో మరుపురాని

మహిళలు వీరిరువురూ ఎంతో అభిమానం, వాత్సల్యం చూపేవారు"

"ఈ పైన పేర్కొన్న సహృదయులైన వ్యక్తులందరూ నాకు అనేక విధాలుగా సహాయ, సహకారాలు అందజేసి, నా జీవితానికి వెలుగు ప్రసాదించారు వీళ్ళందరినీ నా జీవితంలో ఎన్నటికి మర్చిపోలేను' అంటూ వారందరి యందు కృతజ్ఞతా భావాన్ని వెల్లడించింది

మధుబాల అందానికి ప్రముఖ సినీనటులు, నిర్మాతలు- దర్శకులు, పెద్ద వ్యాపారస్తులు ముగ్ధులై పెళ్ళి చేసుకోవాలని కలలు కంటుండేవారు అయితే ఆమె మనసు దిలీప్‌కుమార్ యందు లగ్నమయి ఉండేది వారిరువురు ఎంతో చనువుగా- సన్నిహితంగా కొన్నాళ్ళు గడిపారు పెళ్ళి చేసుకుంటున్నారని పత్రికల్లో వార్తలు కూడా వెలువడ్డాయి ఏవో కారణాల వల్ల వారి ప్రేమ- పెళ్ళిగా మారలేదు ఆ తర్వాత గాయక- నటుడు కిశోర్‌కుమార్‌తో మధుబాల పెళ్ళి జరిగింది కొన్నాళ్ళు ఈ దంపతులు సుఖంగా గడిపారు





## ఆఖరు చిత్రం

విధి వక్రించింది! మందహాసంతో ఎప్పుడూ కళకళలాడే మధుబాలకి గుండె జబ్బు వచ్చింది ఇంగ్లండ్ వెళ్ళి చికిత్స చేయించుకుని వచ్చింది డాక్టర్ల సలహా పాటించి చిత్రాల్లో నటించడం విరమించుకొని పూర్తి విశ్రాంతి తీసుకుంది 1966 సం॥లో 'చలాక్'లో తన పాత్ర పూర్తి చేసుకొంది అదే ఆఖరు చిత్రం

కొన్నాళ్ళు ప్రశాంతంగా జీవించింది అయితే చిత్రాల్లో నటించలేదు తన కన్నవారింట్లో ఎక్కువ రోజులు గడుపుతుండేది తనకి కావలసిన ఉపచర్యలు చేసేవారు ఉన్నందున

ఆ రోజు ఉదయం 9 గంటలకు గుండె నొప్పిగా వుందని చెప్పి పడుకుంది. మరి కాస్సేపట్లో స్పృహ తప్పింది. డాక్టర్లు వచ్చి కృత్రిమ శ్వాస అందించాల్సి వచ్చింది. 45 నిమిషాలు ఉక్కిరి బిక్కిరయి పోయింది. నోరు మూగబోయింది. 9-45 గంటలకు ప్రాణం విడిచిపెట్టింది... ఆమె ప్రక్కనే తల్లితండ్రులు దుఃఖిస్తూ స్పృహతప్పి పడిపోయారు. భర్త కిషోర్‌కుమార్ కుప్పకూలిపోయాడు. ఆ ఇల్లు- ఆ వీధి



శోక సముద్రంలా మారిపోయింది మధుబాల మరణవార్త క్షణాల్లో బొంబాయి నగరమంతా వ్యాపించింది సినిమా పరిశ్రమలో వారంతా ఎకాఎకిని బయలుదేరి వచ్చారు అశోక్‌కుమార్, నర్గీస్, కమల్ అమరోహి, ఆసిఫ్, అజిత్, కుంకుం, నిమ్మి, అమిత, చాంద్ ఉస్మాని, రెహమాన్, షమ్మి, విజయలక్ష్మి, తబసమ్ మొదలగువారంతా వెంటనే వచ్చి మధుబాల మృతదేహాన్ని చూచి కన్నీరు కార్చారు

మధ్యాహ్నం శాంతాక్రజ్‌లో వున్న జుహూరోడ్ శ్మశానంలో అంతిమ సంస్కారాన్ని జరిపారు

సునీల్‌దత్, రాజ్‌కుమార్, పృధ్వీరాజ్, దిలీప్‌కుమార్, ఆషాపరేఖ్, మాలాసిన్హా, శశికపూర్, నౌషాద్ మొదలగువారు మధుబాల తండ్రి యింటికి వెళ్ళి ఆమె కుటుంబానికి తమ సంతాపం తెలియజేశారు

14-2-1933 సం లో జన్మించి 23-2-69 సం లో మదుబాల మరణించింది 36 ఏళ్ళు భూమ్మీద జీవించి, లక్షలాది అభిమానులను సంపాదించుకుంది భారతీయ చలనచిత్ర ప్రపంచంలో ఒక అందాల తార రాలి పోయినందుకు సినిమా అభిమానులు బాధపడ్డారు

- ఆరిపాక సూరిబాబు

# తోడు-నీడ

- సమ్మా ప్రసాదరావు.

నమ్మిన ఆదర్శం ప్రకారం నడుచుకోవడాన్ని కరేజ్ ఆఫ్ కన్విక్షన్ అంటారు. ఒకటి నమ్మడం, నమ్మినదే ధైర్యంగా ఆచరించగలగడం స్థిర చిత్తులకే సాధ్యం.

అయితే ఏ పుట్టలో ఏ పాముందో, ఏ రాయిని మొక్కితే ఏ మేలు ఒనగూడుతుందో అనేతత్వం ఈనాడు బాగా చదువుకున్న వాళ్లలో కూడా పాతుకుపోయింది. ఈ రెండోకోవకు చెందిన వాళ్లు డబ్బే తప్ప మిగతా విలువలని పాటించని శుష్క జీవులు.

ఉత్తమమైన ఆదర్శాన్ని ఎన్నుకొని, దానికి జీవితం అంకితం చేసుకోవడం గొప్ప విషయం. జీవితానికి ఒక లంగరు అంటూ లేకపోతే అంధకారం ఎదురౌతుంది.



ఈ ప్రపంచంలో రోజులు మారుతున్నాయా? లేక మనుషులు మారుతున్నారా?

ఈ ప్రశ్న సగటు మానవుడి మదిలో తరచు మెదులుతూ ఉంటుంది. రోజులు ఎప్పటిలాగే ఉంటున్నాయి.మనుషులూ ఎప్పటిలాగానే ఉంటున్నారు. కాని మనుషులలోని పరోపకారబుద్ధి నశించి స్వార్థం పెరిగి పోవడంవలన జీవన పరిణామాల్లో కొట్టవచ్చిన మార్పు కనుపిస్తున్నాది. ఇది కటికసత్యమైనా, ప్రతీ ఒక్కడూ తానూ, ఈ సంఘంలో మనిషేనని అందరూ నడిచే బాటలో వెళ్లడంలో తప్పేముందని నెపాన్ని సంఘం మీద ఆపాదిస్తాడు. అయితే ఈ తత్వానికి అతీతులు లేరని కాదు.

ఆఫీసు గదిలోంచి బయటకొచ్చిన నా ముఖం వివర్ణమైంది. నా చేతిలోని బ్రీఫ్ కేసునాకే బరువనిపించింది. ఇలాంటి పరిస్థితిని ఎదుర్కోవలసివస్తుందని నేను ముందుగా వూహించలేదు.నాకు సలహా ఇచ్చినవాళ్లు కూడా చూచాయగానైనా నన్ను హెచ్చరించలేదు. పైగా ప్రోత్సహించారు.

తను వెనుతిరిగి వచ్చేస్తూ ఉంటే "సాయంత్రం ఆరు గంటలు దాటిన తరువాత నా బసకు రండి అక్కడ అన్ని విషయాలూ మాట్లాడుకుందాం" అంది ఆమె.

ఇంకా ఏం వెళ్తాను? వెళ్లగలిగే ధైర్యం మాత్రం ఏది?

పది సంవత్సరాలు గతంలోనికి వెళ్లిపోయాను.

బి.ఎ. పాసైన తను అప్పుడే ఎల్.డి.సి.గా ఉద్యోగంలో చేరాడు. తల్లిదండ్రులు తన పెళ్లి చేయాలనుకున్నారు. ఈడెదిగిన ఆడపిల్ల గుండెలమీద కుంపటిలా వుంది. తన పెళ్లికన్నా చెల్లెలి పెళ్లి తల్లిదండ్రుల్లకు ముఖ్యం. చెల్లి పెళ్లి చేయాలంటే బోలెడు డబ్బు కావాలి. అందుకు తను సాధనం.

## ప్రాణ్ స్వర్ణోత్సవం



ప్రముఖ నటుడు ప్రాణ్ చిత్ర రంగంలోకి ప్రవేశించి 50 సంవత్సరాలు పూర్తయింది. విచిత్ర మేమిటంటే ఈ విషయం ఆ రంగంలోని వాళ్లకే తెలియలేదట. తాను యిన్నాళ్ళూ చిత్ర రంగానికి చేసిన సేవను సినిమా రంగమే కాక, పత్రికలు కూడా గుర్తించట్లేదని వాపోయాడట ప్రాణ్. చిత్ర రంగంలో 50 సంవత్సరాలు పూర్తి అయిన విషయం కూడా ప్రాణ్ చెప్పేవరకు ఎవరికీ తెలియలేదంటే నిజంగా చింతించవల సిందే!

ఎన్నో సంబంధాలు వస్తున్నాయి. కొన్నిటిని పిల్ల నచ్చక ఇష్టపడలేదు. కొన్ని కట్నం దగ్గర పొంతన కుదరలేదు. చెల్లెలి పెళ్లి సవ్యంగా జరగాలంటే తన కాబోయే మామగారు కనీసపక్షం పదిహేను వేలు కట్నం ఇవ్వాలి. అప్పటికీ కట్న కానుకల విషయంలో తనకు ఇదమిద్ధంగా ఎలాంటి అభిప్రాయం లేదు. తండ్రిచాటు బిడ్డడు తను తండ్రి తన మంచినేగాని చెడును కాంక్షించడుగా?

ఆ సమయంలోనే రామకృష్ణారావుగారింటికి పెళ్లి చూపులకు వెళ్లాడు తను తల్లిదండ్రులతోపాటు.

అతని పేరు గుర్తుండిపోయింది. ఆ పిల్ల ముఖం కూడా గుర్తుండిపోయింది.

"అబ్బే! పదిహేను వేలకు ఒక్క పైసా కూడా తగ్గదు" తన తండ్రి దృఢంగా అన్నాడు.

అంతవరకు చూసిన పిల్లలందరికంటే ఆమె యోగ్యురాలిగా కనుపించింది తన కంటికి. అమ్మ కూడా ఆ పిల్లను నచ్చుకున్నట్లు తను గ్రహించాడు. ఇదీ కట్నం దగ్గర చెడిపి పోవలసిందేనా? తన తండ్రిది మంకుపట్టు. అతన్ని ఎదిరించే ధైర్యం లేదు. 'నాన్నా! వాళ్లు ఇంతో అంతో ఇస్తామంటున్నారు. దానితో సంతృప్తి పడరాదూ!' అందా మనుకున్నాడు. తండ్రి తన వుద్దేశాన్ని పసికట్టనే కట్టాడు.

"రామకృష్ణారావుగారు! అసలు కట్నం తీసుకోవాలన్న కోరిక లేదు. కానైతే ఏం చెయ్యను? నాకూ ఒక ఆడపిల్ల వుంది. దాని పెళ్లి చేయాలి. మా దగ్గర బొక్కసాలలో డబ్బు లేదు. ఉన్నదేదో వీళ్ల చదువులకి హారతి కర్పూరమైంది. అందుకే నేను ఇంత నిక్కచ్చిగా మాట్లాడుతున్నాను. ఇంతకన్నా ఎక్కువ కట్నం ఇస్తామన్న వాళ్లు లేకపోలేదు. అయితే ఈడూ జోడూ కులం గోత్రం వంశ మర్యాదా కూడా చూసుకోవాలిగా!"

అతను ఇంత ఖరాకండిగా చెప్పడం ఇది మొదటిమారు కాదు. ఇంతకుముందు మూడు సంబంధాలు కట్నం దగ్గరే తప్పిపోయాయి.

తాను ఏమని కలుగజేసుకోగలడు?

తండ్రిని ఎదిరిస్తే 'నువ్వు కృతఘ్నుడివి. నీ లాలనా పాలనా చేసి ఇంత చదివించాం. ఈనాడు రెక్కలొచ్చాయ్ ఎగిరిపోతావా? చెల్లెలిపెండ్లి బాధ్యత నీకు మాత్రం లేదా? దాన్ని కట్నం లేకుండా ఎవరైనా చేసుకుంటారా? ఆలోచించుకో' అని అంటాడు.

అందుకే తను తన మనోభావాలను వ్యక్తం చేయలేని అసమర్థుడు.

"మావాడు చాలా మంచివాడు. నామాట కాదనడు. పెళ్లికాకుండా వుండిపోతాడా? చూస్తూ ఉండు ఇంతకంటే మంచి సంబంధమే చేస్తాను" ప్రతీ మారూ తండ్రి అనే మాట.

తను అడకత్తెరలో పోకచెక్క. తండ్రిని ఎదిరించలేడు. ఆడపిల్లవాళ్లను నొప్పించలేడు.

మామూలుగా అయితే వాళ్లు మరి కొంతసేపు ప్రాధేయపడతారు. తమ కష్ట నిష్టూరాలు ఈతిబాధలు వల్లిస్తారు. లేదా ఇచ్చుకోగలిగిన స్థోమతవుంటే బేరం కుదరకపోతే సరే నంటారు.

ఈ సంబంధం కుదురుతుందా? లేక కట్నం దగ్గర కుదరని నాలుగవ సంబంధం ఔతుందా అని ఆలోచిస్తూ శిలా ప్రతిమలా కూర్చుండిపోయాడు.

"ముకుందరావుగారూ! పధ్నాలుగు వేల తొమ్మిది వందల తొంభై తొమ్మిది రూపాయలు మా వాళ్లు కట్నం ఇస్తారు. ప్లీజ్! ఒక్క రూపాయి తగ్గించండి!"

పెళ్లికూతురే ఇలా అంటుందని చివరకు ఆమె తల్లీతండ్రీ కూడా వూహించలేదు. ముందుగా ఆశ్చర్యం నుంచి తేరుకున్నది ఆమె తండ్రి.

"నీరజా! పెద్దవాళ్లతో పరాచికాలు ఏమిటి?" అని ఆమెను మందలించి "క్షమించండి! అమ్మాయి తొందరపడి దురుసుగా ప్రవర్తించింది. మీరడిగినంత మేరకు మేం తూగలేం" అన్నారు రామకృష్ణారావుగారు.

తన తండ్రి కది అవమానంగా తోచింది. ఏం తను లోక విరుద్ధంగా అడిగాడా? పదిహేను వేలు కట్నం అడిగాడు. చదువుండి ఉద్యోగం వున్న కుఱ్ఱవాడు, ఈ రోజుల్లో అది అంత అధికమా? ఎవరు మాత్రం కట్నం తీసుకోకుండా మడికట్టుకు కూర్చున్నారు? తమకందుబాటులో లేకుంటే సవ్యంగా ఆ మాట చెప్పవచ్చు. ఆడపిల్ల- తనను ధిక్కరిస్తుందా? ఈ రోజే ఇంతమాట అందే రేపు ఆమె కోడలై వస్తే కాల్చుకు తినదూ?

అతను రామకృష్ణారావుగారు చెప్పబోయే ఎలాంటి సంజాయిషీని వినదలుచుకోలేదు. విసురునలేచి, కండువాదులుపుకొని "లే పార్వతీ! లేరా" అని తమతో అని విసవిసా నడిచారు. అతని వెనక తన తల్లీ, ఆమె ననుసరించి తనూ ఆలోచనారహితంగా నడిచారు.

"నాన్నా! నా పెళ్లి కోసం మీరు దిగులెందుకు పడతారు? అసలు ఈనాటి యువత నిర్వీర్యమైంది. ఎన్నాళ్లు కష్టపడితే అతను సంపాదించి పదిహేను వేలు నిలువచేయగలడు? అటువంటిది అప్పనంగా ఏ శ్రమా లేకుండా, ఏపన్ను కట్టకుండా ఆడపిల్లను కన్న పాపానికి ఒక అయ్య తన కాళ్లు కడిగి చేతిలో ఆ డబ్బు పోస్తూ వుంటే తను ఒక హీరో అనుకుంటున్నాడు. ఆ అల్పత్వాన్ని బాజాబజంత్రీలతో మెచ్చుకుంటున్నారు పెళ్లికి వచ్చే మనుషులు. డబ్బే తప్ప మిగతా విలువలకు ప్రాధా

న్యత నియ్యరు ఈ యుగపురుషులు."

ఆమె మాటలు కర్ణకఠోరంగా వినిపించినాయి నాకు. ఆమె అన్నది యథార్థమా? అది ఎంతటి కటికసత్యమైనా ఇతరులను తూలనాడే అధికారం ఆమె కెవరిచ్చారు?

తన తండ్రి కోరినది సబబుకాదా? ఈ ప్రపంచంలోని తదితర వ్యక్తులు చేస్తున్నట్లే నడుచుకుంటున్నట్లే తామూ నడవాలనుకుంటున్నారే! రామకృష్ణారావుగారు రేపు తన కుమారుడి పెళ్లికి కట్నం తీసుకోరా? ఆ మాటకొస్తే అతని పెండ్లికి అతను మామగారు కట్నం ఇవ్వలేదా? గుడ్డొచ్చి పిల్లనెదిరించిందట. నిన్నగాక మొన్న జ్ఞానమొచ్చిన ఒక ఆడపిల్ల పెద్దలను వాళ్లు పెట్టిన ఆచార వ్యవహారాలను ధిక్కరిస్తుందా? తను యథార్థాన్ని అంగీకరించలేకపోయాడు.

అయితే ఆ సంగతులను మరచిపోయాడు.

నిజమే! తన తండ్రి తన మెడలో బోర్డు కట్టి సంతలో పశువులా అమ్మచూపాడు. పరిస్థితులతో రాజీ పడడంకన్నా మరో మార్గాంతరం లేక తను తండ్రితో తెగతెంపులు చేసుకోలేదు. ఎంతైనా అతను తండ్రి. పితృదేవోభవ అంటారు. ఈనాడు ఈ మాత్రం చదువుకొని వుద్యోగం చేస్తున్నాడంటే అది అతని చలవవలన కాదూ? శ్రమపడి, తను తిన్నా తినకున్నా, అప్పులో సప్పులో చేసి వున్నవి తెగనమ్మి చదివించాడు. అతనికి విధేయుడై వుండడం తన కర్తవ్యం.

వేలం పాటలో తండ్రి అనుకున్నదానికన్నా అధిక ధరకే అమ్ముడు పోయాడు తను. అయినా ఎలాంటి న్యూనతను తను అనుభవించలేదు. సుజాత తనకు తగిన అర్ధాంగే ·అనిపించుకుంది.

కాలం దొర్లిపోతోంది. సంసారం అన్న తరువాత కష్టం సుఖం వుంటాయి. సగటు మనిషిలా ఆటూ పోటులను భరిస్తూ రోజులు గడపసాగాడు.

అయితే నీరజ ప్రసంగం అప్పుడప్పుడు వచ్చేది.

"ఆ! ఆమెకు కట్నం అవాంఛనీయంగా తోచింది. ఇది మరీ విడ్డూరం. నీరజ ఆ రోజు అలా మిడిసిపడింది కాని ఎప్పుడో ఆమె చక్కా కట్నం ఇచ్చి మొగుడ్నే కనుక్కొనే వుంటుంది. అసలు నాకు మిమ్మల్ని, మీకు నన్నూ రాసి పెట్టాడు. అందుకే ఆ సంబంధం అలా తెగతెంపులైంది" సుజాత నవ్వుతూ అనేది.

నీరజ పట్టుదలగల మనిషి, కట్నం ఇచ్చి మాత్రం పెళ్లి చేసుకొని వుండదు అని నాకు అనిపించినా, సుజాత మాటలను కొట్టిపారేయలేకపోయాను.

ఈ రోజు ఆ నీరజనే చూడవలసివస్తుందని కలలోనైనా భావించలేదు. మా హెడ్డాఫీసులో పై అధికారి ఒక మహిళ అని విన్నాను కాని ఆమే నీరజ అని నేను భావించలేదు.

నాపాటి ,సర్వీసు వున్నవాళ్లు ఈనాడు హెడ్ గుమస్తాలయ్యారు. నా జూనియర్లు కూడా ప్రమోటయ్యారు. కాని నా ప్రమోషను ఆర్డరు రాలేదు. ఒకవంక చింత వేరొకవంక కారణం తెలియక బాధ.




కొందరు మిత్రులు సలహా యిచ్చారు హెడ్డాఫీసులో పై అధికారిని కలవమని.

"ఒట్టి చేతులతో వెళ్లేవు. పై ఆఫీసరు గారికి తృణమో పణమో సమర్పించు. నీ ఫైలు ఎక్కడున్నా, ఎలాంటి అవాంతరాలున్నా చిటికెలో పని జరుగుతుంది" కొందరు సలహా యిచ్చారు.కొన్ని వుదాహరణలు చూపించారు. వాళ్లన్నది నిజమే. నా జూనియర్లు లంచాలిచ్చే ప్రమోషన్లు పొందినట్లు వినికిడి. అయినా ఈ రోజుల్లో లంచాలు సర్వ సామాన్యమైపోయాయి. నేను మడిగట్టుకు కూర్చుంటే రేపు నా జూనియర్లే నామీద అధికారం చూపిస్తారు.

ఇష్టం ఉన్నా లేకున్నా వాళ్ల సలహాను పాటించవలసిందే.

ఎంత దాకా లంచం ఇవ్వాలి? కనీసం మూడు వేలైనా లేనిదే పని జరగదు. పై అధికారితో పని, చిన్న చిన్న లంచాలకు అలాంటి వారు లొంగరు. నేను ఇతరుల ద్వారా తెలుసుకున్నాను.

మూడు వేలు. అదేం చిన్నమొత్తం కాదు. అయితే నా భావిజీవితాన్ని తలచి, భార్య మెడలోని ఒంటిపేట గొలుసును తాకట్టుపెట్టి ఆ డబ్బుతో పై ఆఫీసుకి వెళ్లాను.

ఆమెను చూడగానే 'ఈమెను లోగడ ఎక్కడో చూసాను' అనిపించింది. పది సంవత్సరాల క్రితం నీరజ ఇంతవళ్లు చేసి లేదు. నాజూకుగా పీలగా వుండేది. ముఖంలో సిగ్గు, తపన వుండేవి. ఈవిడ ముఖం గంభీరంగా వుంది. అయితే నీరజను గుర్తించడం కష్టంకాదు. దిష్టిచుక్కమల్లే ఒక మచ్చ ఆమె నదుటమీద ఒక పక్కగా వుంది. ఆమెను పోల్చుకోగానే కించిత్తు ఆశ్చర్యపోయాను. ఆ తరువాత నేరం చేసిన వాడిలా భయపడ్డాను.

ఆ రోజు ఇంత డబ్బు కావాలని ఖరాకండి చేసాము. ఈ రోజు ఇంత ఇచ్చుకోవడానికి సిద్ధంగా వున్నాను అని చెప్పబోతున్నాను. కార్యాలు వేరైనా వ్యవహారం డబ్బుతోనే.

"చెప్పండి. ఏం పని?" అంది.

ఎలా మొదలెట్టాలి? ఏమని చెప్పాలి?

"నా ప్రమోషను గురించి తెలుసుకోవాలని వచ్చాను. రెండు సంవత్సరాల క్రితమే హెడ్ గుమస్తాగా ప్రమోషను కావలసింది. నా జూనియర్లు ఇద్దరు ముగ్గురు ప్రమోట్ అయ్యారు" అన్నాను.



## ముంతాజ్‌తో నిహలానీ మరో చిత్రం

ముంతాజ్‌తో నిర్మించిన 'ఆంధియన్' సూపర్ ఫ్లాప్ అయినా పహ్లాజ్ నిహలానీ చాలా తేలిగ్గా తీసుకున్నాడట. ఆ చిత్రం ఫ్లాప్ అయినంత మాత్రాన ముంతాజ్ తప్పేముంది. సబ్జెక్టు ఎన్నుకోవటంలో జరిగిన తప్పు అని సరిపెట్టుకున్నాడు. అంతేకాదు మంచి సబ్జెక్టుతో ముంతాజ్‌తోనే మరో చిత్రం నిర్మిస్తానంటున్నాడు నిహలానీ భరోసాగా. మరి ఆ చిత్రమైనా సక్సెస్ అవుతుందో? లేదో? వేచి చూడాల్సిందే!

నేను కలియడానికిగాను పంపిన చీటీని చూసింది. నా పూర్తి పేరు నేను రాయలేదు. ఇంగ్లీషు పొడి అక్షరాలు రాసాను. అందువలన ఆమె నన్ను గుర్తించే అవకాశాలు తక్కువ అనుకున్నాను. ఆమె ప్రవర్తనవలనా ఆమె నన్ను గుర్తించింది అనుకోలేదు.

"శేఖర్! మీ జూనియర్లు ప్రమోట్ అయ్యారా? మీరు ఏ కారణం చేత సూపర్ సీడ్ అయ్యారో మీకు తెలియదంటారా? మీలో ఏ లోపాలున్నాయో గ్రహించలేరా? ఏమైతేనేం అన్నీ వివరంగారాసి పి.ఎ.కివ్వండి. నేను స్వయంగా చూస్తాను. పొరపాటైతే మీకు న్యాయం జరుగుతుంది" అంది.

నేను లంచం ప్రసక్తి మాటలాడలేకపోయాను. ఆమెను ప్రసన్నురాలిని చేసుకోవాలని ఈ బ్రీఫ్ కేసులోని డబ్బు అందుకు ఎరగా చూపాలని అనుకున్నాను. నేనా ప్రస్తావన తెస్తే వికటించి నా వుద్యోగానికే ముప్పు వస్తుంది.

నిజమే ఆమె అన్నది అసత్యంగాదు. నాలుగేళ్ల క్రితం నామీద ఆఫీసరు నిష్కారణంగానే నా వార్షిక ప్రతివేదనలో ఒక ప్రతికూల అభియుక్తినిచ్చాడు. ఆ దోష మార్జన కోసమే ఈనాడు ఇలా పరుగెత్తుకు వచ్చాను.

ఆమెకు నమస్కరించి వెనుతిరిగాను.

అదిగో అప్పుడే ఆమె సాయంత్రం తన బసకు రమ్మంది.

ఈమె నుంచి న్యాయం ఆశించడం అవివేకం.

పెళ్లి చూపులలోనే తలవంపులు కలిగించేలా ప్రవర్తించింది. ఆమె కిప్పుడు అధికారమూ అవకాశమూ తోడైనాయి.

మానవుడి ఆశకు అధికారమూ అవకాశమూ తోడైతే నాయకుడౌతాడట. నాయకుడి విశిష్ట లక్షణాలేమిటో చెప్పమని వెనుకటి కెవరో చర్చిల్‌ని అడిగారట. రేపు ఏం జరుగుతుంది, పై వారం ఏం జరగబోతుంది, పై నెలలో ఏం జరగగలదు, పై సంవత్సరంలో ఏం జరిగేది ఖచ్చితంగా చెప్పగలనేర్పు నాయకుడికి వుంటుందట. అయితే అతను చెప్పినట్లు జరగని క్షణంలో, అలా ఎందుకు జరగలేదో చక్కగా విశదీకరించి నమ్మించగల మహత్తర శక్తి నాయకుడికి వుంటుందట. ఆమె ఇప్పుడు నాయకురాలు. తనకు ప్రమోషను ఎందుకు దొరకలేదో చక్కగా చెప్పి నమ్మించగల నెరజాణ.

ఒకరిమీద సదభిప్రాయం కలగకపోవడానికి సరియైన కారణం వుండాల్సిన పని లేదు. వారిలో మంచినికాక చెడునే చూసే ప్రయత్నం చేస్తే సదభిప్రాయం కలగదు. నేను ఆమె దురుసుతనాన్ని, కఠినత్వాన్ని మాత్రమే గుర్తించాను. అనాడు ఈ కట్నం విషయంలో ఆమె ఆవేదన సగటున ప్రతీ గృహస్తూ ప్రతీ ఆడపిల్లా పడుతున్నదేనని ఆలోచించలేదు. బి.ఏ. పాసైన నేను ఈనాడు మామూలు గుమస్తాగా వుండి చిన్న ప్రమోషను దొరకలేదని వ్యథ చెందుతున్నాను. ఆమె నాకన్నా చిన్నది. నేను పెళ్లి చూపులకు వెళ్లినప్పుడు ఇంటరు మాత్రమే పాసైంది. అలాంటిది ఆమె ఎంత కృషి చేసి ఈ పదవిని చేపట్టిందో ఆలోచించలేదు.

పెళ్లి-అక్షరాలు మాత్రం రెండే. కాని ప్రభావం కడు గొప్పది. ఈ శబ్దం కొందరికి శ్రవణానందకరంగావుంటే మరి కొందరికి కర్ణకఠోరంగా వుంటుంది. ఎందుకో మరి.

పెళ్లి చేసుకొని సంసార సాగరంలో కొట్టుమిట్టాడేకంటె, తన కాళ్లమీద తాము నిలబడగలిగి ఒంటరిగా వుండలేరా అమ్మాయిలు? నీరజ ఆనాటి సవాలు ఇదే!

ఆ నీరజ ఈనాడు ఒక ఆఫీసరు. తప్పక ఏనాడో వివాహం చేసుకొని వుంటుంది. పిల్లా పాపా వుండేవుంటారు. తన సంసారాన్ని చూడమనేగా ఇంటికి రమ్మంది. 'ఒరేయ్! రాజశేఖరం నువ్వు ఆనాడు నన్ను కాదన్నావు. అది నామంచికే జరిగింది. ఈ రోజు నేనీ ఉచ్ఛస్థి

కివచ్చానంటే అందుకు పరోక్షంగా నీవే
రణం' అని చెప్పదలచుకుందా?

అసలు ఆమె తనను గుర్తించిందా?

ఛీ! తాను వెనుకటి విషయాలను ర్తు తెచ్చుకొని ఏవేవో వూహిస్తున్నాడు. ంతైనా లంచం డబ్బు ఆఫీసులో తీసు నే ధైర్యం ఎవరికైనా వుంటుందా? హుశా ఆ విషయం గురించి మాట్లాడ నికి రమ్మందేమో!?

మన మనసుకి నచ్చిన విధంలో ఆలో స్తే ఆహ్లాదకరంగా వుంటుంది.

నేను ఆమె ఇంటికి వెళ్లాలనే అను న్నాను.

గేటు దగ్గర ఆడదర్వాను వుంది.

"నీరజగారిని కలవడానికి వచ్చాను" ని చెప్పాను.

ఆమె ఒక నెంబరు చెప్పి వెళ్లమంది.

ఆ ఇల్లు ఏ ఒకరికో చెందిన బంగళా దు.

ఆమె చెప్పిన నెంబరు గల బ్లాకుకి ళ్లాను.

బెల్ మ్రోగగానే నీరజ తలుపు తెరి ంది.

"వస్తారనే అనుకున్నాను" అంది.

## తోడు-నీడ

కూర్చుందికి గాను కుర్చీ చూపింది. నౌకర్ని పిలిచి కాఫీలు తెమ్మంది.

"మీకు అన్యాయమే జరిగితే నేను సవరించే ప్రయత్నం చేస్తాను"అంది.

థాంక్స్ చెప్పాను.

"మిమ్మల్ని ఆఫీసులో చూడగానే నాకు వెనుకటి సంగతి గుర్తుకొచ్చింది. మిమ్మల్ని నేను పోల్చుకోగలిగాను. మీరు నన్ను పోల్చలేదా!?"అంది.

నా గొంతుకలో వెలక్కాయ పడిన ట్లైంది. పోల్చుకున్న విషయం చెప్పాను.

"అయినా మీరు వచ్చారంటే ఆనాటి నా దుడుకుతనాన్ని క్షమించినట్లే భావి స్తున్నాను."

నేను మాట్లాడలేదు.

"పెళ్లి అయిందా అని అడగను. పిల్ల లెందరు? ముఖ్యంగా ఆడపిల్లలెందరు?"

నాకు అర్థమైంది. ఆమె నన్ను అవ మానించడానికే పిలిచింది.

"కాఫీ తీసుకోండి"బిస్కట్ల ప్లేటూ కాఫీ నా ముందు వుంచింది.

స్త్రీలు ఒంటరిగా వుండలేరా? నామ ట్టుకు నాకు వుండగలరు అనిపించేది. ప్రతి మనిషికి తోడు కావలసిందే. కాని తోడు కంటే ముఖ్యం నీడ. నీడ తరవాతనే తోడు. అయితే మావాళ్లు నాతో ఏకీభవిం చలేకపోయారు. కాని నేనే మొండికేశాను. చదువుకొనసాగించి ఈ నాడు ఈ నీడను సంపాదించాను. నాలా పెళ్లికాని యువ తుల్ని చదువుకి ప్రోత్సహించి వారిని కూడా వుద్యోగాల్లో చేరి ఒకనీడను సంపాదించు కోమన్నాను. నేటికి ఒక డజను మంది పెళ్లికాని లేదా చేసుకోని యువతులం ఇక్కడ ఒకే గూటిలో వుంటున్నాం.

కట్న కానుకల లాంఛనాలను నేను కాదనను. శక్తికి మించి కట్నం ఇస్తే అది నేరంగా పరిగణిస్తాను. మాలా మరి కొందరు యువతులు ఈ బలవంతపు కట్నా లను ఎదిరిస్తే రానున్న శకంలోనైనా అనుబంధాల తీరు మారుతుందని ఆశిస్తు న్నాను" అంది.

ఆమె చెప్పిన యదార్థాన్ని నేను అంగీ కరించగలనా? ఏమో!? ○




దిట్ట కవి శ్రీకాంత, చీరాల.

రామలక్ష్మిగారూ యింత వరకు మీరు రాసిన నవలలు ఎన్ని?

● ఏం ఇదో రకం పరిశోధనా?... చాలానే రాశాను.

అరుద్రగారిని కలవాలని వుంది. ఎప్పుడు రమ్మంటారు?

● ఎందుకో చెప్పకపోతే- ఎలా?!

మల్లాది సుబ్బమ్మగారిపై మీ అభిప్రాయం?

● ఆవేశం ఎక్కువే. మంచి వ్యక్తి.

జి. రమేష్‌బాబు, పత్తిపాడు.

నేటి మనిషికి సాటి మనిషి విలువ ఇంకెప్పుడు తెలుస్తుంది?

● ఎవరికేనా సరే- మనిషైనా వస్తువైనా సరే- విలువ తెలిసేది- అది పోగొట్టుకున్నప్పుడే!

నేడు నిజంగా ధర్మం ఒంటి పాదం మీదనైనా నడుస్తుందంటారా

● ఎలా? మన రోడ్లు యిలా వుంటే!

నేటి ధరలు? మీ కామెంట్...

● మరిచి పోవడం మంచిది.

గాదె లక్ష్మమ్మ, బరంపురం.

ఈ మధ్యనే ఒక పుస్తకంలో చదివాను. నమస్కార ధర్మం అన్న విషయంపై- మన హిందూ ధర్మశాస్త్రం స్త్రీలకు నమస్కారం చేయడం నిషేధం- అంటే నమస్కారం పెట్టకూడని వారిలో స్త్రీలు అని స్పష్టంగా వుంది. ఇది చాలా ఘోరంగ వుందికదా?

● మన ధర్మశాస్త్రాలలో స్త్రీని దూరంగా వుంచే అంశాలే ఎక్కువగా వుంటాయి. దానికి మీరు యింత ఆశ్చర్య పడితే లాభంలేదు- అర్థం చేసుకోండి. ఆడదాని జీవితాలకి వీరిచ్చిన విలువ. ఏ ధర్మశాస్త్రమూ- ప్రాణమున్న మనిషిని- నిర్లక్ష్యం చేయమని శాసించ కూడదు. అలా శాసిస్తే అది ధర్మశాస్త్ర మేమిటి? అటువంటి ఛాందస సంప్రదాయాలకి తక్షణం స్వస్తి పలకాలి... కాని మతం గురువులు- యీదేశానికి పెద్ద మత్తుమందు. వారివారి సౌకర్యాలను పట్టి, అవసరాలను పట్టి, అధికృతను పట్టి- నమ్మిన వారిపై కట్టుబాట్లు ఆంక్షలు, వడ్డిస్తూ వుంటారు? మత్తులో మునిగే భక్త కోటికి దెక్కడ అనుతుంది- 'సై' అంటే 'కాబోసు' అనుకుంటారు!

ఎ. శ్రీనివాస శాస్త్రి, హైదరాబాదు.

కొద్ది వారాలుగా ప్రశ్నావళి వారపత్రికలో చదువుతున్నాను. 'ఈ




శీర్షికలో పాఠకులకు మీరిచ్చే సమాధానాల వల్ల మీకు పురుషులంటే ద్వేషమని తెలుసుకో గలిగాను...

● ఎలాంటి పురుషులంటే ద్వేషమని- కూడా తెలుసుకో కల్గివుండాలే? మెదడునంత శ్రమ పెట్టదల్చుకో లేదా?!... నేను పురుష ద్వేషిని కాను. కాపురుష ద్వేషిని. జీవితంలో పురుష జన్మ ఎత్తడమే ఘనకార్యం అనుకుంటూ, సాటి మనిషి అయిన ఆడదాన్ని కనీసం మనిషిగా కూడా గుర్తించని సంస్కార హీనులైన పురుషులని నేను ద్వేషిస్తాను. ఆడదాని సంపాదనతో సహా సర్వం దోచుకుంటూ-ఆమెనో బానిసకంటే హీనంగాచూసే మగవాడిని మగవాడైనంత మాత్రాన మీరు చూసి గర్వపడతారా ద్వేషించరా? ఆలోచించండిసారి.

సి. ఎల్. శేషుమాంబ, అమలాపురం.

మీరంటే నాకు చాలా యిష్టం. స్త్రీల మనసులను వేధించే ఎన్నో విషయాలు- మీరు నిర్భయంగా పైకి చెప్తారు. మా నోటిమాట బయట పెట్టినంత సంతోషం కల్గుతుంది.

● థాంక్యూ, సిస్టర్. అయినా మా పెదమామయ్య అంటూండేవాడు 'పొగడ్త రోగం లాంటిది. విమర్శ ఔషధం లాంటిదని.' అందుకే నెమ్మదిగా అంటున్నా థాంక్యూ అని!

జి. వి. రాఘవేంద్రరావు, మచిలీపట్నం

నీళ్లోసుకుంది, భర్తకి ఎడమ వైపునే భార్య వుండాలి, గోత్రం వల్ల ప్రయోజనం వివాహితలకు మట్టెల ప్రయోజనం ఏమిటి?

● మీరింకా యిలాంటి వాటి గురించి ఆలోచిస్తూ టైం వృథా చేస్తున్నారంటే నాకు ఆశ్చర్యంగా వుంది! ఇవన్నీ పట్టుకుని ఏ ఛాందస శాస్త్రుల్లు దగ్గిరకో వెడితే కూర్చోపెట్టి వివరిస్తారు- దీనివల్ల మీకేమైనా ప్రయోజనం కన్పిస్తే- చెప్పండప్పుడు.

●




(గత సంచిక తరువాయి)

ఆఖరికి ఈ విషయాన్ని రామకృష్ణ గణపతితో చెప్పాడు.

"నీకేం బుద్ధుందా లేదా? నీ అంతస్తెక్కడ? రజని అంతస్తెక్కడ? దానిని పెండ్లాడతానంటా వేమిటిరా పిచ్చివాడా?"

"ప్రేమకు గొప్ప, బీద తారతమ్యం లేదు. జాతి మతాలతో ప్రమేయం లేదు. మాకు తెల్సింది, కావల్సింది మా ప్రేమ మాత్రమే!"

"ఒరే ఒరే - ఇది ఏ నాటకంలోని డైలాగురా? నీకు మతి భ్రమించినట్లుంది- ఓసారి అలా పెద్దవాల్తేరు వెళ్ళొద్దాం పద - పరీక్ష చేయించుకుందువుగాని"

"నీకు జీవితం తెలియదురా గణపతి, నా నిర్ణయం మారదు. నేనురజనిని పెండ్లి చేసుకొని తీరతాను. అప్పుడు నా ప్రేమ విజయాన్ని లోకానికి చాటి చెప్తాను."

"ఒరే లోకానికి చాలా వ్యాపకాలు న్నాయి- నీ దిక్కుమాలిన ప్రేమ గొడవ ఎవ్వరికీ అక్కరలేదు గాని, చూడు చిట్టి నాయనా! పొరబాటున నీ మేనమామకు చెప్పగలవు జాగ్రత్త! ఆ ఉగ్ర నరసింహం నిన్ను, నన్ను ముక్కల క్రింద తరిగి ఊర గాయ పెడ్తాడు."

"నాకేం భయం లేదు. ఈవాళే మామయ్యతో చెప్తాను."

"నీ ఇష్టమొచ్చినట్లు తగలడు- నా ప్రస్తావన మాత్రం తేకు ఇందులో - నీకు పుణ్యం ఉంటుంది."

రామకృష్ణ తిన్నగా ఇంటికి పోయాడు.

ఆసరికి అతడి మేనమామ ఆఫీసు గదిలో కూర్చుని ఎవరో క్లయింట్స్‌తో మాట్లాడుతున్నాడు. మామయ్య గంభీరత, ఆ గదిలో పరాయి వ్యక్తులుండడం చూసి రామకృష్ణ మరి మాట్లాడలేక తన గదిలోకి పోయాడు.

రామకృష్ణకు తెల్సు తను ఎలాగైనా తన పెండ్లి విషయమై ఆనాడు మామయ్యతో తేల్చుకోకపోతే, తరువాత తన ధైర్యం సడలిపోవచ్చు. పోనీ తల్లితో మొదట ఈ విషయం చెప్పి, ఆమె ద్వారా మామయ్యకు రాయబారం నడపొచ్చు, అనుకున్నాడు.

తల్లి గదిలో కూర్చుని "భగవద్గీత సారాంశం" చదువుతూంది. రామకృష్ణ వినయంగా వెళ్లి తల్లికి ఎదురుగా కూర్చున్నాడు. కొడుకు ఎప్పుడో గాని తన గదిలోకి రాడని ఆ తల్లికి తెల్సు. అందుకే అందులోఏదో విశేషముందని చదువుతున్న పుస్తకం మూసేసి ప్రక్కనపెట్టి, ఆప్యాయంగా కొడుకు ముఖంలోకి చూచింది.

"రామూ! ఏమిటి నాయనా ఇలా వచ్చేవు?"

"మరేం లేదమ్మా" అని అసలు సంగతి చెప్పడానికి ధైర్యం చాలక ఊరుకుండిపోయాడు.

"చెప్పు నాయనా - నా దగ్గర బిడియం దేనికి?"

"మరే - నాకు పెండ్లి చేసుకోవాలనుంది."

తల్లి శాంతాదేవి చాలా ఆశ్చర్యపోయింది.

"అదేమిటిరా నీకింకా పెండ్లీడు రాందే!"

"ఆ సంగతి నాకు తెలీదు గాని నాకు పెండ్లాడాలని ఉంది."

శాంతాదేవి నిట్టూర్చింది. ఇందులో ఏదో గోప్యం ఉందని ఆమె గ్రహించింది.

"సరే - మామయ్య రానీ చెప్తాను. అతడే ఏదైనా యోగ్యమైన సంబంధం చూస్తాడు."

"అమ్మాయిని నేనే ఎంచుకున్నా మీరు ఈ పెండ్లికి ఆమోదించాలి."

తల్లికి కుతూహలం ఎక్కువైంది. కాస్త ముందుకు వంగి -

"ఎవరా అమ్మాయి? ఎంతవరకు చదువుకుంది? వాళ్ల నాన్నగారు ఏ ఉద్యోగం చేస్తున్నారు? ఆ అమ్మాయిని ఏ బంధువులింట్లో చూచావు ?"

"ఆ! ఆ! ఆగమ్మా అలా ప్రశ్నల వర్షం కురిపించకు. ఆ అమ్మాయి చాలా సాదా మనిషి, కాని చాలా అందమైంది. నాటకాలలో వేషాలు వేస్తుంటుంది."

"ఓరి దౌర్భాగ్యుడా!" అని నరసింహం గర్జించేడు.

ద్వారం వద్ద నిల్చు... చూచి గతుకు...

**ఇంతవరకూ సాగిన కథ -1:** నాటకాలకు, పెట్టుబడి పెట్టే రామకృష్ణ, నాటకాల డైరెక్టరు, యాక్టరు అయిన గణపతి స్నేహితులు. నాటకాల్లో హీరోయిన్‌గా వేసే రజనిని గురించిన వివరాలు తెలుసుకున్న రామకృష్ణ నాటకాల రిహార్సల్సు పేరుతో ఆమెతో ప్రేమాయణం ప్రారంభిస్తాడు.

"రా అన్నయ్యా రా! ఏమిటి సంగతి?"

"అమ్మాయి సుజాత నుండి టెలిగ్రాం వచ్చింది- హైదరాబాదు నుండి రేపు ప్లేనులో వస్తూంది."

"అయితే రేపు నేను ఎయిరోడ్రోమ్‌కి వస్తాలే."

"నువ్వెందుకమ్మా - నేను రాముా వెళ్తాంలే. ఇంతకీ ఏమిటోయ్ నీ పెండ్లి కుమార్తె విశేషాలు?"

"మరేం - మరేం"

"మరి నీళ్లు నమలకు - వ య్యకు చెప్పడానికి ధైర్యం చాలదు ప్రేమించడానికి బోలెడంత ధైర్యం కదూ? ఏమమ్మా ఏమిటంటాడు నీ త్రుడు?"

"వాడికి పెండ్లి చేసుకోవాల దట."

"అదేమిట్రా రాము - నీకెంత స్పొచ్చిందని?"

"నా వయస్సు ఇరవై రెండు"

"నీ వయస్సు ఆడపిల్లలే పెండ్లి కోవటం లేదు - మరి నీకేమొచ్చి తొందర?"

"వాళ్ల సంగతి నా కనవసరం. పెండ్లి చేసుకుని తీరతాను."

"అంతవరకు వచ్చిందన్నమాట ప్రేమాయణం. అయితే చెప్ప



## ప్రణయవల్లరి

అమ్మాయి కుల గోత్రాలు, వాళ్ళ స్థితి గతులు.”

“ఈ రోజుల్లో అవన్నీ అడగడం అవివేకం. ఈ సంఘం పురోగమించాలంటే సర్వమానవ సౌభ్రాతృత్వం అలవర్చుకోవాలి. నేను, రజని ప్రేమించుకున్నాం”

“ఓ ఆ నాటకాల పిల్ల పేరు రజని అన్నమాట. ఎంతవరకు చదువుకుంది? వాళ్ల అమ్మ, నాన్న ఏం చేస్తున్నారు?”

ఈ ప్రశ్నకు జవాబు చెప్పడానికి రామకృష్ణ సిగ్గుపడిపోయాడు.

“చెప్పరా - ప్రేమకు ఇవేవీ అడ్డు రావని నాకు తెల్సుగాని, నాకు అన్ని వివరాలు తెల్సుకోవాలని కుతూహలం ఉంటుంది కదా! మరి మేమేకదా వాళ్లతో వియ్యమందాలి.”




“ఆ అమ్మాయి టెన్త్‌క్లాసు వరకు చదువుకుంది. వాళ్ల నాన్న గాజువాకలో దర్జీపని చేస్తున్నాడు. వాళ్లకు స్వంత దుకాణం ఉంది. ఆ తల్లి ఆ ఇంటిని చూస్తుంది. ఆమె ఏ ఉద్యోగం చెయ్యటం లేదు.”

శాంతాదేవి చాలా బాధతో కుర్చీ వెనుకకు చేరగిల్లి కండ్లు మూసుకుంది. ఆమె శరీరం, మనస్సు మొద్దుబారిపోయేయి.

“ఆ అమ్మాయి నీకెట్లా తారసిల్లింది?”

“నేను గణపతి ఓ నాటకం పరిషత్తుకి కట్టేం. అందులో ఆ అమ్మాయి హీరోయిన్‌గా నటిస్తోంది.”

“ఆ అమ్మాయి నిన్ను ప్రేమిస్తుందా?”

“ఓ ! అందులో సందేహమేమీ లేదు. ఇంతవరకూ ఆ అమ్మాయి ఎవ్వరితోనూ చనువుగానైనా మాట్లాడ లేదు.”

“గుడ్! ఒరే రాముం నాకో వారం రోజులు టైమిస్తే, నేను మంచిచెడ్డలు బాగా ఆలోచించి ఓ నిర్ణయానికొస్తా. నీ పెండ్లికి అప్పుడు యేర్పాటు చేస్తా - సరేనా?”

మేనమామ ఉగ్రనరసింహం లాంటివాడు. ఇంత త్వరగ, ఇంత సౌమ్యంగా ఈ విషయాన్ని పరిష్కరిస్తుంటే రామకృష్ణ మనస్సు తేలికైంది. కాని వెనువెంటనే సందేహం కలగకపోలేదు - ఇందులో ఏదో తిరకాసుందని. అసలే మేనమామ క్రిమినల్ అడ్వకేటు - ఏదో మెలిపెట్టేస్తాడేమోనని రామకృష్ణ జంకకపోలేదు.

మేనమామ ఉగ్రరూపం కన్న ఈ సౌమ్యావతారమే నయమని-

“చాలా థాంక్స్ మామయ్యా - నే వెళ్తా చిన్నపనుంది” అని లేచి తల్లివైపు చూసేడు.

తల్లి అచేతనంగా కండ్లు మూసుకుని అలాగే కుర్చీలో కూర్చునుంది. ఆమె తన మాటలు విన్నదో లేదో రామకృష్ణకు తెలియదు.

“మామయ్యా! అమ్మకు కాస్త నచ్చ చెప్పు” అని వెళ్లిపోయాడు.

**(3)**

“శాంతమ్మా! ఎందుకా దిగులు?”

శాంతాదేవి మెల్లగ కండ్లు తెరిచింది. ఆమె చూపులో ఎంతో ఆవేదన ఉంది.

“చూసేవా అన్నయ్యా వాడి మాటలు - నాటక కంపెనీ పిల్లను చేసుకుంటానంటున్నాడు. మన స్థితిగతులేమిటి - మన సంస్కారమేమిటి - ఆ పిల్ల అంతస్తేమిటి. చెప్పు? చదువు లేదు, సంపద లేదు, కులంలేదు, గోత్రం లేదు - వంశమర్యాద అంతకన్నా లేదు. పేరు ప్రఖ్యాతులున్న లాయరు శ్రీనివాసరావు గారి కొడుకు అడవల్సిన మాటలేనా అవి?”

“చూడు చెల్లీ. నువ్వేమీ అనవసరంగా గాభరాపడిపోకు. నాల్గు రోజుల పరిచయం పెండ్లి వరకు దారితీసిందంటే అది వట్టి బుడగలాంటి ఆవేశం కాకపోతే మరేమిటి? రాముడికింకా చిన్నతనం పోలేదు. నేనన్నీ చూసుకుంటాగా.”

“ఏమో అన్నయ్యా! వాడి ధోరణి చూస్తే నాకేదో భయంగా ఉంది. వాడు మనకెక్కడ కాకుండా పోతాడోనని.”

“నువ్వేమో అనవసరంగా భయపడుతున్నావు చెల్లీ. నేను వాడిని ఏ ప్రక్కతోవను పట్టనీయను. నా మాట నమ్ము.”

నరసింహం వారం రోజులు పోయేక రామకృష్ణను తన గదిలోకి పిల్చేడు. రామకృష్ణ కాస్త ఆందోళన పడ్తూనే మేడదిగి మేనమామ గదిలోకి వచ్చేడు.

“రామూ! రేపు సాయంత్రం ఆరు గంటలకు నన్ను మీ రజని ఇంటికి తీసుకుని వెళ్లు. నేను ఆ అమ్మాయి తల్లిదండ్రులతో అన్ని విషయాలు మాట్లాడాలి. తరువాత నీ పెండ్లి గురించి తేల్చుకోవాలి.”

“సరే మామయ్యా. నేనివాళే రజనికి ఈ మంచి కబురు చెప్తాను. రేపు సాయంత్రం రజనిని ఇంటివద్దే ఉండమంటాను మామయ్యా! రజనిని చూస్తే నువ్వే పెండ్లికి తప్పకుండా ఒప్పుకుంటావు.”

“నేనూ విన్నానులే పిల్ల మంచిదని - వాళ్ల కుటుంబం గౌరవమైనదని.”

రామకృష్ణ మనస్సు ఆనందంతో ఉప్పొంగింది. ఆ శుభవార్త చెప్పడానికి రజనింటికి తన కారుని తీసుకుని బయలుదేరాడు.

నరసింహం పైపుని కాలుస్తూ, ఆ పొగని రమ్యంగా వదులుతూ, చిరునవ్వుతో ఏదో ఆలోచనలో పడ్డాడు. ఇంతలో కూతురు సుజాత వచ్చింది.

“ఏమిటి నాన్నా బావ అంత సంతో

షంతో చిన్న రాక్ అండ్ రోల్ డాన్స్ చేస్తూ పోయాడు?"

"వాడి పెండ్లి త్వరలో కుదరబోతోంది - అందుకే..."

"ఏమిటి? బావకు పెండ్లా - ఎవరితో?" చాలా ఆశ్చర్యపోయింది.

"ఓ నాటకాల పిల్లతో."

"నిజంగా!" మరీ ఆశ్చర్యపోయింది సుజాత.

ఆమె ముఖాన్ని చూసి నరసింహం బిగ్గరగా నవ్వేశాడు. అప్పుడు సుజాత హృదయం తేలికైంది.

"ఫలహారం చేద్దువుగాని అమ్మ పలుస్తోంది రా నాన్నా."

"సరే పద!" అని పైపును ఆర్పేసి రేకులో పెట్టి, కూతురు వెంట డైనింగ్ హాలువైపు వెళ్లాడు.

రామకృష్ణ వెళ్లేసరికి రజని ఎవరితోనో మాట్లాడుతోంది. మరో నాటకం గురించి వాళ్లు రజనిని బుక్ చేసుకుందుకు వచ్చినట్లున్నారు.

"నేను పరిషత్తులోని నాటకాలన్నీ చూసేనండి. మా నాటకం 'బ్రతకలేని మనిషి'ని ఆడేం. మీరు చూశారో లేదోగాని మా నాటకం దెబ్బతినడానికి కారణం మా హీరోయిన్ కమలేనండి. అదేమి ఖర్మోగాని సగం సంభాషణల్ని బెక్కుతూ చెప్పింది. రిహార్సల్స్ బాగానే చేసింది. ఏమని అడుగుతే దాని కొడుక్కి ఒంట్లో బాగులేదట! దృష్టి పిల్లడిమీదకు పోయి సంభాషణల్ని కాస్త మరిచిపోయానంది. 'మట్టిలో మణి' నాటకం చూశామండి. అందులో మీ నటన చాలా బాగుంది. మీ నాటకానికే ప్రథమ బహుమతి వస్తుందనుకున్నాం. కాని మీకు తెల్సుగా పరిషత్తులలోని విచిత్ర పోకడలు. మీరు మా నాటకంలో హీరోయిన్‌గా వేయాలి. కమలను తీసేస్తున్నాము. గెద్దనాపల్లి పరిషత్తుకి ఎంట్రీ ఇద్దామనుకుంటున్నాము. మీరు 'ఊ' అంటే అని ఆ ముగ్గురిలో ఓ నడివయస్కుడు చెప్పుకుపోతున్నాడు.

"సారి అండి! మీకు నామీద వున్న నమ్మకానికి నా నమస్కారాలు. గాని వచ్చే నెల నేను మద్రాసు వెళ్లవలసి ఉంటుంది. కుదరదండి."

ఇంతలో రజని తల్లి నర్సమ్మ వచ్చి వెనకగా నించుంది.

"మీకు మూడువందలు ఇస్తాము- ఒక వెళ్లాళ్లు రిహార్సల్స్. బహుమతి ఇస్తే మీకు



మరో ఏభై రూపాయలు ముట్టచెప్తాం. మరి ఆలోచించుకోండి."

తల్లి కూతురు ఒకరి ముఖాలొకరు చూచుకొన్నారు.

"మా అమ్మాయికి సినిమా ఛాన్స్ రాబోతోంది. త్వరలోనే టెస్ట్ కూడా జరగబోతోంది. అందుకే మీరు మరోలా అనుకోవద్దు" నర్సమ్మే జవాబిచ్చింది.

రామకృష్ణ గుండె ఒక సెంటీమీటరు క్రిందకు జారింది.

"మరి వెళ్లి వస్తామండి". నాటక సమాజం వాళ్లు వెళ్లిపోయారు.

"ఏమిటి రజనీ సినిమా ఛాన్స్ అంటు



న్నావు?" రామకృష్ణ దిగులుగా ప్రశ్నించేడు. రజని రామకృష్ణ మొహంలోకి చూసి ఊరుకుంది. నర్సమ్మ చెప్పింది.

"అవును బాబు. రెండు రోజుల క్రితం విజయవాడ నుంచి చౌదరిగారని ఓ ప్రొడ్యూసరు వచ్చేరు. వాళ్లది నవీన ఆర్ట్స్ అనే ఫిలిం సంస్థట. అతడి బావమరిది స్నేహితుడు ఈ ఊరివాడట. మొన్న పరిషత్ పోటీలకు అతడి బావమరిది, పోర్టులో పనిచేస్తున్న అతడి స్నేహితుడితో వచ్చి, అందులోని నాటకాలు కొన్ని చూసేడట. అదృష్టవశాత్తు మీ మట్టిలోమణి చూసేడట. అంతే రజని నటనను, రూపాన్ని మెచ్చుకొని తన బావగారికి ఉత్తరం రాయగా, అతను వచ్చేడు. అమ్మాయిని చూసేడు. బాగుందన్నాడు. కొద్ది రోజులలో ఇక్కడో, విజయవాడలోనో టెస్టులు తీసుకొని, ఫొటోలో అమ్మాయి బాగా దిగితే, సినిమాలో హీరోయిన్ వేషాన్నే ఎకాఎకిని ఇస్తానన్నాడు."

"అదీ సంగతి. అప్పటినుండి మా అమ్మ గాలిలో తేలిపోతోంది" నవ్వుతూ రజని చెప్పింది.

"మరి నీకెలా ఉంది?"

"నాకు నచ్చిన విషయమేగా. సినిమా తార అవుదామని నాకు ఉబలాటంగానే ఉంది మరి."

"మరి మన పెండ్లి విషయం?"

"తప్పకుండా చేసుకుందాం!"

"రజనీ నీకు తెలియదు ఈ సినిమా వాళ్ల అగడాలు. శీలాన్ని దోచుకోందే వారు ఊరుకోరు."

"మరి మీరుంటారుగా నా ప్రక్కన నా భర్తగా, నా గార్డియన్‌గా - నాకేం భయం?"

రామకృష్ణ ఆలోచనలో పడ్డాడు. మనసు శంకిస్తున్నా కొంత రాజీకి రాక తప్పలేదు రామకృష్ణకు. అప్పుడు జ్ఞాపకానికి వచ్చింది తను వచ్చిన పని.

"ఏమండీ! రేపు మా మామయ్య రజనిని చూడడానికి వస్తానన్నాడు. బహుశా రేపు ఈ సమయానికే వస్తాం. మా మామయ్యే మాకు గార్డియన్. అతను మా పెండ్లికి ఒప్పుకున్నట్లే. ఈ చూడడం అన్నది వఠి ఫార్మాలిటి మాత్రమే. మీతోని, మీ వారితోని ఒకసారి మాట్లాడుతామన్నారు. ఒకసారి రజని తండ్రిగారిని పిలిపిస్తారా నేను అతనితోనూ చెప్తాను."

"అఖర్లేదు బాబు, నాతోచెప్పేరుగ-సరి, అతనితోను చెప్పినట్లుగా."

రామకృష్ణ సరాసరి అక్కడి నుండి గణపతి ఇంటికి వెళ్లేడు. అప్పుడే బయటకు పోతున్న గణపతి కారును చూసి ఆగిపోయేడు.

"గణపతీ! మా మామయ్య ఈ పెండ్లికి ఏమీ అభ్యంతరం చెప్పలేదురా."

"అయితే అదృష్టవంతుడివే-మరి పెండ్లెప్పుడు?"

"ఏమిరా! అంతముభావంగా మాట్లాడుతున్నావు-నీకీ పెండ్లి ఇష్టంలేదా?"

"నా ఇష్టంతో నీకేం పని? చేసుకుంటున్నది నువ్వు-నేను మాత్రం పెండ్లికి వచ్చి ఇన్ని అక్షింతలు నీ తల మీద వేసి వచ్చేస్తా."

"పోనీ రేపు మాతో రజని ఇంటికి

కూడదు. నాకు ధైర్యంగా వుంటుంది."

"నేనా ఆ హిరణ్యకశిపుడితో రావాలా-కేం మతి పోలేదుకదా? నేను రజనిని కు ఇంట్రడ్యూసు చేసినందుకు, నీ మేన గామ నన్ను ఔటర్ హా ర్బరు తీసు నివెళ్లి సముద్రంలో పడేస్తాడు. నేను ను."

ఎంత చెప్పినా గణపతి ససేమిరా నన్నాడు.

"యు కవర్డు!" అని నిందచేసి ంటికి పోయేడు.

ఆ మరునాడు నరసింహం సాయంత్రం రుగంటలకు నీటుగ ముస్తాబై మేనల్లు తో బయలుదేరేడు. త్రోవలో ఏమీ ాట్లాడలేదు. గంభీరంగా కూర్చున్నాడు. ను స్థితిని తెలియచేసేందుకు డ్రయివరు ల్లని యూనిఫారంతో, నీటుగ హుందాగ న్నాడు. వెనుక కూర్చున్న రామకృష్ణ నస్సులో చిన్న ఆందోళన కల్గనారం ంచింది.

రజని తల్లిదండ్రులను, ఆ చిన్న ంకుటింటిని, ఆ మురికివాడను చూసి నమామ ఏమంటాడో! మట్టిలో మణిలా రిసిపోతూ రజని ఉంటుందని రామకృ కు తెలుసు. రామకృష్ణ మనస్సును ఊర వరుస్తున్నాడు. ఏరాడపార్కు వచ్చింది.

"నువ్వుండు మామయ్య-నేను ముందు ళ్తా," అని రామకృష్ణ ద్వారం వద్దకు ళ్లాడు.

తలుపు లోపల గడియపెట్టి ఉంది. మకృష్ణ ఓ నిమిషం కొట్టగ రజని తండ్రి చ్చి తలుపు తెరచేడు. అతడి చేతిలో అర సుడు విస్కీ ఉంది.

"ఎబరు కావాలి నీకు?"

"రజని ఇంట్లో ఉందాండి ?"

"లేదు."

"రజని తల్లిగారు నర్సమ్మగారు ఉన్నా ండీ?"

"ఆ నంజనేదు."

రామకృష్ణకు మతిపోయినట్లయింది. సరికి రామకృష్ణ మేనమామ వెను ( రెండోమెట్టుమీదున్నాడు. అన్నీ వింటు న్నడు. రజని తండ్రికి ఎవరో పెద్ద విస్కీ సా ఇచ్చినట్లున్నారు. ముందు గదిలో ార్చుని మస్తుగ మందు సేవిస్తున్నాడు. కోడీలు, కవాబు పుల్లలు టేబిలు మీదు న్నాయి. పెద్దసీసా విస్కీ రెండు వంతులు ాళీ అయిఉంది.

"మేము లోపలికి వచ్చి మీతో ాట్లాడవచ్చా?"

## ప్రణయవల్లరి

"ఎందుకు? ఈ ప్రాంతంలో ఎబరు నాతో మాట్లాడరు. అందా నా లంజ నేదు నర్సు, దానితోనే మాట్లాడుతారు. నీలాంటి వాళ్లు దాని కూతురు రజని, హో హో హో-రజనట దొంగనంజ, లక్ష్మమ్మతో మాట్లాడుతారు. నీకో రహస్యం చెప్పనా? లక్ష్మమ్మ నా కూతురు కాదు. ఆ నర్సు కూతురు. నేను ఎన్నో మొగుణ్ణో తెలుసా?"

రామకృష్ణకు సిగ్గుతో ముఖం ఎర్రబారింది. మెల్లగ ఆ త్రాగుబోతుని ఇంట్లోకి నెట్టి తను ఇంట్లోకి వెళ్లాడు. వెంట నరసింహం కూడ వెళ్లి, డ్రయివరు సంభాషణ వినకుండా తలుపును దగ్గరగ వేసేడు. కాబోయే అత్తమామల గురించి తల్చుకుంటేనే రామకృష్ణకి కంపరం కల్గనారంభించింది. రజని మీద కాంక్ష మాత్రం పోవడంలేదు. రజనిని తీసుకుని దూరంగా పోతేసరి-నిర్మల వాతావరణంలో జీవితం గడపవచ్చు అనుకున్నాడు.

"ఏవండీ రజని ఎక్కడికి వెళ్లిందో చెప్పగలరా?"

"ఎందుకు జెప్పలేను?"

"అయితే చెప్పండి ఎక్కడికి వెళ్లారు?"

"అదేదో సముద్రం హోటలుకి పెద్ద వాళ్తేరుకు వెళ్లారు."

"అబ్బాయి రామూ! సన్ అండ్ సీ హోటలుకి వెళ్లుంటారు. పోనీ ఇంటికి పోదామా-మరోనాడు చూసుకోవచ్చు."

రామకృష్ణ మనస్సులో అలజడి మొదలైంది. ఈ మూడ్ పోతే తన మేనమామ రజనిని చూడడానికి ఒప్పుకోకపోవచ్చు. ఈ త్రాగుబోతు, చవకబారు రజని తండ్రి గురించి తరువాత ఉపన్యాసం దంచవచ్చు. ఎలాగైనా అందమైన రజనిని ఇవాళే మామయ్యకు చూపాలి.

"ఎందుకు వెళ్లిందండి? రజని తల్లి కూడ వెంట వెళ్లిందా?" ఆ దర్జీవాడు పగలబడి నవ్వడం మొదలెట్టేడు.

"అందరు హోటళ్లకు, లాడ్జీలకు ఎందుకు వెళ్తారు-అందుకే" అని నరసింహాన్ని చూసి కన్నుగీటేడు. మళ్లీ అందుకున్నాడు సంభాషణని-

"నువ్వు కుర్రోడివి-నీకు తెలియకపోవచ్చు-ఈ పెద్దమనిషి నడుగు అంతా చెప్తాడు. ముగ్గురు మొగాళ్లొచ్చారు-ఏదో సినిమా తీస్తారుట-అందుకు ఈ ఆడాళ్లని తీసుకెళ్లేరు. నర్సమ్మ అంత ముసలిది కాదులే-పనికొస్తుంది నేను దానికి మూడో మొగుణ్ణి. కేకలేస్తే నన్ను వదిలేసి నాల్గో మొగుడి దగ్గరకు పోతుంది. నాకెందుకు గొడవ-అందుకే నేనేమి ఆ నంజననుదాని కూతురికి అదే తర్ఫీదు ఇచ్చుకుంటూంది."

రామకృష్ణ సిగ్గుతో కుంచించుకుపోతున్నాడు. వాతావరణం మరీ కలుషంగ మారి అతడ్ని ఉక్కిరి బిక్కిరి చేస్తోంది.

"మామయ్యా! పద సన్ అండ్ సీకు వెళ్దాం. ఇతడేదో ఆ నిషాలో వాగేస్తున్నాడు. అవేమి పట్టించుకోకు పద."

"సరే-. అక్కడికేపద."

రామకృష్ణ, నరసింహం సన్ అండ్ సీ హోటలుకు చేరేసరికి రాత్రి ఎనిమిది దాటింది.

రామకృష్ణ రిసెప్షను కౌంటరు వద్ద విచారించగ, ఇద్దరాడవాళ్లు ముగ్గురు సినిమా ప్రొడ్యూసర్లు సూట్ నంబర్లు 223, 224 బుక్ చేసినట్లు చెప్పేడు. రామకృష్ణ ఎంతో దిగులుగా ఉన్నాడు.

(ఇంకా ఉంది)

## ఎత్తయిన బుద్ధ విగ్రహం

ప్రపంచంలో కెల్లా ఎత్తయిన బుద్ధ విగ్రహం హాంకాంగ్‌లో వుంది. దీని ఎత్తు ముప్పయి రెండు మీటర్లు. హాంకాంగ్ సమీపంలో వున్న లాంతావు ద్వీపంపై వున్న ముక్ యూ కొండపై 250 టన్నుల బరువుగల ఈ విగ్రహాన్ని ప్రతిష్ఠించారు. ఈ విగ్రహంలోని వివిధ భాగాలను మొదట ఏ భాగానికి ఆ భాగం తయారు చేయించి తర్వాత వెల్డింగ్ ద్వారా అతికించారట.

ఈ విగ్రహం వెయ్యేళ్ల పాటు నిలబడగలదని అంచనా వేస్తున్నారు. అంటే ఎంత పకడ్బందీగా ఆ కొండమీద ఈ విగ్రహాన్ని నిలబెట్టారో!

# విడిపోయిన మబ్బులు

## "శ్రీరాగి"

ఉదయం పదకొండు గంటలవుతుందేమో! సూర్యం రిక్షా దిగి పెద్ద ఆస్పత్రి మెట్లెక్కి నడుచుకొంటూ వరండాగుండా తన గదిలోకి వచ్చి కూర్చోబోతున్నాడు. ఇంతలో కనకారావు, యు.డి.సి. ఆదరా బాదరా వచ్చి "సార్! మీరింకా యిక్కడే వున్నారా?" అంటూ సూర్యారావును పలకరించాడు నమస్కారం చేస్తూ.

*****

సూర్యం ఆ ఆస్పత్రికి లే సెక్రటరీ అండ్ ట్రెజరర్‌గా పని చేస్తున్నాడు. అతని కుటుంబం వేరే వూళ్లో వుంది. తన కుమారుడు, కుమార్తె ఆ వూళ్లో పని చేస్తూండటంచేత తనకీ ఊరు బదిలీ అయినా, కాపురం యిక్కడ పెట్టలేకపోయ్యాడు. వారం, వారం తన ఊరుకి శనివారం సాయంకాలమే పోయి, సోమవారం ఉదయం బస్సులో తిరిగి ఈ వూరికి వస్తాడు.

సూర్యం చిన్నకుర్రవాడేం కాదు. అతను అరవై పడిలో పడినా, చూడటానికి కుర్రవానిలాగానే వుంటాడు....సన్నగా, పొడుగ్గా, అందమైన ముఖంతో, చక్కటి క్రాపుతో, ప్యాంటు, షర్టుతో చూడటానికి ఆకర్షణగా వుంటాడు.ఆయన ఆ ఆస్పత్రిలో చేసి సంవత్సరం దాటిపోయింది. ఆయన ఆ ఆస్పత్రిలో ముందుగా అక్కౌంటెంటుగా చేరాడు. అప్పటికే అతనికి ఆ పోస్టులో పదేళ్ల సర్వీసూ, మొత్తం మీద ముప్పయి సంవత్సరాల అనుభవం వుంది. అతను... అక్కౌంటెంటుగా సీనియర్ కావటంతో, అక్కౌంటెంటుగా చేరిన పదిహేను రోజులకే లే సెక్రటరీగా (గెజిటెడ్ పోస్టు) ప్రమోషనిచ్చి, అదే ఆస్పత్రిలో నియమించారు. కాని అతని దురదృష్టం వలన ఆయన భార్యను...ఆ ఆస్పత్రిలో చేరిన పదిహేను రోజులకే, హైదరాబాదుకు కిడ్నీ ఆపరేషనుకు తీసుకువెళ్లవలసి వచ్చింది....ఆమె షుమారుగా మొత్తం నలభై అయిదు రోజులు ఆస్పత్రిలో వుంది... అది వరకు చాలా సంవత్సరాల



నుంచే, సూర్యం, లే సెక్రటరీ ప్రమోషనుకు ఎదురు చూశాడు.... కాని.... ఆయన భార్య ఆస్పత్రి నుంచి డిస్‌ఛార్జి అయిన రోజునే హైద్రాబాద్ డైరెక్టరేటులో అతని ప్రమోషను ఆర్డర్లు డిస్పాచ్ చేశారు. ఆస్పత్రి నుంచి విడుదలయిన తన భార్యకు సేవ చెయ్యడంతోనే ఒక నెల రోజులూ గడపాల్సి వచ్చింది. అతనూ సెలవులో వున్నప్పుడే ఆస్పత్రిలో పని చేసే స్టోర్సు యు.డి.సి వచ్చి ఆయన ప్రమోషన్ వార్త సూర్యం చెవిన వేశాడు.

"సార్! మీకు లే సెక్రటరీగా ప్రమోషను వచ్చింది" కంగ్రాట్యులేషన్స్! అంటూ భాస్కరం, యు.డి.సి. తను కాపురం వుంటున్న వూళ్లో తన యింటికి వచ్చి ఆ శుభవార్త అందజేశాడు.

సూర్యం తన చెవులను తానే నమ్మలేకపొయ్యాడు. ఎన్నాళ్లనుంచి ఎదురు చూస్తున్న ప్రమోషను తనది! చిన్న గుమాస్తాగా పదేళ్లు, పెద్ద గుమాస్తాగా పదేళ్లూ... సూపరింటెండెంటుగా పదేళ్లు చేసి ఈ ప్రమోషన్ కోసం చాలా కాలం నుంచి ఎదురుచూస్తున్నాడు.

అది ఆస్పత్రిలో గెజిటెడ్ ఆఫీసరు పోస్టు! సూపరింటెండెంటు పోస్టు తర్వాత ఆస్పత్రికి కావలసిన బాధ్యత గల ఉద్యోగం అదే!

తన కలలు నేటికి ఫలించాయి.

"నిజమా! భాస్కరం! చాలా థాంక్స్! మంచి శుభవార్త తెచ్చారు!" అన్నాడు సూర్యం.

"అబద్ధమెందుకు చెప్తాను సార్! మీ వాళ్లను పరామర్శించినట్టూ, మీకీ శుభవార్త అందించినట్టూ వుంటుందని, మన

్యానులో ఆఫీసు పనిమీద హైదరాబాద్ ోతూ యిలా వచ్చాను - మరి మీవాళ్లకు ంలాసాగా వుందిగదా! అమ్మగారేరీ?"

అన్నాడు భాస్కరం.

సూర్యం లోపల వున్న తన భార్య ంత్యవతిని పిల్చాడు.

"ఏమేవ్! ఎవరొచ్చారో? చూ ాావా?" అంటూ.

లోపల నుంచి ఆమె తొంగిచూసింది. ాాస్కరం ఆమెకు బాగా పరిచయమే.

"ఓహో? భాస్కరంగారా?" అంటూ ంరండాలో కొచ్చింది.

"అవునమ్మగారూ! మీ ఆరోగ్యం ంలా వుంది?" అడిగాడు భాస్కరం.

"బావుందండీ!"

"భాస్కరం ఏం వార్త తెచ్చాడో ూశావా?" అన్నాడు సూర్యం.

"ఏం వార్త తెచ్చాడేమిటి?" అంది ఆమె సంభ్రమంగా.



"అయ్యగారికి లే సెక్రటరీగా ప్రమో .నిచ్చి మన ఆస్పత్రికే వేశారు. ఇదిగో ర్డర్ను!" అంటూ భాస్కరం సూర్యానికి ాపరింటెండెంటుగారు పంపిన ఆర్డరు ందించాడు.

"చాలా మంచి వార్త తెచ్చారు! యితే మీ అయ్యగారు గెజిటెడ్ ఆఫీసరు అయ్యారన్నమాట!"

అంటూ సత్యవతి భర్త ప్రమోషనుకి తన హర్షం ప్రకటించింది.

సూర్యం తన ప్రమోషను ఆర్డర్లు చూసుకున్నాడు.

"మరి మీ రెప్పుడు చేర్తారో సూప రింటెండెంటుగారు కనుక్కోమన్నారు..." అన్నాడు భాస్కరం.

"పంచాంగం చూసి చెప్తాను... సత్య వతీ మన పంచాంగం (ఆంధ్రపత్రిక) యిలా పట్టుకురా!" అన్నాడు సూర్యం.

సత్యవతి లోపలికి వెళ్లి పంచాంగం వెతికి తెచ్చి యిచ్చింది. సూర్యం



పంచాంగం చూసి మంచి రోజు చూశాడు.

"అవలి ఎల్లుండి దశమీ, శుక్రవారం! బావుందోయ్! ఆరోజు వస్తానని చెప్పు! మరి అంకయ్యగారి నెక్కడ వేశారు?" అడిగాడు సూర్యం.

"ఆయనికి లే సెక్రటరీ గ్రేడ్ 1గా ప్రమోషనిచ్చి ఈ వూరి ఆస్పత్రికి వేశారు. ఆయన మీరాకకోసం ఎదురుచూస్తున్నాడు, ఇక్కడ త్వరగా చేరాలని..." అన్నాడు భాస్కరం.

"ఓహో! అలాగా! ఆయనకు నా కంగ్రాట్యులేషన్సు చెప్పు!" అన్నాడు సూర్యం.

"భాస్కరం గారూ! మీరు భోజనం చేసి వెళ్లండి..." అన్నాడు సూర్యం.

"క్షమించండి సార్! అర్జంటుగా హైద్రాబాద్ వెళ్లాలి.. బయట డ్రైవరు కాచుకొని వున్నాడు. మీరు శుక్రవారం వస్తున్నారు గదా...మరి నే సెలవు తీసుకొంటాను. వస్తానమ్మగారూ?" అంటూ భాస్కరం సూర్యం, సత్యవతిల దగ్గర సెలవు తీసుకొని బయట కాచుకొని వున్న ప్రభుత్వ వ్యాన్‌లో హైద్రాబాద్ వైపు దూసుకుపోయాడు.

అలా సూర్యం ఆ శుక్రవారం ఈ ఆస్పత్రికి వచ్చి లే సెక్రటరీగా ఛార్జి తీసుకొని పని చేస్తున్నాడు. ఆస్పత్రిలో మూడు వందల పడకలున్నాయి....అది ఒక జిల్లా హెడ్‌క్వార్టర్సు...ఆస్పత్రికి సివిల్ సర్జను హోదాలో ఒక సూపరింటెండెంట్, అసిస్టెంటు సూపరింటెండెంట్, ఆర్.ఎం.ఓ. వున్నారు.... సివిల్ సర్జను హోదాలో అయిదారుగురు స్పెషలిస్టులూ, యింకో పదిహేనుమంది అసిస్టెంటు డాక్టర్లూ వున్నారు.

ఓ ముప్పయి మంది నర్సులూ, అయిదుగురు హెడ్ నర్సులూ, ఒక నర్సింగ్ సూపరింటెండెంట్ వున్నారు. తర్వాత కాంపౌండర్లూ, వార్డుబాయిలూ, తోటీలు, మెకానిక్కులు, ఒక టెలిఫోను ఆపరేటరు యితర నాల్గో తరగతి పనివారూ వున్నారు.

ఆస్పత్రి ఆఫీసుకు ఒక అక్కౌంటెంట్, అయిదుగురు యు.డి.సి.లు, పదిమంది చిన్న గుమాస్తాలూ, ఒక రికార్డు అసిస్టెంటూ, అయిదారుగురు జవాన్లూ వున్నారు.

వాళ్లమీది అధికారి లే సెక్రటరీ... ఆఫీసుకు హెడ్ లే సెక్రటరీ అయితే, మొత్తం ఆస్పత్రికి హెడ్ సూపరింటెండెంట్‌గారు, సూపరింటెండెంట్ తర్వాత లే సెక్రటరీనే, ఎక్కువ బాధ్యత గల ఉద్యోగిగా పరిగణింపబడ్తాడు.

మొత్తం ఆస్పత్రిలో రెండు మూడు వందల మంది ఉద్యోగులుంటారు. వాళ్ల జీతభత్యాలు, లే సెక్రటరీ ద్వారా యివ్వబడ్తాయి. అసలు జీతభత్యాలు యిచ్చే అధికారం, ఆస్పత్రి మెడికల్ సూపరింటెండెంట్‌దే. కాని ఆయన పని భారాన్ని తగ్గించడానికీ, ఆయన క్రింద సహాయకారి ఉద్యోగిగా లే సెక్రటరీ పదవి నియోగించబడ్డది. ట్రెజరీ నుంచి జీతభత్యాలు తీసుకొనే అధికారం సూపరింటెండెంట్‌గారు లే సెక్రటరీకి బదలాయిస్తారు.. కాబట్టి ఆ విషయం లే సెక్రటరీ చూస్తాడు. తర్వాత పరిపాలనకి సంబంధించిన పత్రాలన్నీ, లే సెక్రటరీ ద్వారా సూపరింటెండెంటుకు పంపుతారు. వాటినన్నిటిని సూపరింటెండెంట్ మంజూరు చేసినా సూపరింటెండెంట్‌తోబాటు లే సెక్రటరీకి సమాన బాధ్యత వుంటుంది.

అటువంటి బాధ్యత గల పదవిలో సూర్యం చేరి సంవత్సరం పైన అయింది. అప్పుడు ఒక ముస్లిమ్ ఆస్పత్రికి సూపరింటెండెంట్‌గా వుండేవాడు... ఆయనకు లే సెక్రటరీ పదవీ బాధ్యత, దాని గౌరవం బాగా తెలుసు...ఆయన మంచి సర్జను... ఆయన సూర్యానికి మంచి గౌరవం యిచ్చేవాడు... తన క్రింది వుద్యోగుల వట్ల చాలా మర్యాదగా, స్నేహభావంతో ప్రవర్తించేవాడు... ఆయన హయాంలో ఆస్పత్రిలో వైద్యం బాగా జరిగింది సామాన్య ప్రజలకు. ఆస్పత్రికి మంచి పేరు వచ్చింది.

ఆయన బదిలీ అయి మూడు నెలలు అయింది. ఆయన స్థానంలో భయంకరం అనే సూపరింటెండెంటు వచ్చాడు. ఆయన సార్థక నామధేయుడు. చూస్తే భయంకరంగానే కన్పిస్తాడు. అతనిది ఆజానుబాహు విగ్రహం- ఆరడుగులు ఎత్తు... దృఢమైనకాయం. ..ఉద్యోగులకు ఆయన్ని చూస్తే భయం, భయంగా వుండేది. ఆయన ప్రవర్తనగూడా అలాగే వుండేది. తోటి వుద్యోగులపట్ల ఆయనకు గౌరవ భావం లేదు. తోటి డాక్టర్లనే ఆయన గౌరవించడు.... ఇంకా క్రింది ఉద్యోగుల సంగతేమిటి?

లే సెక్రటరీ అంటే ఆయనకు లక్ష్యం లేదు..అతనంటే చాలా చులకనగా చూస్తాడు. ఆయన దృష్టిలో తనొక్కడే ఆస్పత్రికి సర్వాధికారి! మిగతావాళ్లంతా పురుగులు! ఇదీ అతని ప్రవృత్తి....

ఆయన ఆస్పత్రికి వచ్చిన తర్వాత ఆఫీసు ఉద్యోగులకు చాలా కంటకమయింది... దేనికో దానికి ఎవరినో ఒకరిని రోజూ గదమాయించడం, ఆయనకి అలవాటయింది. తోటి డాక్టర్లకు ఆయనంటే అసహ్యం....

ఆయన మంచి సర్జనే కావచ్చు! కాని ధనదాహం వుంది. ఆపరేషన్లకు డబ్బు తీసుకుంటాడు.

ఆస్పత్రి కాంపౌండు చాలా పెద్దది. దానిలో సూపరింటెండెంట్‌కీ, కొంతమంది డాక్టర్లకీ, కొంతమంది ఆస్పత్రి సిబ్బందికీ ప్రభుత్వం వారు కట్టించిన



## విదేశీ వస్తువుల మోజు




విదేశీ సరకులంటే అన్ని దేశాలకు మోజెక్కువన్న విషయం అందరూ ఎరిగినదే! జపాన్ దేశస్థుల్లో ఈ క్రేజ్ అత్యధికమట. అది అదనుగా తీసుకొని జపాన్‌లోని కంపెనీలు తమ సరకులకు విదేశీ పేర్లు పెట్టడం ఆరంభించాయి. అంతే కాదు తమ సరకుల ప్రచారం కోసం అమెరికన్ హీరోలను ఎన్నుకుంటున్నాయట ఆ కంపెనీలు. ఈ ప్రచారం అంతా యింతా కాదట. టి.వి. పెడితే చాలు విదేశీ తారలు జపాన్ ఉత్పత్తులను పొగుడుతుండటం కన్పిస్తుంటుంది.

## విడిపోయిన మబ్బులు

క్వార్టర్సు వున్నాయి.

సూపరింటెండెంటు క్వార్టర్సుకు కొంచెం దగ్గరలో వార్డుబాయి క్వార్టర్సు వున్నాయి. వుల్లయ్య సీనియర్ వార్డుబాయి. ఒక క్వార్టరులో వుంటున్నాడు - అతనికి తన ఆస్పత్రి ఉద్యోగంతోపాటు, సూపరింటెండెంట్ యింటి దగ్గర, వంతులవారీగా రాత్రివేళల్లో వాచ్‌మెన్‌గా పని చెయ్యాలి. చాలామంది సూపరింటెండెంట్లను చూశాడు వుల్లయ్య. భయంకరంగారు రాకముందు వనిచేసిన యిద్దరు ముగ్గురు సూపరింటెండెంట్ల దగ్గర అతను తన నైట్‌వాచ్‌మన్ ఉద్యోగానికి చాలాసార్లు వంగనామాలు పెడ్తూ వచ్చాడు. వాళ్లు గూడా (సూపరింటెండెంట్లు) అతను రాకపోయినా, యితర మంచి ఉద్యోగుల తోడ్పాటుతో సర్దుకుపోతూవచ్చారు.

కాని భయంకరంగారు ఎలా వూరుకొంటాడు. అయన వుల్లయ్యను చాలాసార్లు హెచ్చరిక చేశాడు-వ్రాతమూలకంగా గూడా. అతడు తన డ్యూటీ ఎగవేస్తున్నందుకూ, సంజాయిషీ అడిగాడు. కాని వుల్లయ్య జవాబివ్వలేదు. కారణం అతని తమ్ముడు గోవయ్య, వుల్లయ్య దగ్గరే వుంటూ ఎం.ఎ. పాసై అమధ్య ఐ.ఎ.ఎస్. పరీక్ష వ్రాసి వచ్చాడు. అతడు అన్నగారికి సూపరింటెండెంట్ యింటిదగ్గర పని చెయ్యవలసిన అవసరం లేదంటూ, కొన్ని కమ్యూనిస్టు భావాలు అతనికి నూరిపోసాడు. అవన్నీ వుల్లయ్యకు తలకెక్కినై...ఫలితంగా సూపరింటెండెంట్ ఇంట్లో అతను రాత్రి డ్యూటీ మానేశాడు.

భయంకరాచారి లాంటి వ్యక్తి ఒక చిన్న ఉద్యోగి అలక్ష్యాన్నీ, అతని వ్యక్తిత్వాన్ని ఎలా గౌరవిస్తాడు?

అందుకే అతని విషయంలో గట్టి చర్య తీసుకోతలచాడు. అతన్ని ప్రభుత్వం వారిచ్చిన క్వార్టర్సు ఖాళీ చేసి బయటకు పొమ్మన్నాడు. ముందు నోటిమాటగా చెప్పాడు. వుల్లయ్య కిమ్మనలేదు. తర్వాత వ్రాతపూర్వకంగా నోటీసు యిచ్చాడు. దానికి గూడా వుల్లయ్య జవాబివ్వలేదు..

ఓ రోజు పదకొండు గంటలకి లే సెక్రటరీ సూర్యానికి కబురు పంపాడు అర్జంటుగా తన గదికి రమ్మని...

"గుడ్‌మార్నింగ్ సార్!" సూర్యం 'విష్' చేశాడు సూపరింటెండెంట్‌కి.

"గుడ్‌మార్నింగ్! కూర్చోండి!" అన్నాడు భయంకరంగారు.

సూర్యం సూపరింటెండెంట్‌గారి బల్ల ముందు వున్న కుర్చీలో కూర్చున్నాడు.

"చూడండి. వుల్లయ్యని మనంయివ్వాళ క్వార్టర్సు ఖాళీ చేయించాలి!"

"అదేమిటి సార్! అతనేం తప్పు చేసాడని?"

"భలేవారే! ఇంకా ఏం చెయ్యాలి? మా బంగళాలో చాలా రోజుల నుంచి నైట్ డ్యూటీ ఎగకొడుతున్నాడు గదా? అతనుండే క్వార్టర్సు నా బంగళాక్రిందికే వస్తుంది. నైట్ డ్యూటీ చేసేవాళ్లే దాంట్లో వుండాలి....."

"అవుననుకోండి... క్వార్టర్సులో చాలా కాలం నుంచీ వుల్లయ్య వుంటున్నాడు గదండీ..."

"అవును...అప్పుడతను నైటు డ్యూటీ చేసాడు చాలమంది సూపరింటెండెంట్ల దగ్గర! వాడికి నేనొచ్చాకే మదమెక్కింది... ఎన్ని హెచ్చరికలు చేసినా వాడు వినందే!"

"అయినా మన మీ విషయంలో తొందరపడటం బావుండదేమో సార్!"

"నథింగ్ డూయింగ్! అతను క్వార్టర్సు ఖాళీ చెయ్యలేదు గనుక అతని చేత క్వార్టర్సు ఖాళీ చేయించాల్సిందే! దానికి యివ్వాళే ముహూర్తం పెట్టాను.. ఇవ్వాళ పన్నెండు గంటలదాకానే అతనికి టైమిచ్చాను... అతని వ్యవహారం చూస్తే క్వార్టర్సు నుంచి కదిలేటట్లు కనపడటం లేదు. మీరు సరిగా పండ్రెండు గంటలకి నాతో వాడి క్వార్టర్సుకి రావాలి.... అకౌంటెంటుని గూడా రమ్మనండి... స్టోర్సు యు.డి.సి. భాస్కరాన్ని గూడా వుండమనండి. లేడీ ఆర్.ఎం.ఓ. గారు కూడా మనతో వస్తారు. ఇంక వెళ్లి అప్పటికి తయారుగా వుండండి"

అంటూ భయంకరం గారు తన సీటునుంచి నిష్క్రమించి వార్డు రౌండ్సుకెళ్లాడు.

పాపం సూర్యం ఏం మాట్లాడగలడు?

ఆయన తన పైఅధికారి!

న్యాయం ఏప్రక్కనవున్నా తాను పైఅధికారి వెంబడి వుండాల్సిందే!

పండ్రెండు గంటలు!

సూపరింటెండెంట్ ముందుగా అరేంజ్ చేసుకున్న ప్రకారం తన మందీ మార్బలంతో ఆస్పత్రి మెట్లు దిగి క్రిందికి వస్తున్నాడు.

వార్డుబాయి వుల్లయ్య ఎక్కడి నుంచో పరుగెత్తుకొంటూ వచ్చాడు.

సూపరింటెండెంట్‌కు నమస్కారం చేసాడు.

"ఏమిటి?" కటువుగా ప్రశ్నించాడు సూపరింటెండెంట్.

"సార్! ఇంకొక్క నెలరోజులు టైమిప్పించండి! తర్వాత నేను క్వార్టర్సు ఖాళీ

చేస్తాను... ప్రస్తుతం చాలా యిబ్బందుల్లో వున్నాను...”

ప్రాధేయపడ్డాడు పుల్లయ్య.

“వీల్లేదు! నీవు వెంటనే ఖాళీ చెయ్యాలి! లేకపోతే బలవంతంగా సామాను బయటవేయాల్సి వస్తుంది....

కఠినంగా జవాబిచ్చాడు భయంకరం!

పుల్లయ్య పరుగెత్తుకొంటూ వెళ్లిపోయాడు.

అస్పత్రి వ్యానులో భయంకరం....ఆస్పత్రి బిల్డింగుకు వంద గజాల దూరంలో వున్న పుల్లయ్య క్వార్టర్సు దగ్గరికి తన సిబ్బందితో వెళ్లాడు.

పుల్లయ్యది చాలా చిన్న క్వార్టర్సు... అది సూపరింటెండెంట్ గారి బంగాళాకు చాలా దగ్గరలో వుంది... న్యాయంగా అది సూపరింటెండెంట్ సర్వెంటు క్వార్టర్సు!

ఒక హాలూ, చిన్న వంటగదీ, ఒక చిన్న పడగ గదీ, ముందు ఓ చిన్న వరండా, ఓ బాత్ రూమూ, సెప్టిక్ లెట్రిన్... ముందు కొంచెం ఖాళీ స్థలముంది. ఆ స్థలం చుట్టూ, వెదురు కర్రలతో కాంపౌండు కట్టుకొని, వాడుకొంటూ, చిన్న చిన్న పూలచెట్లు పెంచాడు పుల్లయ్య. అది పుల్లయ్య పాలిటి ఇంద్రభవనం!

కాంపౌండుకు వెదురు గేటు వుంది.... గేటు తీసుకొని సూపరింటెండెంట్ లోపల అడుగుపెట్టాడు. ఆయన వెంబడే లేడీ ఆర్.ఎం.ఓ., ఇద్దరు జవాన్లూ, ఇద్దరు స్వీపర్లూ, ఇద్దరు తోటీలు వున్నారు.

సూర్యంకాంపౌండులోకి అడుగుపెట్ట లేదు...అకౌంటెంటు తంగవేలూ,యు.డి.సి. భాస్కరం అతని ప్రక్కనే నిలబడ్డారు.

సూర్యానికి తెలుసు...తాము క్వార్టర్సులోకి అక్రమంగా ప్రవేశిస్తే 'ట్రెస్‌పాస్' క్రిందకు వస్తుందని...అందుకే ఆయన ముందు అడుగు వెయ్యలేదు...

పుల్లయ్య ఇంట్లో లేడు. ఎక్కడికి వెళ్లాడో.

హాల్లో అతని భార్యా, ముసలి తల్లి నాంచారమ్మా, యిద్దరు చిన్న పిల్లలు నిలబడి వున్నారు.

సూపరింటెండెంటు రావటం, పుల్లయ్య భార్య పిచ్చమ్మ భయం, భయంగా చూసింది.

నాంచారమ్మ కళ్లల్లో క్రోధం వుట్టిపడుతున్నది. ఆమెకు వయస్సు అరవైదాటి వుంటాయి. పుల్లయ్య తమ్ముడు గోపయ్య కూడా యింట్లో లేడు.

“సుబ్బయ్యా! సామాను వాళ్లు బయటవడేస్తారో మిమ్మల్ని వడేయమంటారో అడగండి!”

సూపరింటెండెంటు వాకిలి ముందు నిల్చొని ఆర్డరు జారీ చేసాడు.

పిచ్చమ్మ ముఖంలో ఏడుపు సూచనలున్నాయి. కాని నిగ్రహించుకొంటున్నది.. ఆమె మాట్లాడలేదు.

'మాకేం ఖర్మ పట్టింది. ఆ చేసే పనేదో ఆయన్నే చెయ్యమను!” అంటూ చిదరిస్తూ పలికింది నాంచారమ్మ.

“ఊ..కానియ్యండి!” అన్నాడు సూపరింటెండెంటు.

లేడీ ఆర్.ఎం.ఒ వూరికే నిల్చొంది కాని ఏమీ పలకలేదు.

జవాన్లు లోపల ప్రవేశించి సామాన్లు తెచ్చి కాంపౌండుకు బయట పెడ్తున్నారు.

ఒక నులకమంచమూ, పరుపు చుట్టా, ఒక టేబిల్ ఫ్యాన్..వగైరా.

నాంచారమ్మ సూపరింటెండెంటు వంక చూసి తిట్టడం మొదలెట్టింది చేతులు వివిధ భంగిమలలో త్రిప్పుతూ-

“నీకేం పోయ్యేకాలమొచ్చిందిరా సూపరింటెండెంటు! నీయింట్లో పనిచెయ్యలేదని మమ్మల్ని క్వార్టర్సు నుంచి వెళ్లగొట్తావా? ఇది ప్రభుత్వ క్వార్టర్సు! మమ్మల్ని వెళ్లి



పొమ్మనటానికి నీకేం హక్కుంది? ఇవ్వాళ మమ్మల్ని హింస పెట్టగానే కాదు. ఇంతకింత అనుభవిస్తావ్! నా కొడుకు కూడా ఐ.ఎ.ఎస్. పరీక్ష వ్రాసాడులే. రేపో, ఎల్లుండో కలెక్టరుగా వస్తాడు. అప్పుడు చూపిస్తాం మా తడాఖా-" అంటూ పిచ్చి పిచ్చిగా సూపరింటెండెంటుకుశాపనార్థాలు పెట్టింది.

కాని సూపరింటెండెంటు భయంకరం మాత్రం కిమ్మనలేదు.

ఇంతలో పుల్లయ్య బయటి నుంచి పరుగెత్తుకొంటూ వచ్చాడు. బయటపడేసిన తన యింటి సామానునీ, బయట చేరిన జనాన్నీ, యింటి వాకిలిముందు యముడిలాగా నిలబడ్డ సూపరింటెండెంటునీ యమకింకరులలాగా నిలబడ్డ సూపరింటెండెంటు సిబ్బందినీ చూసాడు.

అతనికి వళ్లు తెలియని కోపం ముంచుకొచ్చింది. తన హోదా మర్చిపోయాడు- సూపరింటెండెంటుని తిట్ల పురాణంతో సత్కరించాడు. కాని సూపరింటెండెంటు పల్లెత్తు మాట అనలేదు.

పుల్లయ్యకు మొదటినుంచీ యు.డి.సి. భాస్కరంమీద అనుమానం.. అతనే సూపరింటెండెంటుకి చెప్పి చేయిస్తున్నాడని. ఎందుకంటే భాస్కరం ఆ మధ్య పుల్లయ్యకు ఏదో పని చెప్తే చెయ్యలేదని. బయట నిల్చొన్న భాస్కరాన్ని చూడగానే అతని వైపుకి వురకపొయ్యాడు.

"భాస్కరం మహాశయా! నువ్వే యిదంతా చేయిస్తున్నావు. ముందు నిన్ను తన్నాలి.." అంటూ

## విడిపోయిన మబ్బులు

భాస్కరం ముందుకు వురుకుతున్న పుల్లయ్యను చూసి భయపడి ఒక అడుగు వెనక్కి వేసాడు కూడా. ఇంకో క్షణముంటే ఏ దొమ్మీ చూడాల్సి వచ్చేదో.. కాని ఈ లోగా ఆస్పత్రి సిబ్బంది, యూనియన్ ప్రెసిడెంటు వీరయ్య అక్కడకు పరుగెత్తుకొంటూ వచ్చి భాస్కరం మీదికి వురుకుతున్న పుల్లయ్యను రెక్కపట్టుకొని ఆపాడు.

"బుద్ధిలేనివాడా! మధ్య భాస్కరం గారేం చేసాడు? ఆయనమీదికి దూకుతున్నావ్! వయస్సుతోపాటు నీ బుద్ధి కూడా మందగిస్తున్నదోయి! సూపరింటెండెంటుగారినే యింకాస్త వ్యవధి కావాలని అడగాలి కానీ" అంటూ సూపరింటెండెంటుగారి వేపుకు తిరిగి "అయ్యా! చూసారుగదా! ఎంత జనం ప్రోగయ్యారో! ఎంత రభస జరుగుతున్నదో! తమరు దయచేసి మరో నెల రోజులు గడువిప్పించండి! పుల్లయ్య చేత మేమే ఖాళీ చేయిస్తాం.." అంటూ సూపరింటెండెంటుని ప్రాధేయపడ్డాడు.

పాపం సూపరింటెండెంటు భయంకరంగారు పుల్లయ్య యింత భయంకరంగా తెగిస్తాడని అనుకోలేదు. అక్కడ ప్రోగయిన జనాన్ని చూసి, ఆయన కూడా కొంచెం "గిల్టీ" గా భావించాడు.

"సరే వీరయ్యా! నువ్వు యూనియన్ ప్రెసిడెంటుగా చెప్తున్నావని నీమాట వింటాను. అలాగే యింకొక్క నెల రోజులు గడువిస్తున్నాను. పుల్లయ్యచేత క్వార్టర్సు ఖాళీ చేయించండి.." అంటూ సూపరింటెండెంటు తన సిబ్బందిని పుల్లయ్య సామానుజోలికి పోవద్దన్నాడు. తన సిబ్బందితో తిరిగి వెళ్లడానికి వుద్యుక్తుడయ్యాడు.

కాని పుల్లయ్య ముసలి తల్లి నాంచారమ్మ.. కాబోయే కలెక్టరు తల్లి.. వూరుకోలేదు. ఆమె శరీరమంతా అవమానంతో వణికింది. సూపరింటెండెంటు మీద తిట్లతో పదునైన బాణాలు వదిలింది.

"ఒరేయి సూపరింటెండెంటూ! ఇంటితో నిన్ను వదిలిపెడ్తామనుకొన్నావేమో ఇదిగో చూడు! మీరంతా కలిసి నన్ను పట్టుకొని కొట్టారని పోలీసు కేసు పెట్టించి నీ అంతు చూస్తానురా! ఇప్పుడేదో అధికరముందిగదా అని విర్రవీగుతున్నావు..' అంటూ క్రిందనుంచి ఓ పదునైన కంకర రాయి తీసుకొని చేతులమీదా, వంటిమీదా గాట్లు చేసుకొంది. ఆ గాటులలోనుంచి రక్తం కారుతున్నది. తను కట్టుకొన్న చీరా, రెవికా, తన చేతులతోనే చింపుకొంది. జుట్టు ముడివిప్పి వరచేసుకొంది. ఇంకా ఏమేమో చేసింది. పదిమంది కలిసి, పట్టుకొని, దాడి చేసిన, ఓ అమాయకపు ముసలిదానిలా కన్పించింది.

ఇదంతా చూసి సూర్యం నిర్ఘాంతపోయాడు- సూపరింటెండెంటు మాత్రం మాట్లాడకుండా వ్యానెక్కాడు. ఆయన వెంబడే సిబ్బంది అంతా ఆఫీసుకు అనుసరించారు.

* * * * *

అసలు జరిగిన కథ యిది.

తర్వాత నాంచారమ్మ చాలా కథ జరిపించింది. పోలీసు స్టేషనులో కొడుకుచేత ఫిర్యాదు యిప్పించింది. తమ క్వార్టర్సులో అక్రమంగా ప్రవేశించి తమ సామాను చిందరవందర చేసి బయటపడేసినట్లు, అడ్డమొచ్చిన తనను పట్టుకొని కొట్టి అవమానపరచినట్లు, ఆయనకు లే సెక్రటరీ సూర్యం, అకౌంటెంటు తంగవేలూ, యు.డి. సి. భాస్కరం సహాయ పడినట్లు, సూపరింటెండెంటుతో సహా ఈ ముగ్గురినీ ముద్దాయిలుగా చేర్చొంది. లేడీ ఆర్.ఎం.ఓని ముద్దాయిగా చేర్చలేదు. కారణం వూహించాల్సిందే! ప్రైవేటు డాక్టరుదగ్గర మెడికల్ సర్టిఫికెట్టు సంపాదించారు. నలుగురు రిటైర్డు పోలీసులను సాక్ష్యమేసాడు పుల్లయ్య. వాళ్లు అతనికి స్నేహితులు

### బ్యూటీ క్లినిక్ మహాత్మ్యం

తన అందాన్ని మరింత నాజూకుగా వుంచుకొనేందుకు బ్యూటీ క్లినిక్ ను ఆశ్రయించి చివరకు అందవిహీనురాలైందట ఒక మలేషియన్ యువతి. నలభై ఏళ్ల ఆ యువతి తరిగిపోతున్న తన అందాన్ని పెంచుకునేందుకు బ్యూటీ క్లినిక్కు వెళ్లగా అక్కడ ఒక ఇంజక్షన్ చేసి నీ అందం ముందు అందరూ దిగదుడుపే అన్నారట. ఇంకేముంది ఆ యువతి సంబరపడిపోయింది. ఆ సంబరం ఎన్నాళ్లో లేదట. వారం తిరక్కుండానే ఆ యువతి ముఖం అంతా వాచిపోయిందట. ఆ బ్యూటీ క్లినిక్ కు వెళ్లి అడుగుదామనుకుంది కాని ఆ బ్యూటీషియన్ వుంటే కదా! అనక ఒక సర్జన్ దగ్గరకు వెళ్లి శస్త్ర చికిత్స చేయించుకుంది కాని అందం పెరగకపోగా అందవిహీనంగా తయారైందట. ప్చ్...!

కాబోలు!

ఆస్పత్రి గోడలమీద, పోస్టర్లు అంటించబడ్డాయి. అచ్చువేసిన కరపత్రాలు వూళ్లో పంచబడ్డాయి. అక్కడక్కడ పోస్టర్లు దర్శనమిచ్చాయి. సూపరింటెండెంటు జులుముని అరికట్టాలి" అంటూ

వాడు చేసిన దుష్ప్రచారానికి తట్టుకోలేక వాడికి సూర్యంచేత సస్పెన్షను అర్డర్ వ్రాయించి సర్వే చేయించాడు సూపరింటెండెంటు.

"సస్పెన్షన్" అర్డర్లమీద ప్రభుత్వోద్యోగుల ట్రిబ్యునల్‌లో "స్టే" అర్డర్లు తేవటానికి వుల్లయ్య చేసిన ప్రయత్నం విఫలమయింది. కాని లోకల్ పోలీసులను వుల్లయ్య తన చేతిలో పెట్టుకోగల్గాడు. దానికి కారణం అతని బతమ్ముడు గోపయ్య. అతనికి స్థానిక పార్టీ నాయకులతో బాగా పరిచయముంది. వాళ్లవత్తాసు సంపాదించి పోలీసు కేసును గట్టిచేసుకొన్నాడు.

పోలీసు స్టేషనులో ఎఫ్.ఐ.ఆర్. తయారయింది. పోలీసులు ఫస్టు క్లాసు మేజిస్ట్రేటు కోర్టులో క్రిమినల్ కేసు దాఖలు చేసారు. కోర్టు సమన్లు పార్టీలకు సర్వు కాకుండానే అయినట్లు నాటకమాడించారు. ఒక్కసారైనా కోర్టుకు హాజరుకమ్మంటూ మేజస్ట్రేటుగారి అరెస్టు వారంట్లే సర్వు అయినాయి. సూపరింటెండెంటూ, అక్కౌంటెంటు తంగవేలూ, యు.డి.సి.. భాస్కరం ముగ్గురు హాజరుకావడానికి వెళ్లారు పోలీసు వారెంటుతో.

ఇదీ దాని పూర్వ కథ!

*  *  *  *  *

వారెంటు సంగతి విని, సూర్యం కూడా ఒక యు.డి.సి. స్కూటరు మీద మేజస్ట్రేట్ కోర్టుకు హాజరైనాడు.

సూర్యం కోర్టుకి వెళ్లేసరికి వాళ్లు ముగ్గురూ కోర్టు వరండాలో నిల్చొని నల్ల కోటు వేసుకొన్న లాయరుతో మాట్లాడుతున్నారు.

"మీ నల్గురిమీదా కోర్టులో నేరారోపణ పత్రం చదువుతారు. మాకేం తెలీదు. మేము నేరం చెయ్యలేదు అని చెప్పండి. అంతే. నేను బెయిలు పిటిషను దాఖలు చేస్తాను. భాస్కరంగారు పిలిపించిన పెద్దమనుష్యులు హాజరుగా వున్నారుగదా. వారి సాల్వెన్సీ సర్టిఫికెట్లు గూడా దాఖలు చేస్తాను. మేజిస్ట్రేటు గారు మీకు బెయిలు యిస్తారు. తర్వాత కేసు విచారణకు వచ్చినప్పుడు చూసుకొందాము..." లాయరుగారు అన్నారు.

సూర్యానికి భాస్కరం జరిగిన సంగతంతా చెప్పాడు. జామీనుదారులను తాను హాజరు పరిచినట్లు చెప్పాడు. భాస్కరానికి వూళ్లో ఒక బ్రాందీ షాపు వుంది- వూళ్లో అతనికి కొంత పలుకుబడి వుంది.

తర్వాత కోర్టు జవాను వాళ్ల పేర్లు పిల్చాడు. వాళ్లు నల్గురూ ఒకరి వెంబడి ఒకరు మేజస్ట్రేటుగారి కెదురుగా గోడనానుకొని నిలబడ్డారు. అయనకు దండం పెట్టకతప్పలేదు.

సూపరింటెండెంటూ, సూర్యం కూడా గెజిటెడ్ ఆఫీసర్లే!




ఏదో పెద్ద క్రిమినల్ నేరం చేసినట్లు దోషిగా కోర్టులో నిలబడాల్సివచ్చింది .. వాళ్లంతా.

సూపరింటెండెంటు చాలా భయపడుతున్నాడు లోపల, లోపల తన నేమి చేస్తారోనని!

కాని ఏ నేరమూ చెయ్యని సూర్యానికీ, భాస్కరానికీ, తంగవేలుకూ భయమెందుకు?

మేజస్ట్రేటు స్థానంలో ఓ మహిళ కూర్చుని వుండటంతో సూపరింటెండెంటుకు యింకా సిగ్గుగా వుంది. నేరారోపణ పత్రం చదవటం, నల్గురూ తాము తప్పు చెయ్యలేదని చెప్పటం అయింది.

లాయరు లేచి ఇలా చెప్పారు.

"యువరానర్! ముద్దాయిలు గౌరవనీయులైన శాశ్వత ప్రభుత్వోద్యోగులు. నమ్మకస్థులు. వాళ్లకు జామీను యివ్వవలసిందిగా ప్రార్థిస్తున్నాను."

అంటూ జామీను పత్రాలను ఆమె ముందు దాఖలు చేసారు.

"జామీనుదార్లు లేరా?" అడిగారు మేజస్ట్రేటుగారు.

ఒకప్రక్కన నిల్చొన్న వాళ్లని లాయరు గారు చూపించారు. వాళ్లు మేజస్ట్రేటుకు నమస్కారం చేసారు.

"వారు ప్రభుత్వ వుద్యోగులయినంత మాత్రాన నేరం చెయ్యలేదని భావిస్తున్నారా?"

ఆడ మేజస్ట్రేటు ఓ చురక విసిరింది.

"అదికాదు మేడమ్! వారు గౌరవనీయులైన ప్రభుత్వోద్యోగులు కాబట్టి వాళ్లకి బెయిలు యిప్పించవలసిందిగా ప్రార్థిస్తున్నాను.."

అంటూ లాయరుగారు లేచి చెప్పాడు. కాని మేజస్ట్రేటు బెయిలు అర్డర్లు వెంటనే యివ్వలేదు. లంచి అవరు తర్వాత చూస్తానంది.. ఈ లోగా వాళ్లు నల్గురూ మేజస్ట్రేటుగారి హెడ్ గుమాస్తా బల్లముందు కుర్చీలలో కూలబడ్డారు.

సూపరింటెండెంటుగారికి భయమేస్తున్నది. అసలు తమకి మేజస్ట్రేటు బెయిలు ఇస్తుందా? తను అప్పుడు అలా తొందరపడకుండా వుండాల్సింది అనుకొన్నాడు- కాని హెడ్ గుమాస్తా ధైర్యం చెప్పాడు.

లంచ్ అవర్ తర్వాత మేజస్ట్రేటు బెయిలు అర్డరు యిచ్చింది. ఫలానా రోజున తాము తిరిగి కోర్టుకు హాజ

(72వ పేజీ చూడండి)

# తృప్తి

## కాలువశ్రీ

తన గదిలో కూర్చున్న డా. అశోకరావు కళ్ళ ముందు రామయ్య రూపం కదులుతుంది..."నన్ను బ్రతికించండి డాక్టర్... నన్ను బ్రతికించండి..." అని దీనంగా వేడుకున్న అతని మాటలు చెవుల్లో ప్రతిధ్వనిస్తున్నాయి. పుట్టిన ప్రతి ప్రాణికీ చావు అనివార్యమైనా, డాక్టర్‌గా అతనెన్నో చావులు చూసినా రామయ్య మరణం ఎందుకో అతడు మరచిపోలేక పోతున్నాడు. అతన్ని బ్రతికించడానికి అతడెంతో కృషి చేసాడు...

డాక్టర్‌గా తన వైద్యవిజ్ఞానాన్నంతా ఉపయోగించాడు. తన నర్సింగ్‌హోమ్‌లో వున్న డాక్టర్ల సహాయ సహకారాలే కాకుండా, ఆ నగరంలోని మంచి డాక్టర్లందరి సలహాలూ తీసుకున్నాడు. తన శాయశక్తులా ప్రయత్నించాడు. అయినా అతన్ని బ్రతికించలేకపోయాడు. రామయ్య మరణానికాతడంతగా బాధపడటానికి కారణం రామయ్య డా. అశోకరావు తండ్రి కాలం నుంచీ ఆ నర్సింగ్‌హోమ్‌కు రెగ్యులర్‌గా వచ్చే పేషంటవడం ఏ మాత్రం కాదు. ఆ నగరంలో ఎంతో పేరున్న ఆ నర్సింగ్ హోమ్‌కు రామయ్యలాంటి ఎంతో మంది పేషెంట్లు రెగ్యులర్‌గా వస్తూనే వుంటారు. మరాతనిది అకాల మరణమా అంటే అదీ కాదు. తొమ్మిది పదులు దాటిన తర్వాతే మరణించాడు రామయ్య. డాక్టర్ అశోకరావు రామయ్య మరణానికంతగా బాధపడటానికి కారణం అతనికి బ్రతకాలని వున్న ఆరాటం. తొంభై ఏళ్ళుదాటినా బ్రతుకుపై వున్న తీపి... బ్రతకాలి...బ్రతకాలి...తానింకా బ్రతకాలని బ్రతకడానికతడు పడ్డ తపన. ఇంకా బ్రతకాలని చావుతో అతడు చేసిన పోరాటం... మంచంలో వెల్లకిలా పడుకున్నాడు అశోకరావు. అతని కళ్ళ ముందు రామయ్యను గూర్చిన జ్ఞాపకాలు సినిమా రీళ్ళలా తిరుగుతున్నాయి. అతని మనస్సు గతంలోకి పరుగెత్తింది...

*** *** *** *** ***

డాక్టర్ భూంరావు ఆ గదిలోకి ప్రవేశించకుండానే రామయ్య అరుపులను విన్నాడు. అతడు భార్యమీద కేకలేస్తున్నాడు. పిల్లలను తిడుతున్నాడు. ఆ గదిలోకి ప్రవేశిస్తూ అందరి మీదికి లేవడం చూసాడు. డాక్టర్ తన జనంతో గదిలో కొచ్చేసరికి కిక్కురుమనకుండా పడుకున్నాడు. డాక్టర్ భూంరావు నవ్వుకున్నాడు. ఆ నర్సింగ్‌హోంలో చేరిన నాలుగైదు రోజులుగా రామయ్య సంగతి చూస్తూనే వున్నాడు భూంరావు. రామయ్య దగ్గరికెళ్ళి నాడీ పరీక్ష చేసాడు. కడుపు ఒత్తి చూసాడు. కేస్ షీటు చదివాడు. "నిన్నట్నుంచి జ్వరం పెరగడం లేదు..రెండ్రోజుల్లో పంపిస్తాను..." అన్నాడు. "మంచి మందులు రాయిండ్రి డాక్టర్..." అన్నాడు రామయ్య.



"మంచివే రాస్తున్నానయ్యా! ఒక్కొక్కగోలీ రూపాయి...ఇంజెక్షన్ పదిహేను రూపాయలు..." మాట్లాడుతూనే కేస్ షీట్‌పై ప్రిస్క్రిప్షన్ రాసాడు డా. భూంరావు.

"సరేకాని రామయ్యా! ఎందుకంత హడావిడి చేస్తున్నావు...అందర్నీ దబాయిస్తున్నావు...?" అన్నాడు భూంరావు...

"నేనంటే ఎవరికీ లక్ష్యంలేదు... నన్ను సరిగ్గా చూసుకోవడంలేదు"రామయ్య మాటలకు నవ్వాడు డాక్టరు...

"నాకు తెలిసినంతవరకు నిన్ను నీ భార్యాపిల్లలు చూసుకుంటున్నట్లుగా ఇంకెవ్వరూ చూసుకోవటంలేదు."

"మీరలాగే అంటారు డాక్టర్..." అని ఆగాడు రామయ్య...

"రామయ్యా! నీకు సమయానికి మందులందిస్తున్నారు....ఏదంటే అది కొనిపెడ్తున్నారు...ఊర్నిండి రోజూ నిన్ను చూడటానికి ఇరవై మందైనా వస్తున్నారు...నీ మీద ఈగకూడా వాలనివ్వడం లేదు..నీకు ఏం కొంచెం నొప్పయినా గబగబా నా దగ్గరికురికొచ్చి తీసుకొస్తున్నారు... నువ్వు పిలువమంటే చాలు, నేను కోప్పడినా నన్ను బ్రతిమిలాడి తీసుకొస్తున్నారు. ఇంకా మంచిగా చూసుకోవటమంటే ఎలా వుంటుంది...?" అన్నాడు డాక్టర్...

"అదిగాదు సార్...అయనను మీరింత జాగ్రత్తగా చూసుకుంటున్నా, మేము కంటి మీద కునుకు లేకుండా చూసుకుంటున్నా తనకేమో అవుతుందని భయం... తాను బ్రతుకుతానో బ్రతుకనో అని ఆరాటం... మీరెన్ని చెప్పిపోయినా నేను బ్రతుకుతానా అని మమ్మల్ని చంపుకుతింటారు..." అంది రామయ్య భార్య...

"రామయ్యా! నీకొచ్చింది పెద్ద రోగమేంకాదు...అందర్నీ పరేషాన్ చెయ్యకు.. నీకొడుకులు, నీ భార్య, నీ కూతురు నీ కోసం ఎంత ఆరాటపడుతున్నారో నాకు తెలుసు...నువ్వు చాలా అదృష్టవంతుడివి..." అన్నాడు డాక్టర్...

"అలాగే సార్..." అని లేచి కూర్చున్నాడు రామయ్య...డాక్టర్ భూంరావ్ ప్రక్కనున్న యువకుడ్ని చూసి

"ఈ బాబెవ్వరు సార్.." అన్నాడు...

"నా కొడుకు...డాక్టర్ కోర్సు చదువుతున్నాడు....సెలవులని ఇంటికొచ్చాడు..." అన్నాడు భూంరావ్.

"అచ్చం మీ తీరుగనే ఉన్నాడు

సార్...మాకు కాబోయే డాక్టరన్నమాట... పేరేంటి సార్...?" అన్నాడు రామయ్య...

"అశోకరావు..."చెప్పాడుభూంరావ్...

భూంరావ్ గది బయటకు పోయే వాడల్లా ఆగి వెనుకకు తిరిగొచ్చాడు.. రామయ్య మంచం దగ్గరున్న స్టూలుపై కూర్చున్నాడు...చిరునవ్వు ముఖంతో అన్నాడు...

"రామయ్యా! నీకు బ్రతకాలనున్న ఆరాటం చూస్తుంటే నీతో కొంచెం సేపు మాట్లాడాలనిపిస్తుంది....నీకిప్పుడెంత వయస్సు..."

"నలభై ఏళ్ళకు దగ్గర్లో వున్నాను..." అన్నాడు రామయ్య-



"నలభై ఏళ్ళు హాయిగా బ్రతికావు.... అనుభవించావు...నీ వంశం నిలుపడానికి పిల్లలున్నారు...అయినా ఇంకేం సాధించాలని బ్రతకాలనుకుంటున్నావు...?"నవ్వుతూ అడిగాడు భూంరావ్...

ఆ మాటల కాశ్చర్యపోయాడు రామయ్య....

"అవ్వేం మాటలు సార్...? నా పిల్లలింకా ఎదుగ లేదు...ఇద్దరు కొడుకులూ చదువుకుంటూనే వున్నారు..ఉన్నొక్క బిడ్డ పెండ్లింకా కాలేదు... నేనిప్పుడే చనిపోతే నా కుటుంబం కుక్కలు చింపిన విస్తరి కాదా సార్...? నా పిల్లలకు దిక్కెవ్వరు...?" అన్నాడు రామయ్య....

"అంటే నీ పిల్లలను పైకి తీసుకు రావడానికి వాళ్ళకో మార్గం చూపేంత వరకైనా నువ్వు బ్రతకాలంటావు....అంతేనా....?"

"అవును సార్...నా బిడ్డకు పెళ్ళయి, నా కొడుకులు జీవితంలో స్థిరపడ్డారంటే నాకేం కావాలి...? ఇప్పుడు పోతే నా కుటుంబం పిల్లలు దిక్కులేని పక్షులౌతారనే నా ఆరాటం..." అన్నాడు రామయ్య...

"అంటే నీకెన్నేళ్ళు బ్రతకాలనుంది...?"

"అరవై ఏళ్ళు బ్రతికితే చాలు...అటు తర్వాత నేనేమయినా ఫర్వాలేదు..."

"అరవయ్యేళ్ళేం ఖర్మ...నువ్వునూ రేళ్ళు బ్రతుకుతావు..." అని నవ్వుతూ బయటకెళ్ళిపోయాడు డాక్టర్ భూంరావ్...

నాలుగైదు రోజుల తర్వాత సంపూర్ణారోగ్యంతో డాక్టర్ గారికి కృతజ్ఞతలు చెప్పి ఊరెళ్ళిపోయాడు రామయ్య....

దాదాపు రెండు దశాబ్దాల కాలం గడిచింది. డా. భూంరావ్ కొడుకు అశోకరావు డాక్టర్ అశోకరావయ్యాడు.... తండ్రితోపాటు నర్సింగ్ హోం బాధ్యతలు చూసుకుంటున్నాడు...రామయ్య కొడుకులిద్దరూ మంచి ఉద్యోగాల్లో స్థిరపడ్డారు...కూతురుకు పెళ్లయి మంచి స్థితిలోనే వుంది...పెద్ద కొడుక్కు-కూతురుకు పిల్లలు కూడా అయ్యారు....రామయ్య అరవై ఏళ్ళ వయసుకు దగ్గర్లో వున్నాడు...తలనెరిసింది...ముఖంపై ముడతలొచ్చాయి. అతనికి భార్యా వియోగం కూడా కల్గింది....ఈ నడుమ రామయ్య చిన్న చిన్న రోగాలకు ఆ నర్సింగ్‌హోంలో ట్రీట్‌మెంట్ తీసుకున్నా, ఇరవై ఏళ్ళ తర్వాత-మూత్రం ఆగిపోవడం వల్ల మళ్లీ అందులో చేరాడు... డాక్టర్ భూంరావ్ కొడుకు సహాయంతో 'ప్రాస్టేట్' ఆపరేషన్ చేసి రామయ్యను ప్రాణాపాయం నుండి కాపాడాడు....నర్సింగ్ హోంలో చేరిన పదిహేను రోజుల్నుంచీ రామయ్యను గమనిస్తున్నారు డాక్టర్ అశోకరావు, భూంరావులు...ఇరవై ఏళ్ళ క్రితం చేరినప్పటి కంటె ఎక్కువ గోల చేస్తున్నాడు రామయ్య....కొడుకులను తిడ్తున్నాడు...కోడళ్ళను కేకలేస్తున్నాడు...బిడ్డను కసురుకుంటున్నాడు..

# తీపి

..మందివ్వడం కొంచెం ఆలస్యమయినా, పాలు అందివ్వడంలో జాప్యం జరిగినా బూతులు తిడుతున్నాడు....పదే పదే డాక్టర్‌ను రమ్మంటున్నాడు.... అతని ప్రాణానికేం ప్రమాదం లేదని చెప్పినా గొడవ చేస్తూనే వున్నాడు.. రామయ్య కొడుకులిద్దరూ సెలవుపెట్టొచ్చి తండ్రితోనే వుంటున్నారు... కూతురు కూడా నర్సింగ్ హోంలోనే వుంటుంది...వాళ్ళంతా అతన్ని కంటికి రెప్పలా కాపాడుకుంటున్నారు...వాళ్ళెంత బాగా చూసుకుంటున్నా డాక్టర్ తన గదిలో కొస్తే వాళ్ళపై ఏదో ఫిర్యాదు చేస్తూనే వున్నాడు....

"డాక్టర్...చేతకాని ముసలోణ్ణి నేను చచ్చిపోవాలని వీళ్ళకుంది....నన్ను సరిగ్గా చూసుకోవడం లేదు....నా భార్యుంటే ఇలా జరిగేదా....?"

"రామయ్యా! నీ పిల్లలు నిన్ను బాగానే చూసుకుంటున్నారు. నీకేం లోపం జరిగినా వాళ్ళను మందలిస్తాంలే...." అని సముదాయిస్తున్నారు తండ్రీ కొడుకులు...

మరో పది రోజుల తర్వాత అతని మూత్రనాళంలో అమర్చిన రబ్బరు పైపు తీసేసారు డాక్టర్లు....అతడిప్పుడు మామూలుగా మూత్రం చేస్తున్నాడు....క్రమక్రమంగా కోలుకుంటున్నాడు..కాని, మూత్రం చేసేప్పుడు ఏ కొంచెం నొప్పొచ్చినా, ఎప్పుడోసారి జ్వరం వచ్చినా నానా హడావిడి చేస్తున్నాడు....డాక్టర్లాతన్ని సముదాయించలేక సతమతమవుతున్నారు...

వయసుతోపాటు రామయ్యకు ఇంకా జీవించాలన్న ఆరాటం, బ్రతుకుపై తీపి మరింత పెరిగాయని డాక్టర్లర్థం చేసుకున్నారు...నర్సింగ్ హోంలో వున్న నెల పది రోజుల్లో రామయ్య వాళ్ళకు మరింత దగ్గరయ్యాడు...ఇంకో రెండు రోజుల్లో డిస్చార్జి చేస్తారనగా రామయ్య దగ్గరొచ్చి కూర్చున్నారు తండ్రీ కొడుకులు....

"ఏం రామయ్యా! ఎలావున్నావు...?" అడిగాడు భూంరావ్.

"మీ దయ వల్ల బాగానే వున్నాను సార్...."

"రామయ్యా! ఇరవై ఏళ్ల క్రితం నువ్వేమన్నావో గుర్తుందా?" అన్నాడు భూంరావ్.

"లేదు సార్....ఏమన్నాను....?"

"పిల్లలు స్థిరపడితే చాలు... అందు కోసమే నువ్వు ఇంకా బ్రతకాలనుకుంటున్నానన్నావు...."

కావచ్చు అన్నట్టుగా తలూపాడు రామయ్య...

"ఇప్పుడు నీ పిల్లలంతా స్థిరపడ్డారు.... స్థిరపడటమే కాదు... మంచి స్థితిలో వున్నారు... నువ్వు మనుమలను, మనుమరాండ్రను కూడా చూశావు. ఇప్పుడు నీ పిల్లలకు నీ అవసరం లేదు. అయినా నువ్వు జబ్బు పడితే ఇరవై ఏళ్ల క్రితం కంటె కూడా ఎక్కువ ఆందోళన చెందావు....నీకు ఇంకా బ్రతకాలన్న ఆరాటం, బ్రతుకుపై తీపి మరింత పెరిగాయి..." నవ్వుతూ అన్నాడు భూంరావ్.

"ఎవ్వరికైనా చనిపోవాలనుంటుందా సార్...?"

"నువ్వింకా బ్రతకాలను కోవడంలో నీ ఉద్దేశ్యమేమిటి...? ఏం సాధించాలనుకుంటున్నావు...? నీ లక్ష్యమేంటి?..."

డాక్టర్‌గారి మాటలర్థం కానట్టుగా అయోమయంగా చూశాడు రామయ్య.

"ఎంత వయసొచ్చినా మనిషింకా బ్రతకాలనుకోవడంలో తప్పులేదు...కాని, నీ భార్య చనిపోయింది... దాదాపు నువ్వనుకున్నవన్నీ అయిపోయాయి... ఇంకేం చూడాలని బ్రతకాలనుకుంటున్నావు?..." అన్నాడు భూంరావ్.

"నా చిన్న కొడుక్కింకా పిల్లలు కాలేదు... వాడి పిల్లలను కూడా చూసు



## 'టీపు' దర్శకుడిగా శ్రీధర్

ప్రతివారం టి. వి. ప్రేక్షకులకు కనువిందు చేస్తున్న 'ది స్వోర్డ్ ఆఫ్ టిపుసుల్తాన్'కు శ్రీధర్ క్షీర సాగర్ దర్శకత్వ బాధ్యతలు చేపట్టవచ్చునని అనుకుంటున్నారట. మరి శ్రీధర్ 'టిప్పు'కు దర్శకత్వం వహిస్తే 'మంజిల్' పరిస్థితి ఏమవుతుందో నంటున్నారు. 'టిపు' కాగానే దానికి దర్శకత్వం వహిస్తాడేమో?



కుంటే నాకు తృప్తిగా వుంటుంది..."

ఆ మాటలకు నవ్వారు డాక్టర్లిద్దరూ...

"అటు తర్వాత నువ్వు బ్రతకాలనుకోవు...అంతేనా....?" అంటూ లేచారు.

"ఏదో సరదాకిలా అడిగాను...ఏమనుకోకు...నీకు బ్రతుకుపై వున్న ఆరాటం చూస్తుంటే ఇలా అడగాలనిపించింది..... అని అక్కణ్నుంచి వెళ్లిపోయారు."

మరో మూడు దశాబ్దాలు కాలగర్భంలో కలసిపోయాయి...రామయ్య చూడాలనుకున్న చిన్న కొడుకు పిల్లలనూ చూసాడు... తన మనుమలు, మనుమరాండ్రకు పిల్లలనూ చూసాడు... రామయ్య సంతానమే ముసలివాళ్లవుతున్నారు....రామయ్యకు నడుం వంగిపోయి చేతగాకుంటయింది... కర్రె పట్టుకొని అటూ - ఇటూ నడుస్తున్నాడు.... ఇన్నోజులుగా రామయ్యకు ట్రీట్‌మెంటిచ్చిన డాక్టర్ భూంరావ్ మరణించాడు... అతని కొడుకు నర్సింగ్‌హోమ్ బాధ్యతలను తీసుకున్నాడు.... అతడూ వృద్ధుడయ్యాడు.

తొమ్మిది పదుల వయస్సులో తీవ్రమైన జబ్బుతో రామయ్య నర్సింగ్ హోమ్‌లో చేరాడు... ఈసారతని మనుమలు, మనుమల పిల్లలు కూడా వెంబడొచ్చారు..

డాక్టర్ అశోకరావును చూసిన రామయ్య రెండు చేతులెత్తి నమస్కరించాడు. అతని ముఖంలో అభ్యర్థ నుంది...వేదనుంది... బ్రతకాలన్న ఆరాటముంది... బ్రతుకుపై తీపుంది.

"సార్...నేనుబ్రతకాలి...ఎంత డబ్బైనా సరే... నన్ను బ్రతికించండి..." రామయ్య మాటలు బలహీనంగా వున్నాయి.

ఆ మాటల కాశ్చర్యపోయాడు డా. అశోకరావు.

ఇదివరకటి కంటె కూడా రామయ్యకు బ్రతకాలన్న ఆరాటం ఎక్కువయిందని గ్రహించాడు అశోకరావు.

"నా ప్రయత్నం నేను చేస్తాను..." అన్నాడు.

"మా తాతయ్యను బ్రతికించండి" అని మనుమలు, "మా నాన్నను బ్రతికించండి" అని అతని కొడుకులు ప్రాధేయపడుతున్నారు.

"సార్...నేనింకా కొద్ది రోజులు బ్రతకాలి.. నా మునిమనుమలను చూసుకోవాలి... నా మనుమరాలి బిడ్డకు పెళ్లయింది... ఓ ఏడాదిలో నా మనుమరాలు అమ్మమ్మవుతుంది... నే నప్పుడు ముత్తాత నవుతాను... నన్ను బ్రతికించండి సార్..." ఈసారి అడగకుండానే తాను బ్రతకవలసిన అవసరం గూర్చి చెప్పాడు రామయ్య.

"రామయ్యా! నిన్ను బ్రతికించడానికే అన్ని ప్రయత్నాలు చేస్తాను... నా తెలివితేటలు, అనుభవాన్నంతా ఉపయోగిస్తాను... అయినా డాక్టర్లు రోగులకు ప్రాణాలు పోసే దేవుళ్లు కారుగదా....!" అన్నాడు అశోకరావు.

రామయ్యను బ్రతికించడానికి అన్ని ప్రయత్నాలు చేస్తున్నాడు అశోకరావు. తన పనులు తాను చేసుకోలేని స్థితిలో వున్నా రామయ్య కింకా బ్రతకాలనుండటం ఆతనికి ఆశ్చర్యం కల్గిస్తుంది.. డాక్టర్ రామయ్య గదిలోకి పోయినప్పుడల్లా ఆతన్ని బ్రతిమలాడుతూనే ఉన్నాడు రామయ్య. దీనంగా వేడుకుంటున్నాడు...

"నన్ను బ్రతికించండి సార్...నేను బ్రతకాలి సార్..." అని మాట్లాడటానికి చేతగాకున్నా మాట్లాడుతున్నాడు... రెండు చేతులెత్తి దండం పెడుతున్నాడు... ఎన్నో విధాలుగా వేడుకుంటున్నాడు... డాక్టర్‌గారి కాళ్ళకు మొక్కుతానంటున్నాడు...చచ్చి కడుపులో పుడతానంటున్నాడు... డాక్టర్ అశోకరావు అతనికి ఆపరేషన్ చేశాడు.... తన అనుభవాన్నంతా ఉపయోగించి మంచి ట్రీట్‌మెంటిచ్చాడు.. ఎందరో డాక్టర్ల సలహాలు తీసుకున్నాడు.. కాని రామయ్యను బ్రతికించలేకపోయాడు.. ప్రాణాలు విడుస్తూ రామయ్య దీనంగా, వేడుకోలుగా, ప్రాణ భయంతో చూసిన చూపు అశోకరావు హృదయంపై గాఢ ముద్రవేసింది.

మంచంలో లేచి కూర్చున్నాడు అశోకరావు..."ఎంత కాలం బ్రతికినా మనిషి ఇంకా బ్రతకాలని ఎందు కనుకుంటాడు...? జీవితానికే లక్ష్యం లేకున్నా బ్రతకడానికి మనిషికి ఎందు కింత ఆరాటం....? పిల్లలయ్యేంత వరకు పిల్లలు కావాలని... అటు తర్వాత వాళ్లు జీవితంలో స్థిరపడాలని...అటు తర్వాత వాళ్ల పిల్లలను చూడాలని....తర్వాత ఇంకో తరం పిల్లల్ని చూడాలని... ఇలా సాగిపోతూనే వుంటుంది.. ఎంత కాలం బ్రతికినా ఇక చాలు చసపోతానని ఎవ్వరైనా అనుకుంటారా...? మనస్ఫూర్తిగా మరణాన్ని ఆహ్వానించిన మనిషుంటాడా....? అది మహాత్ములకు, లక్ష్యసాధనకోసం బ్రతికేవాడికి సాధ్యమేమో...? కాని చాలా మంది ఓ లక్ష్యం లేకుండానే, జీవితానికో ధ్యేయమంటూ లేకుండానే కేవలం బ్రతకడానికొరకే బ్రతుకుతారు...."

డాక్టర్ అశోకరావు మెదడ్లో అంతులేని ఆలోచనలు...

"ప్రతి ప్రాణికి బ్రతుకుపై తీపుంటుంది... బ్రతకాలన్న ఆరాటముంటుంది...? కాని, లక్ష్యం....? తాను మాత్రం ఏ లక్ష్యంకోసం జీవిస్తున్నాడు....? తనను తానే ప్రశ్నించుకున్నాడు....

లేచి కన్సల్టేషన్ రూంలో కెళ్లాడు... రామయ్య డెత్ సర్టిఫికేట్ మీద సంతకం చేస్తున్న డాక్టరు అశోకరావు చేతులు వణుకుతున్నాయి....





## "ఉద్యమం"

"సెప్టెంబరు రిలీజ్" అన్నారు కె. రంగారావు. ఈయన కథ, స్క్రీన్ ప్లే, దర్శకత్వంలో వి. శ్రీనివాసరావు నిర్మించిన వి. ఎస్. ఆర్ట్ క్రియేషన్స్ "ఉద్యమం" చిత్రంలో భానుచందర్, యమున, రాజేష్, కోట శ్రీనివాసరావు, బ్రహ్మానందం, బాబుమోహన్, విద్యాసాగర్, అంజు, కల్యాణి నటించారు. ఏల్చూరి వెంకటరావు మాటలు, వేటూరి పాటలు, రాజ్-కోటి సంగీతం, శ్రీధర రెడ్డి ఛాయ, కె. రామలింగేశ్వరరావు శిల్పం, శివశంకర్ నృత్యాలు, బాలు-శ్రీనివాస్ ప్రొడక్షన్, అనిల్ మల్నాడ్ కూర్పుతో కె. వి. వి. సుబ్బయ్య సమర్పణ.

"తేనెటీగ" రాజేంద్రప్రసాద్, రేఖ




## "ప్రేమఖైదీ"

"ఒక అమ్మాయి, అబ్బాయి ప్రేమ బంధాన్ని ఓ జైలు సూపరింటెండెంట్ కలిపిన తీరు తెలియజెప్పే కథ," అన్నారు ఇ.వి.వి. సత్యనారాయణ. ఈయన దర్శకత్వంలో డి.రామానాయుడు నిర్మించే

సురేష్ ప్రొడక్షన్స్ "ప్రేమఖైదీ" చిత్రంలో ఊర్వశి శారద, హరీష్, శ్రీదుర్గ, విజయ, షర్మిలి, గిరిబాబు, బాబూమోహన్, గోకి నరామారావు, త్యాగరాజు, పి.ఎల్.నారాయణ, రావికొండలరావు, చలపతిరావు, సూర్య, రజిత, పరుచూరి రవీంద్రనాథ్ ఓ ప్రత్యేక పాత్రను డి.రామానాయుడు నిర్వహిస్తున్నారు. పరుచూరి సోదరులు కథ, మాటలు రాశారు. రాజన్- నాగేంద్ర సంగీతం, రవి ఛాయ, అశోక్ శిల్పం, సుందరం-తార నృత్యాలు, విజయన్-హరి సాహసాలు, రమణ ప్రొడక్షన్ నిర్వహిస్తున్నారు.



"దోషి-నిర్దోషి"లో సుమన్, లిజి

## "దోషి-నిర్దోషి"

"శోభన్ బాబు న్యాయానికి ప్రతీకగా, సుమన్ చట్టానికి ప్రతినిధిగా రెండు పవర్‌ఫుల్ కారెక్టర్స్‌లో విజృంభించి నటించారు," అన్నారు డి. వి. కె. రాజు. ఈయన నిర్వహణలో డి. వి. ఎస్. రాజు నిర్మించిన "దోషి- నిర్దోషి" చిత్రంలో లిజి, సుమిత్ర, చలపతిరావు, శుభలేఖ సుధాకర్, సాయికుమార్, కిన్నెర, రాఘవ,

(74 వ పేజీ చూడండి)

సీరియల్

# మోహినీ తాండవం

డా. కొత్త రవీంద్రబాబు

బొంబాయి-పూనా రోడ్డు మీద అద్దెకు తీసుకున్న జావాను నడుపుతూన్న విఠోబా మనసు సంతోష లోకాలలో ఉయ్యాల లూగసాగింది.

"నక్కను తొక్కావురా విఠోబా! నీకంటే అదృష్ట వంతుడులేడు. వెధవ ఛప్రాసీ ఉద్యోగం పోయిందని మళ్ళీ ఉద్యోగం రాలేదనీ దిగులు పడక్కర్లేదు!

యాభై వేలు చేతిలో పడగానే సగం బ్యాంక్‌లో వేస్తాను. మిగిలిన సగం జల్సా చేస్తాను.

ప్రతి రూపాయీ ఎంచి చూసి ఖర్చు పెట్టుకోవాల్సిన ఖర్మ యిక తప్పి పోయింది. కావలసినంత బ్రాందీ రమ్మూ తాగుతాను. కావలసినంత మంది అమ్మాయిలను కాలి దగ్గరకు రప్పించుకుంటాను!

అదృష్టం అంటే విఠోబాది అని జనం అనుకుంటూ పాతిక వేలు ఖర్చయి పోయాక మిగిలిన పాతిక వేలు బ్యాంక్ లోంచి తీస్తాను. ముఠా కూలీలకీ, తోపుడు బళ్ళవాళ్ళకీ, బజార్లంటూ తిరిగి సరకు అమ్ముకునే వాళ్ళకు దీపపు వడ్డీకి యిస్తాను. దీపం వెలిగించే

(గత సంచిక తరువాయి)

సమయానికి నూటికి రోజుకి రూపాయి చొప్పున రోజూ రెండొందల యాభై వస్తాయ్.

అయినా మళ్ళీ పని పడితే మరో యాభై వేలొస్తాయి!"

మైలురాయి గుర్తుచూసుకుని పశ్చిమంగా వున్న మట్టి రోడ్డు మీదకు జావాను తిప్పాడు.

"వెధవ రోడ్డు- అరే విఠోబా- డబ్బులు సంపాదించాక కారు కొనుక్కోందువు గాన్లేరా" అని మనసులో అనుకున్నాడు.

పది మైళ్ళు పశ్చిమ దిశగా వెళ్ళాక అడవి వచ్చింది. అడవి మధ్యన వున్న రోడ్డు మీద పోతూ" ఉ – ఇప్పుడు కాస్త చల్లగా అందమైన ఆడపిల్ల పక్కన నుల్చుని విసనకర్ర విసురు తున్నట్లుంది" అనుకున్నాడు.

కొద్ది దూరాన చిన్న చిన్న జంతువులు అటూ యిటూ పరుగెడు తున్నట్లు అలికిడి వినవచ్చింది.

"ముందు తుపాకి వొకటి కొంటాను- ఇలా అడవిలోకి వచ్చినప్పుడు రెండు కుందేళ్ళనో దుప్పినో షూట్ చేసానంటే రెండు రోజులపాటు లొట్టలు వేస్తూ మాంసం తినవచ్చు."

పోలీస్ జీప్ ఎదురయింది. పోలీస్ యిన్‌స్పెక్టర్ చేయి వూపాడు ఆగమంటూ.

మనసులో దడ పుట్టింది విఠోబాకు. కాని పైకి బింకంగా జావా ఆపి

"ఏమిటి సార్?" అని అడిగాడు.

"ఏం లేదు బాబూ- ఏమిటి యిలా వస్తున్నావ్" సబ్‌యిన్‌స్పెక్టర్ గొంతు నెమ్మదిగా వుండటంతో ధైర్యం వచ్చి అన్నాడు "సరదాగా చిట్టడవిలో తిరుగుదామని వచ్చా".

"ఇటొచ్చావేం బాబూ- ఇదంతా దొంగలమయం ఏమరుపాటుగా వుంటే నీ జేబులో పర్సనీ, మోటార్ సైకిల్‌నీ కొట్టేస్తారు. జాగ్రత్త!"

"అలాగా సార్- నాకు తెలీదే" అమాయకంగా ముఖం పెట్టి అన్నాడు.

"ఈ అడవి ప్రాంతంలో దొంగలు దాక్కుంటున్నారని విని సోదా కని వచ్చాం. నువ్వు అమాయకంగా కనపడుతున్నావు- అందుకనే హెచ్చరిక యిచ్చాం."

"థాంక్స్ సార్. జాగ్రత్తగా వుంటా- పోనీ తిరిగి వెళ్ళి పోయేదా?"

తలూపాడు ఇన్‌స్పెక్టర్.

"ఇంత దూరం వచ్చినందుకు వొక పావు గంట అటూ యిటూ తిరిగి వెళ్ళిపోతా."

"సరే"- జీపు ముందుకు కదిలింది. జీపు వెళ్ళాక పకపక నవ్వాడు విఠోబా.

"ఈ విఠోబా దగ్గర డబ్బు కాజేసేంత గజదొంగ యింకా పుట్టలేదు!" అనుకుంటూ వుషారుగా యీల వేసి

**ఇంతవరకూ సాగిన కథ -4:** ప్రణవనాధ్‌ను మోహిని హత్యచేస్తుంది. మాలా మోటారు కంపెనీలో పనిచేసే తారానాధ్, రుస్తుంజీ ప్రయాణిస్తున్న మొబైక్ పెట్రోల్ టాంక్ విస్ఫోటనకు గురై యిద్దరూ మరణిస్తారు. జస్వంత్, నళినిల ప్రేమ సఫలమవుతుంది. కాని ఉషోదయకు జరిగిన ప్రమాదంలో చిక్కుపడతారు.

ముందుకు సాగాడు.

కొంత దూరం పోయాక జావా ఆపి కారియర్ బాక్స్ నుండి బ్రాందీ సీసా తీసి రెండు గుక్కలు వేసి మళ్ళా ముందుకు వెళ్ళిపోయాడు.

అదే అడవిలో మరో మార్గాన వెళ్తున్న ముని వెస్పా ఆపి చెట్టుకింద కూర్చుని జేబు లోంచి పాలిథీన్ ప్యాకెట్ తీసాడు.

నేల మీద న్యూస్ పేపర్ పరచి దానిమీద పాలిథీన్ సంచి నుండి తీసిన చుట్ట, మందపాటి బాల్‌పాయింట్ పెన్, దూది చుట్ట, థర్మామీటర్, ఇంజక్షన్ సూది వుంచాడు.

బాల్‌పాయింట్ పెన్‌తో మధ్యన వున్న కార్ట్రిడ్జి తీసి పెన్ రెండు చివర్లు నీట్‌గా బ్లేడ్‌తో కోసాడు. చుట్ట మధ్యగా బాల్‌పాయింట్ పెన్ పోనిచ్చాడు.

ఉఫ్ ఉఫ్ మని బలంకొద్దీ వూది పెన్‌లోపల పొగాకు వూది వేసాడు.

చుట్ట కొన లోంచి చూస్తే పెన్ ఆ చివరనుండి యీచివర వరకూ కాళీగా కనపడింది. ఒక వైపు చుట్ట నలిపి పెన్ చివర కనపడకుండా పొగాకుతో కప్పి వేసాడు.

థర్మా మీటర్ పగుల గొట్టి పట్టుకుని ఇంజక్షన్ సూది చేతివేళ్ళ మధ్య పొదవి పట్టుకుని అందులోకి థర్మామీటర్ లోని పాదరసం వొంపాడు.

అగ్గిపుల్ల గీసి, ఆర్పి, కాలిన కొన సూది చివరలోకి నెట్టి పాదరసం లోపల వుండేలా చేసాడు. అగ్గిపుల్ల చుట్టూ దూది చుట్టి సూదిని అగ్గిపుల్లతో సహా చుట్టలోపలకు నెట్టి వేసాడు.

చుట్ట రెండో వేపు నోటిలో వుంచుకుని ముందుకు నడిచాడు పాయిజన్ డార్ట్ తయారు చేసుకున్నానన్న తృప్తితో.

జావా ఆపి స్టాండ్ వేసి నిలబెట్టి పక్కనున్న గుట్ట ఎక్కాడు విఠోబా.

గుట్ట రెండో వైపున వున్న చెరువులోకి చూస్తున్న అతను అడుగుల చప్పుడు విని వెనుదిరిగి చూసాడు.

"ముని....?"

అవునన్నట్లు తలూపాడు ముని.

"మరి..." గుర్తు చూపమన్నట్లు గొణిగాడు విఠోబా.

అయిదు వందల రూపాయల నోట్ల కట్ట ప్యాంట్ జేబులోంచి తీసి చూపాడు ముని.

"అన్నీ అయిదు వందల నోట్లే??"

"అవును సరకు తెచ్చావా?"

"ఉ– కాని"

ముని చొక్కా జేబులోంచి సగానికి చినిగిన రూపాయి నోటు తీసి విఠోబా కిచ్చాడు.



తన జేబులోని మిగిలిన సగం నోటు తీసి రెండు ముక్కలు పక్కన వుంచి సరిపోల్చుకుని తృప్తిగా తలూపి బనియన్ లోపల వున్న వీడియో క్యాసెట్ తీసి చేతిలో పట్టుకున్నాడు విఠోబా.

ముని చెయ్యి జాపాడు.

"ఉహూ– ముందు డబ్బు"

"ఇస్తా లేవోయ్– వీడియోలో అన్నీ వచ్చాయా? ఎలా తీయగలిగావు??"

"చాలా తేలికగా వీడియో తీసాను! ఉషోదయను సోనేమతి వోపెన్ చేసినప్పుడు పాత్రికేయుల బృందం వొకటి ఆయనవెంట వెళ్ళింది. మాకు అక్కడ రాచ మర్యాదలు జరిగాయి. ఫోటోలు తీసుకునేవాళ్ళు తీసుకున్నారు. నేను ఏకంగా ఉషోదయలోని వివిధ భాగాలను వీడియో తీసాను" నవ్వుతూ చెప్పాడు విఠోబా.

"ఎవరూ అనుమానపడలా?"

"ఉ...ఉ"

"సరే ఇంద" నోట్ల కట్ట యిచ్చి క్యాసెట్ తీసుకున్నాడు ముని.

## మోహిని తాండవం

అయిదు వందల రూపాయల నోట్లను తనివిదీరా చేతితో తడుముతూ "గురూ... నీ గురించి ఎంతో విన్నాను. నీకు కనీసం యాభై ఏళ్ళన్నా వుంటా యనుకున్నా. చూస్తే నువ్వు నా వయసువాడివే" స్నేహపూర్వ స్వరంతో ఆరాధన తొంగి చూచింది.

చిన్నగా నవ్వాడు ముని.

"గురూ - ఈసారి యిలాటి పనిబడితే నన్ను పిలిపించు గురూ. వండేవాడు చూడకుండా వుడుకుతున్న అన్నం కుండను కాజేసుకు రాగలను! ముందు ముందు నా సంగతి నీకే తెలుస్తుంది. నేను చెప్పడం ఎందుకు?"

"అలాగే విఠో - నువ్వంతగా చెప్పాలా - అగ్గిపుల్ల వుందా?"

"ఓ" అంటూ జేబులోంచి లైటర్‌తీసి ముని నోట్లోని చుట్ట వెలిగించాడు విఠోబా.

మెడమీద ఏదో చీమ కుట్టినట్లని పించింది. చటుక్కున మెడమీద చేతితో రుద్దుకున్నాడు పుల్లలాటిదేమిటో కింద పడిపోయింది.

'ఏమిటబ్బా' కిందకు చూడబోయాడు. కళ్ళు బూజులు కమ్మాయి. చర్మం మంట బుట్టసాగింది. చేతులు కాళ్ళు చచ్చు బడినట్లనిపించింది.

గుండెలమీద పెద్ద బరువు పెట్టి నట్లయి వూపిరి పీల్చడం కష్టసాధ్య మైంది.

"ఏమిటీ మంటలు" అనుకుంటూ చేతితో వళ్ళు నిమురుకో జూచాడు. చేయి కదులలేదు.

ముని వంక చూచాడు. దళసరి అద్దంలోంచి చూచినట్టు వికృతంగా కనపడ్డాడు ముని.

నోరు తెరచి ఏదో చెప్పబోయాడు విఠోబా మూర్ఛతెరలాంటి తెర వచ్చి నేలమీదపడి చేతులూ కాళ్ళూ విపరీ తంగా కొట్టుకోసాగాడు.

అతని చేతులు పట్టుకోవాలని చూసాడు ముని. వీలు కాలేదు. "వీడి దగ్గర యింత బలం వుందా? పిట్టంత

మనిషి" అనుకున్నాడు మూడు నిముషాలు గిలగిల కొట్టుకుని చచ్చాడు వితోబా

"సరిగా మెడలోని నరలోకి వెళ్ళింది పాదరసం" అనుకుంటూ కింద పడ్డ నోట్లకట్ట తీసి జేబులో వుంచుకుని క్యాసెట్ తీసి రీలు పరీక్షగా చూసాడు

"గుడ్" అగ్గిపుల్ల వెలిగించి రీలు తగలెట్టాడు ముని వితోబా నిర్జీవ శవాన్ని కాలితో బలంగా తన్నాడు

నిముషాలక్రితం విలాస జీవితం గడపాలని కలలు కన్న విఠోబా నిర్జీవ శరీరం దొర్లుకుంటూ వెళ్ళి కింద చెరువులో పడింది

"నీళ్ళల్లో కుళ్ళి చేపలకు ఆహారంగా ఉపయోగపడు" అనుకుంటూ వెనుదిరిగి వచ్చాడు

జావా బండి కనపడింది "ఇది యిక్కడ వుండగూడదు" బండిని నెమ్మదిగా నడిపించుకు వెళ్ళాడు. చెర్వులోకి, బండిని నెట్టబోతుంటే కారేజి బాక్స్‌లో స్కాచ్ విస్కీ సీసా కనపడింది "బంగారంలాంటి మందుసీసా నీటిపా లెందుకు చేయాలి?" సీసా తీసుకొని బండిని చెరువులో తోసేసాడు.

బొంబాయిలోని ఫ్లాట్‌కు తిరిగి వచ్చాకగాని ఫోన్ చేయలేదు ముని

మూడో నంబరు ఆరుసార్లు తిప్పాడు.

"ఎస్"

"రిపోర్ట్ యిద్దామని"

"ఎవరు?"

"ముని జడె ఏడు"

"ఎవరు కావాలి?"

"నరసింహ"

"ఇస్తున్నా" నిముషంలో నరసింహ గొంతు వినపడింది

"ఎస్"

"ముని"

"ఏమయింది?"

"పనిపూర్తయింది"

"క్యాసెట్"

"వివరాలు చూసాక అగ్గెట్టాను"

"గుడ్ సారి అతను?"

"పాపం అకస్మాత్తుగా జబ్బు చేసి పోయాడు"

## సినిమాల్లో 'ఉత్తర'

టి. వి మహాభారత్‌లో నటించిన నటీనటులు కొంతమందికి సినిమాల్లో అవకాశాలు వచ్చాయి అలా అవకాశం వచ్చిన వారిలో ఉత్తర పాత్రధారిణి వర్ష ఉసాంకర్ ఒకరు ఈమె 'షికారి' చిత్రంలో మిథున్ సరసన నటిస్తోంది జాకీష్రాఫ్, రిషి, సన్నీ, సంజయ్‌లతో కూడా యీమె నటిస్తోందట వర్షలాగే ముఖేష్‌ఖన్నాకు, నితీష్‌భరద్వాజ్‌లకు కూడా సినిమా అవకాశాలు వచ్చాయి సుభాష్‌ఘయ్ నిర్మించే సౌదాగర్‌లోం, అనిల్‌శర్మ నిర్మించే తహెల్కాలోను ముఖేష్‌ఖన్నా నటిస్తుండగా, నాచే నాగిన్ గలీగలీలో నితేష్-మీనాక్షిశేషాద్రితో నటిస్తున్నాడు.



"థాంక్స్ పర్ ద ట్రబుల్ హేవ్ ఏ గుడ్ టైం."

"ద ప్లెజర్ యీజ్ మైన్"

చిన్న సినిమా హాలంత ఆ గదిలో చీకటి రాజ్యం చేస్తున్నట్టుంది. దక్షిణపు వేపున వున్న పెద్ద కిటికీలన్నీ మూసివేసి అడ్డంగా కుండీలు పెట్టారు. కుండీలలో రకరకాల ఇన్‌డోర్ ప్లాంట్స్ పెంచారు.

అంత పెద్ద గదిలో దాదాపు ఫర్నిచర్ లేదనే చెప్పాలి గది రెండు మూలలలో రెండు పెద్ద సింహపు బొమ్మ లున్నాయి సజీవకళ వుట్టిపడేట్టు నైపుణ్యంతో శిల్పులు చెక్కిన ఆ బొమ్మలు దగ్గర నుండి చూస్తే కూడా నిజం సింహాలా అన్న భ్రాంతిని కల్గిస్తున్నాయి!

ప్రాచీన కాలంలోని శిల్పుల నైపుణ్యాని కవి మచ్చుతునకలు!

వాతావరణంలోని హెచ్చు తగ్గులు గదిలో ప్రవేశించకుండా తలుపులు మూసివేసి వుంచుతారు.

గది కొకమూల పెద్ద డెస్క్. డెస్క్ వెనక విశాలమైన లెదర్‌ఛైర్‌లో కూర్చుని వున్నాడు కపర్ది

ప్రముఖ రాజకీయ నాయకుడిగానేగాక ప్రముఖ పారిశ్రామికవేత్తగా కూడా అతను దేశ ప్రజలకు తెలుసు

రాజకీయాలనుండి తప్పుకుని వుండక పోయినట్లయితే కపర్ది భారత దేశ ప్రధానమంత్రి అయివుండేవాడని నమ్మే వాళ్ళు దేశంలో చాలామంది వున్నారు

కపర్ది రాజకీయాలనుండి ఎందుకు తప్పుకొన్నాడో తెలిసినవాళ్ళు దేశంలో చాలా తక్కువ మంది వుంటారు వాళ్ళూ ఆ విషయాన్ని బహిరంగ పరచటానికి యిష్టపడరు

కపర్దిమీద భయమో భక్తో దానికి కారణం స్వాతంత్ర్య సమరోద్యమంలో అగ్రగామిగా నిలచి బ్రిటీష్ వాళ్ళను గడగడ లాడించిన ప్రముఖులలో కపర్ది ముఖ్యుడు.

ఆయన సాహస కృత్యాలు చరిత్ర పుటలలో భద్రంగా నిక్షిప్తమై వున్నాయి.

గుండెలో రగులుతున్న వ్రణంలాంటి ఆ జ్ఞాపకాలను మర్చిపోవాలని కపర్ది ప్రయత్నిస్తుంటాడు

గది నాలుగో మూలన ఆరున్నర అడుగుల సోఫా వుంది

# మోహినీతాండవం

నిశ్శబ్దంగా వున్న ఆ గదిలో టిక్‌టిక్‌మని శబ్దం వస్తున్నది. ఆ శబ్దం కపర్ది జేబులో వున్న మినీ జెనరేటర్ అంటి పంప్ నుండి వస్తున్నది.

రెండేళ్ల క్రితం దురదృష్టవశాత్తు కపర్ది కుడివూపిరితిత్తి బ్రాంకియక్టేసిస్ వ్యాధితో దెబ్బతిని తరచు జ్వరం వస్తూ విపరీతంగా కళ్లె రాసాగింది.

"ఈ వయసులో మీకు ఆపరేషన్ చెయ్యడం మంచిది గాదు. కష్టమైనా మందులతో కాలం వెళ్లబుచ్చండి". అన్నాడు డాక్టరు.

"నో– జీవచ్ఛవంలా కాలం వెళ్లబుచ్చడం నాకిష్టం లేదు" బిగ్గరగా అరిచాడు కపర్ది.




"ఈ వయసులో ఆపరేషన్ రిస్క్– అందులో మీకు ఆస్మా వుంది"

"ఆపరేషన్ సక్సెస్ అయిందా మామూలుగా బతుకుతాను– చచ్చానా బాధ అనుభవించకుండా విముక్తి కల్గుతుంది. మీరు ఆపరేషన్ చెయ్యండి" బలవంతం చేసాడు కపర్ది.

ఆపరేషన్ చేసి కుడివూపిరితిత్తి మొత్తం తీసివేసారు. ఆపరేషన్ బల్లమీదే విపరీతంగా ఉబ్బసవ్యాధి ప్రకోపించింది. ట్రకియాటమి ఆపరేషన్ చేసి ఎన్నో మందులు వాడారు రొప్పుతగ్గలేదు.

ట్రకియాటమీ ట్యూబుగుండా ఎడమ వూపిరితిత్తిలోకి ఉబ్బసం తగ్గటానికి మందు స్ప్రే చేసారు.

అప్పుడుగాని రొప్పు తగ్గలేదాయనకు. ఆపరేషన్ సక్సెస్ అయి జ్వరం రావడం తగ్గింది గాని తరచుగా ఉబ్బసం ప్రకోపించి వుక్కిరి బిక్కిరి అయిపోసాగాడు. ఎన్ని మందు బిళ్లలు మింగినా యింజక్షన్లు చేసినా రొప్పు ఆగేది గాదు.

అమెరికా నుండి మినీ జనరేటర్ పంప్ తెప్పించి సన్నని పాలిథీన్ ట్యూబ్ ట్రకియాటమీగుండా ఎడమబ్రాంకస్‌లోకి పంపి ఏరోసాల్‌స్ప్రే అయ్యే ఏర్పాటు చేసాక గాని కపర్దికి రొప్పు ఆగలేదు. జనరేటర్ కిట్‌లోని కంప్యూటర్ కపర్ది వూపిరితిత్తిలోని వాయువును ఎనలైజ్ చేస్తూ ఎప్పటికప్పుడు అవసరమైనంత మందును స్ప్రే చేయడంతో ఆయనకు ఉపశమనం కల్గి మామూలుగా తిరగ గలిగాడు!

ట్రకియాటమీ గాయం మానింది– పాలిథీన్ ట్యూబ్ చుట్టూ చర్మం పూడింది.

"టిక్‌టిక్ మంటూన్న యీ మిషన్‌ను ఎన్నాళ్ళు మోయాలి" అని అడిగాడు కపర్ది హాస్పటల్ నుండి డిస్చార్జి అవబోయే ముందు.

"బహుశ జీవితాంతం" అన్నాడు డాక్టరు.

"ఈ మిషన్ ఆగిపోతేనేనూ..." అర్థోక్తిగా అడిగాడు.

అవునన్నట్లు తలూపుతూ "కాని యీ మిషన్ ఆగదు! బ్యాటరీ అయిపోయే ముందు వార్నింగ్‌బెల్ యిస్తుంది వారం ముందే. అప్పుడు కొత్త బ్యాటరీలు వేయాలి. అంతే" బదులిచ్చారు డాక్టరుగారు.

అందుకే గాలి వెలుతురు తక్కువగా వుండే ప్రశాంత ప్రదేశంలో వుండాలని కోరుకుంటాడు కపర్ది.

"నమస్తే సార్" అంటూ గదిలోకి వచ్చాడు నరసింహ. అరవైఏళ్ళున్నా యింకా చలాకీగా వున్నాడతను.

"రావోయ్ రా" సాదరంగా పిలిచాడు కపర్ది. ఏభై ఏళ్ళుగా కపర్దికి నమ్మినబంటు అతను.

బల్లమీద వున్న పెట్టివంక అనుమానంగా చూస్తూ "మళ్లీ వచ్చిందా?!" అని అడిగాడు నరసింహ.

"ఊ" అంటూ "ఆ విషయం తర్వాత– అదుగో బాటిల్ గ్లాసుల్లోకి వంపి సోడాలు కలుపు" అన్నాడు కపర్ది.

చివాస్ రీగల్ రెండు గ్లాసుల్లోకి వంపి సోడా కలిపి గ్లాస్ కపర్దికిచ్చి మరో గ్లాసే తీసుకున్నాడు నరసింహ.

"కపర్దిని చూస్తే దేముడిని చూచినట్లే వుంటుంది" అని వొక ప్రముఖ రాజకీయ నాయకుడి మాట గుర్తొచ్చి అలాగే నిలబడిపోయాడు.

"ఏమిట్రా అలాగే నిలబడ్డావు. కూర్చుని గ్లాసు కాళీచెయ్యి" గ్లాస్‌లో ద్రవం నెమ్మదిగా తాగుతూ అన్నాడు కపర్ది.

"పాతికేళ్ళనాడు మీరు గవర్నరు పోస్ట్ వొప్పుకుని వుండకపోతే ఏ తిప్పలూ వచ్చేవిగాదు." తల వంచుకుని అన్నాడు నరసింహ.

"ఇసుకలో వొలికిన నూనె తిరిగివస్తుందా? అయిపోయిందానికి బాధపడకూడదు."

"కాని క్షణ క్షణం యీ చిత్తక్షోభ భరించలేకుండా వున్నాను సార్."

"అరే నీ కోసం యీ రోలెక్స్ వాచి తెప్పించా"– మొత్తం బంగారంతో

తయారయిన లక్ష రూపాయల వాచి నరసింహ ముందుకు నెడుతూ అన్నాడు.

వాచీ తీసుకుని సంతృప్తిగా దానివంక చూస్తూ "థాంక్యూ సార్" అన్నాడు నరసింహ.

బల్లమీద పెట్టిలో అలారం మోగింది! బల్లమీదనే వున్న చాకును తీసి పెట్టి మూత తీసాడు కపర్ది.

అమృతభాండం తీసుకుని నృత్యం చేస్తున్న మోహిని బొమ్మ పెట్టిలో గిరగిర తిరుగుతున్నది.

బొమ్మను తీసి దూరంగా గిరాటెట్టాడు కపర్ది. మోహిని ముక్కలయిపోయింది!

కపర్ది పెట్టిలోకి చూసాడు. కాయితం కనపడింది. కాగితంమీద.

ఉషోదయ

చంద్రిక.

వితోబా అని రాసివుంది. కాయితం నరసింహ కిచ్చాడు కపర్ది.

కాయితం చూస్తూ పళ్ళు కొరికి "ఈ మోహిని అంతం చూడమని ప్రణవనాథ్‌కు చెప్పాను సార్" అన్నాడు.

"ఊహు- ఆ పెట్టిలో వున్నది ప్రణవనాధ్ వుంగరం!" అన్నాడు కపర్ది తల అడ్డంగా తిప్పుతూ.

నిర్ఘాంతపోయాడు నరసింహ! అతని నవనాడులూ కృంగిపోయాయి.

సురేష్ ఎంటర్‌ప్రైజెస్ అధినేత అసహనంగా సోఫాలో కదులుతూ పి.ఏ మాధవ్ మీద కేకలు వేయసాగాడు.

"ఇంతమటుకు సుందర్‌లాల్ ఆచూకీ తెలుసుకోలేక పోతిరి. వాడు మనచేత సంపూర్ణ టైల్స్‌లో షేర్స్ కొనిపించి మాయమై పోయాడు.

మీరు లక్ష షేర్లు కొనండి మేనేజింగ్ డైరెక్టరు పదవి మీకుగాని మీరు చెప్పిన వారికి గాని యిస్తానన్నాడు.

చెక్ పంపిన దగ్గర్నుండి మళ్ళీ ముఖం చూపలేదు. ఇంటికి మనిషిని పంపావా?"

"పంపానుసార్- లేడని చెప్పారు."

"ఆఫీసుకు మనిషిని పంపావా?"

"పంపాను సార్- ఆఫీసుకు రాలేదన్నారు".

"ఇంట్లో లేక ఆఫీస్‌లో లేక ఏమయ్యాడు? ఐ డోంట్ లైక్‌దిస్."

తలవంచుకు నిల్చున్నాడు మాధవ్.

★ ★ ★ ★ ★

ఆ సంభాషణను అవతల గదిలో వుండి వింటున్న సురేష్‌బాబు కుమార్తె స్వప్న రేఖ మనసులో ఆలోచన మెదిలింది.

"డాడీ యు డోంట్‌వర్రీ- ఐవిల్ టాకిల్ హిం" మనసులో అనుకుని అక్కడ నుండి కదిలింది.

సుందర్‌లాల్ యింటిగేటు ముందున్న వాచ్‌మన్ "ఎవరమ్మా ఏం కావాలి?" అని అడిగాడు లోపలకు వెళ్ళబోతున్న యువతిని.

"సాబ్ కావాలి."

"ఎందుకు?"

"మా నాన్న ఆయన ఫ్యాక్టరీలో పని చేస్తూ గుండెఆగి చచ్చిపోయాడు ఆర్నెల్ల క్రితం. అప్పట్నుంచీ మా యింట్లో అన్నీ అవస్థలే. తింటానికి తిండి లేదు. అద్దెకట్టలేదని సామాను బయట పారేస్తా నంటున్నాడు ఇంటి యజమాని. సాబ్‌కు చెబితే ఏమయినా సాయం చేస్తారని వచ్చాను."

వాచ్‌మన్‌కు యువతిమీద సానుభూతి కల్గింది.

"సాబ్ లేరు" అన్నాడతను.

"ఎలా? ఈ రోజు డబ్బు కట్టకపోతే ఇంట్లోంచి వెళ్ళగొడతాడు."

సానుభూతిగా తలాడించాడు.

"సార్ సార్- సాబ్ ఎక్కడుంటారో చెప్పరా! మీకు నమస్కారం చేస్తా."

వాచీమన్ మనసు పొరలో జాలికల్గి అటూ ఇటూ చూసి "దూసిరీ మేంసాబ్ యింటి దగ్గరుంటారు." అన్నాడు.

"సార్ అడ్రస్ చెప్పండి వెళ్ళి పాదాల మీద పడతాను."

అటూ ఇటూ చూసి నెమ్మదిగా అడ్రస్ చెప్పాడు వాచ్‌మన్.

★ ★ ★ ★

దూసిరీ మేం సాబ్ యింటిముందు వాచ్‌మన్ లేడు. గేటు తాళంవేసి వుంది. స్వప్నరేఖ పక్క యింటి ఆమెను,

"ఏమ్మా వసంతగా రెక్కడకు వెళ్లారు?" అని మర్యాదగా అడిగింది.

ఆమె రేఖను ఎగాదిగా చూసి కోపంగా లోపలకు వెళ్ళబోయింది.

"అమ్మా - నీకు దణ్ణం పెడతా - సుందర్‌లాల్‌గారు ఇక్కడ వుంటారంటే యిలా వచ్చాను. మా నాన్న ఆయన ఫ్యాక్టరీలో పని చేస్తూ అకస్మాత్తుగా చనిపోయాడు. నలుగురు తమ్ముళ్ళు, ఆరుగురు చెల్లెళ్ళు. అమ్మ నేను దిక్కులేని వాళ్ళం అయాం.



అబల కాదు....!

నేను అబలను కాను సబలను అని నిరూపించుకుందట ఉత్తరప్రదేశ్‌కు చెందిన ఒక 18 ఏళ్ల బాలిక.

ఆ రాష్ట్రంలోని ఒక గ్రామంలో తనకు ఎదురులేదని విర్రవీగుతున్న ఒక బందిపోటు నాయకుడిని ఎదిరించి ఆ బాలిక సన్మానాలు పొందింది. ఆ బందిపోటు ఈ బాలికను చెరచాలని ప్రయత్నించాడట.

ఎంతో మందిని ఎదుర్కొన్న ఆ బందిపోటు ఈ బాలిక ప్రతిఘటనకు ఖంగుతిన్నాడు. ఆమె అరుపులు, హాహాకారాలు గ్రామస్థులను మేల్కొలిపాయట. అంతే...పాలోమంటూ వచ్చేశారు ఆ బాలికను కాపాడేందుకు. రావటమే తడవు...అతని మీదపడి నరికివేశారు.

ఈ బందిపోటుకు అనేక హత్యలతోను, బందిపోటు దొంగతనాలతోను సంబంధం వుందట. ఎవ్వరికీ అంతు చిక్కని ఈ బందిపోటును తన ప్రతిఘటనతో ఎదుర్కొన్న ఆ బాలికను 5 వేల రూపాయల నగదుతో సన్మానించారు. అంతే కాదు ఆమె ధైర్య సాహసాలు తమ శాఖకు బాగా పనికి వస్తాయని పోలీసు శాఖ వారు ఉద్యోగం కూడా యిచ్చారట. ఈ బాలిక ధైర్యం మెచ్చదగినదే మరి!

# పాఠకులే సెక్స్ కథలు కావాలంటున్నారా?

ఇది కేవలం పాఠకులపై వేసిన ఆరోపణ మాత్రమే ఈనాడు పత్రికలలో సెక్స్ కథల ప్రభంజనం ఎక్కువైపోయింది. ఇదేమని ప్రశ్నించగా పాఠకుల అభిరుచి మేరకే తాము సెక్స్ కథలను రచిస్తున్నామని పాఠకులపైకే ఆరోపణను నెట్టివేసి

## ఆరోపణే....!

రచయితలు తమను తాము సమర్థించుకొనుచున్నారు. పాఠకులు తమంతట తాముగా సెక్సు కథలను కోరరు. కాని పుస్తకములలో కన్పిస్తే చదువకుండా ఉండలేరు. ఈ బలహీనతను ఆసరాగా తీసుకుని రచయితలు పాఠకుల పైకే ఈ ఆరోపణను



నెట్టివేయడం అన్యాయం. సెక్స్ కథలు లేని పుస్తకములను కూడా పాఠకులాదరిస్తున్నారు మితి మీరిన సెక్స్ నైతిక పతనానికి దారి తీస్తుంది కనుక శృంగారరసమును తగు మోతాదు లోనే పోషించాలి

–పరుచూరి విజయకృష్ణ,
(నరసరావుపేట)

## పాఠకుల బలహీనత

'పాఠకులే సెక్స్ కథలు కావాలంటున్నారా?' అని అడిగితే, 'అవును నిజంగా పాఠకులే సెక్స్ కథలు కావాలంటున్నారు అని చెపుతాను ఎందుకంటే నూటికి 75 మంది పాఠకులు సెక్స్ కథలను, మిగిలిన 25 శాతం మంది మామూలు కథలను చదువుతున్నారు 75 శాతం మంది 'సెక్స్' కథలకు ఇచ్చినంత ప్రాముఖ్యాన్ని మిగిలిన కథలకు ఇవ్వడం లేదు సెక్స్ విజ్ఞానాన్ని ఎక్కువగా సంపాదిస్తున్నారని అనడంలో అతిశయోక్తి లేదు

ఒక రచయితకు నల్గురిలో పేరు రావాలంటే ఆ రచయిత ఎక్కువ మంది



పాఠకులు ఎలాంటి కథలను చదువుతారో అలాంటి కథలను వ్రాసి తన 'ఇమేజ్'ని పెంచుకొంటున్నాడు. ఇలా జరగడానికి కేవలం పాఠకుల బలహీనతే కారణం.

–దాశరెడ్డి శ్రీనివాసరావు,
(విశాఖపట్నం)

## హద్దులో వుంటేనే....

జీవితంలో సెక్స్ ఒక భాగం మాత్రమే. అలాగే అన్ని కథల మాదిరిగానే సెక్స్ కథలు కూడా పాఠకులు చదువుతారు కాని కేవలం సెక్స్ కథలే చదవటం, సెక్స్ కథలే మొత్తం పత్రికల నిండా వుండాలని ఎవ్వరూ కోరరు కేవలం ఆ కథలు మాత్రమే చదువుతారనుకుంటే అలాంటి కథలు ప్రచురించని అనేక



పత్రికలు మరెలా "దిగ్విజయంగా" పాఠకుల అభిమానాన్ని పొందుతున్నాయి?

'సెక్స్' అంటేనే ప్రతి ఒక్కరిలో ఓ 'చెడు' అభిప్రాయముంది. ఆ చెడు భావాన్ని పోగొట్టుకుంటే ఆ కథల్ని కూడా ఎంజాయ్ చేయవచ్చు. అలాని శృతి మించితే అపశృతులు పలకొచ్చు కాబట్టి ఏదైనా హద్దులో వుంటేనే ముద్దు

–జి. పి. రామచంద్రుడు,(కర్నూలు)

# మోహినీతాండవం

సేట్‌జీ ఏదయినా వారి చూస్తారని ఫ్యాక్టరీకి, యింటికి ఎన్నిమార్లు తిరిగినా దర్శనం కాలేదు

ఎవరో పుణ్యాత్ముడు యీ అడ్రస్ యిచ్చాడు" అంది

రేఖమీద పక్కింటామెకు జాలి కల్గింది

"చూడమ్మాయి - పక్కింటామెను గురించి ఏం చెప్పమంటావు సంసారుల యిళ్ళ మధ్య సాని పాప వచ్చి పడింది మీ సేట్‌తో కలసి ఎక్కడికో ఉడాయించిందని మా పనిమనిషి చెప్పింది నేనయితే చూడలేదనుకో' మా పనిమనిషి చెప్పింది నాకు ఆ యింటి వంక చూడ్డానికే అసహ్యం.

"సాబ్ ఎక్కడికి వెళ్లారో తెలిస్తే వెళ్లి కాళ్ళమీద పడతా"

"ఏమోనమ్మా నాకు తెలియదు."

భారంగా నిట్టూరుస్తూ అక్కడనుంచి కదిలింది రేఖ.

"చూడమ్మాయ్" ఎదురుగా ప్రొవిజన్ స్టోర్స్ అతను పిలిస్తే వెళ్ళింది.

"సుందర్‌లాల్ కోసమా వచ్చావు?!"

"అవున్సార్"

ఆ అమ్మాయిసార్ అన్నదని మనసులో శనగగింజలా ఉబ్బిపోయి "తేనెటీగ పువ్వుమీద తప్ప మరెక్కడా వుండదు! సుందర్‌లాల్ ఎక్కడా వుండడు వసంత దగ్గర వుంటాడు

"మేం సాబ్ ఎక్కడుంటారో?

"ఆ నీతిలేని మనిషిని మేం సాబ్ అనకు"

బిక్కముఖం పెట్టింది రేఖ

"వసంత ఎక్కడవున్నా సాయంత్రం నాలుగయ్యేసరికి టంచనుగా సౌందర్య బ్యూటీక్లినిక్‌కు వస్తుంది ఆమె నడిగితే సుందరలాల్ ఎక్కడవుందీ చెబుతుంది"

"నమస్కారం సార్ - వస్తాన్సార్ మీ మేలు మరువను"

రేఖ సాయంత్రం నాలుగు గంటలకు ట్రిమ్‌గా డ్రెసప్పయి సౌందర్య బ్యూటీ క్లినిక్ దగ్గరకు వెళ్ళింది

(ఇంకా ఉంది)

# న్యాయచట్టం ప్రశ్నలు-జవాబులు



అడ్వొకేట్: బి.భాస్కరరావు ఎం.ఎ.,ఎల్.ఎల్.బి.

**టి. శ్రీహరిరావు, టి. సుందూరు (గుంటూరు జిల్లా)**

ప్రశ్న: నేను ఏ. ఎస్. ఎం.గా పని చేశాను. నన్ను కొన్ని అభియోగముల మీద ముందు ఉద్యోగం నుంచి తొలగించి వేశారు. ఆ తర్వాత కంపల్సరీ రిటైర్‌మెంట్ చేశారు. నేను పేదవాడిని, పిల్లలు గలవాడిని. నాకు పది సంవత్సరాల సర్వీసు వున్నది. త్రాగుబోతులను చిన్న శిక్షలతో వదిలివేశారు. నేను లాయర్ల సలహా అడిగాను. వారు ఫలితము లేదు అన్నారు. నేను పి. ఎఫ్., గ్రాట్యుటీ, పెన్షన్ తీసుకుంటే ట్రిబ్యూనల్‌లో గెలువగలనా? సలహాఇవ్వవలెను.

జవాబు: మీరు చేసిన నేరమేమిటో వివరించలేదు. మీకు 10 సంవత్సరాల సర్వీసు పూర్తి అయినచో గ్రాట్యుయిటీ, పెన్షన్ వస్తుంది. గ్రాట్యుయిటీ, పెన్షన్ తీసికొనకుండా సెంట్రల్ ఎడ్మినిస్ట్రేటివ్ ట్రిబ్యూనల్‌లో పిటిషన్ పెట్టండి. ఆహుజా కేసులో కంపల్సరీ రిటైర్‌మెంట్ కొట్టివేస్తూ 1987లో ముగ్గురు జడ్జీలు గల సుప్రీం కోర్టు ధర్మాసనం తీర్పు చెప్పింది. ఆ తీర్పు వివరాలు:

ఆహుజా సెంట్రల్ పబ్లిక్ వర్క్స్ డిపార్టుమెంట్‌లో ఇంజనీరుగా పని చేస్తున్నాడు అతని పుట్టిన తేదీ 10-2-1922, అతడు 22-10-1947లో సెక్షన్ ఆఫీసర్‌గా ఉద్యోగంలో చేరాడు 22-5-1954 నుంచి అసిస్టెంట్ ఇంజనీర్‌గా పని చేస్తున్నాడు 3-7-1961లో ఎగ్జిక్యూటివ్ ఇంజనీర్‌గా ప్రమోషన్ ఇచ్చారు కాని 4-9-1965లో ఆహుజాను క్రింది పోస్టునకు రివర్టు చేసి కంపల్సరీ రిటైర్‌మెంట్ చేశారు 10-2-1972 నుంచి ఆహుజాకు 50 సంవత్సరాలు నిండినందున 3-8-76న నిర్బంధంగా పదవీ విరమణ చేస్తూ ఇంజనీర్– ఇన్– ఛీఫ్ ఉత్తర్వులు జారీ చేశారు. 3-8-76 తేదీన ఆహుజాకు 54 సంవత్సరాలు నిండినవి.1980లో సుప్రీం కోర్టు తహిలియాని కేసులో ఇచ్చిన తీర్పులో ఒక ఉద్యోగి అఫిసియేట్‌గా ఉద్యోగం చేస్తున్నందు వలన అతనిని నిర్బంధంగా పదవీ విరమణ చెయ్యించడం ఫండమెంటల్ రూలు 56 (జె) (1)కు విరుద్ధమని ఉత్తర్వులు కొట్టివేసింది. కాని ఆ తీర్పు సరి అయినది కాదు అని సుప్రీం కోర్టు పేర్కొంది. ఫండమెంటల్ రూలు 56 (జె) (1) సబ్‌స్టాంటివ్, టెంపరరీ మరియు అఫీసియేటింగ్ క్లాస్ 1, 2 ఉద్యోగులకు కూడా వర్తిస్తుంది అని సుప్రీంకోర్టు అభిప్రాయ పడింది. సబ్‌క్లాజ్ (2) ప్రకారం 55 సంవత్సరాలు దాటిన ఉద్యోగులను నిర్బంధంగా పదవీ విరమణ చేయించవచ్చును. కాబట్టి ఆహుజా పెట్టుకున్న రిట్ పిటీషన్‌ను డిస్మిస్ చెయ్యవలసి ఉన్నది. కాని ఢిల్లీ హైకోర్టు తహిలియాని కేసును అనుసరించి కొందరు ఉద్యోగులకు కంపల్సరీ రిటైర్‌మెంట్ చేస్తూ ఇచ్చిన ఉత్తర్వులు కొట్టివేసింది ఈ తీర్పును భారత ప్రభుత్వం కూడా ఆమోదించింది. కనుక ఆహుజాను నిర్బంధంగా పదవీ విరమణ చేసిన ఉత్తర్వులు కొట్టివేస్తూ 1987లో ముగ్గురు జడ్జీలు గల సుప్రీం కోర్టు ధర్మాసనం తీర్పు చెప్పింది. ఇంకా మరి కొందరు ఉద్యోగులు పెట్టుకున్న రిట్ పిటిషన్‌లు అనుమతిస్తూ తీర్పు చెప్పింది.

కాబట్టి మీరు కూడా కంపల్సరీ రిటైర్‌మెంట్ ఉత్తర్వులు ఫండమెంటల్ రూలునకు విరుద్ధమని సెంట్రల్ ఎడ్మినిస్ట్రేటివ్ ట్రిబ్యూనల్‌లో పిటిషన్ పెట్టండి.

**టి. సత్యనారాయణ, తెనాలి**

ప్రశ్న: మా నాయనమ్మకు ఇద్దరు కొడుకులు. ఇంత వరకు ఆస్తి పంచుకోలేదు. చిన్నాయనకు పిల్లలు లేరు. నాయనమ్మ చనిపోతూ ఆస్తిని మూడు వాటాలుగా లెక్కకట్టి ఆమె వాటా మనుమలైన మా ఇద్దరు అన్నదమ్ములకు వ్రాసినది. రిజిస్ట్రేషన్ చెయ్యలేదు. ఈ వీలునామా చెల్లుతుందా? తెలుప వలెను.

జవాబు: ఆమె ఆస్తిని మనుమలకు వ్రాసినది గనుక చెల్లుతుంది. వీలునామా కూడా ఇప్పుడు రిజిస్ట్రేషన్ చెయ్యించండి.

○

ఆంధ్రసచిత్ర వారపత్రిక

న్యాయ చట్టం-ప్రశ్నలు జవాబులు

ప్రశ్న: ..........................................................

పేరు: ..........................................................

పూర్తి చిరునామా: ..........................................................

..........................................................

# ప్రతిజ్ఞ

ఇ. గోప్రాజ్



ఇంట్లోకి అడుగు పెట్టిన భైరవమూర్తి కళ్ళు... టేబుల్‌పై ముద్దులొలికే చిన్న సైజు ప్రయిజ్ కప్పుని దాని క్రింద ఓ... సర్టిఫికెట్ని గమనించాయ్.

తండ్రి రాక కోసం ఎదురు చూస్తున్న పధ్నాలుగేళ్ల చతుర...

"...నాన్నగారూ...! నాకు 'డిబేట్'లో ఫస్ట్ ప్రయిజ్ వచ్చింది తెలుసా..." అంది.

చతుర ముఖంలో సంతోషపు వెల్లువ.

"...ఏ సబ్జక్ట్ మీదమ్మా...?" అనడిగాడు భైరవమూర్తి ఆనందంగా కప్పుని సర్టిఫికెట్ని చేతులోకి తీసుకుంటూ...

"...సోషల్ అక్టివిటీస్ ఇన్ పబ్లిక్ లైఫ్..." అంది చతుర.

"...వెరీ నైస్.." అంటూ కూతురి మేను నిమిరాడు ఆప్యాయంగా భైరవమూర్తి. అయిన వాళ్ళు పొగిడితే ఆయుష్షు తగ్గుతుందని లోలోపలే గర్వపడ్డాడు. తెలివి తేటల్లో తన పోలికొచ్చినా అదృష్టంలో మాత్రం వద్దని మనసులోనే దీవించాడు కూతుర్ని మనస్ఫూర్తిగా భైరవమూర్తి.

"చతురా..! అన్నయేదమ్మా...?"

"...నోట్సేదో తెచ్చుకుంటానని. ఫ్రెండింటికి వెళ్లాడు..." అంది చతుర.

* * * *

...రాత్రి 10 గం.లు దాటుతోంది. ఉన్నవి రెండే గదులు.

"... పిల్లలు పడుకున్నారా జానకీ...?" అనడిగాడు భైరవమూర్తి. ఆమె నుంచి వచ్చిన సమాధానం వింటూ భార్యని దగ్గరకి తీసుకున్నాడు భైరవమూర్తి.

"... ఏవండీ..." అంది జానకి.

ఏమిటన్నట్లు చూసాడు భైరవ మూర్తి.

"... అబ్బే ఏం లేదండి..! ఈరోజు మధ్యాహ్నం వరండాలో పక్కింటి పిన్నిగారూ... నేను ఏదో పిచ్చాపాటీ మాట్లాడుకుంటున్నాం. ఇంతలో చతుర ఎవరో తరుముకొస్తున్నట్లు వడివడిగా ఇంటి కొచ్చిందండి. వచ్చేటప్పుడు ఓ అమ్మాయిని కూడా వెంటబెట్టుకొచ్చింది. నేనైతే చాలా ఆందోళన పడ్డాను. కాళ్ళల్లో వణుకు తెలుసా..." అంది జానకి మధ్యాహ్నపు సంఘటన్ని మననం చేసుకుంటూ.

". . ఏం..? చతుర ఈ రోజు మధ్యాహ్నం స్కూల్‌కి కారియర్ పట్టుకెళ్లలేదా...?"

"... దాని ముఖం... అది కాదండి స్కూల్లో టాయిలెట్స్ క్లీన్‌గా ఉండటం లేదట. అందుకని అంత దూరంనించి నడిచొచ్చింది..."

"...అది సరే... ఇంతకీ నీ కాళ్ళకు వణుకెందుకట...?"

"...ఎందుకంటా రేమిటండీ..?ఎదుగుతున్న ఆడపిల్ల, పైగా అర్థాంతరంగా ఎవర్నో వెంటబెట్టుకొచ్చింది. అలా స్కూలు మధ్యలో వస్తే ఆ వయసులోని పిల్లని చూసి ఏ తల్లి మాత్రం ఏం అనుకుంటుంది...!!

ఏవో మాటల మీద మనం అనుకున్నదంతా పిన్నిగారికి చెప్పేసాను. మనింట్లో అటువంటి విశేషం జరిగితే గప్‌చిప్‌గా ఊరుకుంటామని... ఏవండోయ్ వింటున్నారా...."

జానకి ఒడిలో ఉన్న భైరవమూర్తి... తలని "ఆ...ఆ" అంటూ ఆడించాడు.

"...ఒక్కగానొక్క పిల్ల... కనీసం చాపైనా వేసి నాలుగిళ్ళకయినా పప్పు అన్నం పెట్టరా...! చుట్టుపక్కలందరూ అదే మాట. అయినా మన కష్టాలు వాళ్ళకేం తెలుసు ఏవంటారు...?

ఏమంటాడు భైరవమూర్తి మౌనంగా

ఆమె చెప్పింది వింటున్నాడు.

ఇంకో విషయం రాఘవకి బొటానికల్ టూర్ డబ్బు కట్టడానికి రేపే లాస్ట్ డేటట. మీకు వీలవుతుందా...?" అంటూ చూసింది జానకి భైరవమూర్తి వంక.

జానక్కి తెలుసు. పుస్తకాలకి, ఫీజులు కట్టడానికే అంతంత మాత్రంగా ఉన్న భర్త పరిస్థితి.

వేడి నిట్టూర్పులు ఆ గది నిండా ఆవరించాయి.

★ ★ ★ ★

భైరవమూర్తి ఎకడమిక్ క్వాలిఫికేషన్ యం. ఎ. బి. ఎల్. అయినా చేసేది మాత్రం ఓ కంపెనీలో గుమాస్తా. పూర్వపు రోజుల్లో భైరవమూర్తి తండ్రి పేరు మోసిన క్రిమినల్ లాయర్. సంపాదించింది గంపెడయినా కాలచక్రంలో కొడుక్కి న్యాయంగా మిగిలింది ఓ నల్లబోర్డు మీద భైరవమూర్తి యమ్. ఎ. బి. ఎల్ అన్న తెల్లటి అక్షరాలు.

కొన్నాళ్ళు ఆ... బోర్డు వీధి గేటుకి వ్రేలాడి ఎండకు ఎండుతూ, వానకి తడుస్తూ... ఆ తర్వాత భైరవమూర్తి వ్యక్తిత్వానికి సరిపోని ఆ లా బోర్డు ఆఖరికి బూజుపట్టి అటకెక్కింది. 'లైఫ్ ఫర్‌యెగ్జిస్టెన్స్'లా ఉంది భైరవమూర్తి బ్రతుకు.

★ ★ ★ ★

ఆ... మర్నాటి ఉదయం జానకి....

"... ఏవండీ..! మరచే పోయాను ఆ సూపరింటెండెంట్ గారమ్మాయి పెద్ద మనిషయిందట..! పేరంటానికి, భోజనానికి పిలిచారు. వట్టి చేతులతో వెళితే ఏం బావుంటుంది..." అంటూ మట్టి గాజుల చేతిని చాచింది ఓ పది రూపాయ లిమ్మంటూ.

ఆ మాటలకి భుజాలు తడుముకున్న భైరవమూర్తి జేబులు మాత్రం తడుముకో లేదు. అవి నెలాఖరు రోజులు అతని జేబులో ఎంతుంటుందో అతనికి తెలుసు.

భర్తని చూసి సంగతి గ్రహించి....

"....పరవాలేదు లెండి..! ఆ మధ్య ఎవరో ఇచ్చిన స్టీలు ప్లేటుంది అదృష్టంగా దాని మీద ఇచ్చిన వారి పేరు లేదు. అదిస్తాన్లెండి..." అంది జానకి.

ఆ మాటలకి భైరవమూర్తి నవ్వుకున్నాడు ఒక్కక్షణం. నిజమే. . ఆ ప్లేటు మీద ఇచ్చిన వారి పేరు లేకపోవడం కూడా ఒక అదృష్టమే...

ఆ కాస్సేపటికి... ఆఫీసుకి బయలుదేరుతున్న భైరవమూర్తితో ....

"నాన్నగారూ..." అని పిలిచాడు రాఘవ.

"ఏమిటన్నట్టు' చూసాడు భైరవమూర్తి. భైరవమూర్తి అంతరంగంలో కొడుకు టూర్‌కి డబ్బడిగితే ఎలా బీదరుపులు అరవాలా అని ఆలోచిస్తున్నాడు.

"... ఈసారి టూర్ వెళ్ళను నాన్నగారూ....! వచ్చే సంవత్సరం నార్త్ ఇండియా తీసుకు వెళతారట. అప్పుడు వెళతాను.."

ఆ మాటలు రాఘవ నోటి వెంట నమ్రతగా వచ్చాయి.

భైరవమూర్తి కళ్ళు చురుగ్గా చూసాయి కొడుకుని.

భైరవమూర్తి రోడ్డు వారగా మౌనంగా నడుస్తున్నాడు. అతని మనసు నిండా గజి, బిజి ఆలోచన్లు కందిరీగల్లా రొద చేస్తున్నాయి. తండ్రి అన్యాయార్జితం తన్ని శాపగ్రస్తుణ్ణి చేసిందా....? అతని దృష్టి కొడుకు మీదకి మళ్ళింది. ఎదిగే వయసులో కోరిక లెక్కువ. అయినా వాడడిగింది 'బొటానికల్' టూర్‌కి. అది వాడి ఎడ్యుకేషన్‌కి అవసరం కూడా. క్రిందటి సంవత్సరం కూడా టూర్ కని డబ్బడిగితే వచ్చే సంవత్సరం వెళుదువుగాని అని దాటించేసాడు.

గాంధీగారి నడకలా నడిచే భైరవమూర్తి కాళ్ళు ఆ రోజు నత్త నడక నడిచాయ్. ఫలితం గంట లేటు ఆఫీసు చేరడానికి.

అకౌంట్స్ ఫైలు తీసాడు భైరవమూర్తి. 'కాలిక్యులేటర్' అవసరం లేని అతని మెదడుకి ఆరోజు 'కాలిక్యులేటర్' ఉపయోగించినా అంకెలన్నీ తలక్రిందులవుతున్నాయ్.

చేసిన తప్పులకి ఆఫీసర్‌చే తిట్లు తిని,



తప్పక ఆ ఆఫీసర్నే 'నాట్ ఫీలింగ్ వెల్' అని పర్మిషన్ అడిగి మండుటెండలో ఇంటి కొచ్చాడు భైరవమూర్తి.

పెట్టెడుగున, పదిలంగా దాచిన పెళ్ళినాటి పట్టు చీరని సింగారించుకొని సమర్త భోజనానికి బయలుదేరుతున్న భైరవమూర్తి భార్య, భర్త రాకకి ఒకింత అచ్చెరువొంది గేటుకి తాళం వేయబోతున్నది ఆగి లోపలికి వచ్చింది.

"... ఏవండీ..! వచ్చేసారేం...? ఏం అలా ఉన్నారు...?" అంటూ భైరవమూర్తి నుదుర్ని పట్టుకు చూసింది జానకి.

"ఏం లేదు...! కొంచెం తల నెప్పిగా ఉంటే పర్మిషన్ పెట్టి వచ్చాను అంతే..." అన్నాడు భైరవమూర్తి.

చీర మార్చుకో బోతున్న భార్యని చూసి–

"...ఏం ఫరవాలేదు. నేను రెస్ట్ తీసుకుంటాను. ఎక్కడికో వెళుతున్నట్లున్నావు వెళ్ళు..." అన్నాడు భైరవమూర్తి.

సతమత మవుతున్న మనసుకి విశ్రాంతిగా నిద్రలో కొరిగాడు భైరవమూర్తి.

* * * * * * * *

"....ఏవండీ...! ఆ సూపరింటిండెంట్ గారమ్మాయి సమర్తకి ఎంత అట్టహాసం చేసారండి. ఆ ... నగలతో, సింగారాలతో ఆ పిల్లకి పెళ్ళి కళ ఉట్టిపడిందండి. ఓ.... హో... ఏమి ఆర్భాటాలు షామియానాలా.. భజంత్రీలా.. వీడి యోలా... నవకాయ పిండి వంటలతో భోజనాలా.. దేనికైనా పెట్టి పుట్టాలండి. పెట్టి పుట్టాలన్న మాటని మరింత గట్టిగా వత్తి పలుకుతూ... జానకి.

భార్య మాటలకి ఉలిక్కి పడ్డాడు భైరవమూర్తి.

"... మనిషన్న తర్వాత సరదా లుండాలండి. ఆ పిల్ల నిజంగా అదృష్టవంతురాలు. అటువంటి తండ్రి

## ప్రతిజ్ఞ

కూతురయినందుకు..."

"... అంటే నీ ఉద్దేశం...?" అనడిగాడు భైరవమూర్తి.

"–విడమర్చి చెప్పాలా... ఎదుగుతున్న కూతురుంది. దానికి చిన్న మెత్తు గొలుసు చేయిద్దాం. రేపో శుభ కార్యం దగ్గిర కొస్తోంది, దాని గురించాలోచిద్దాం. అన్న చింత మీకేకోశాన్నయినా ఉందా...?

మీ రెన్నయినా చెప్పండి. మనకెప్పుడూ ఉండే దరిద్రమే... ఇదుగో... ఇప్పుడే చెబుతున్నాను. అప్పు చేస్తారో... తల తాకట్టు బెడతారో ఆ... అచ్చట జరగ వలసిందే. ముసలి కాలానికి ముచ్చట్లులా ఎప్పుడో ఏదో చేద్దాం అంటే కాలం ఆగదు. అది పెద్దయిం తర్వాత నా తల్లి తండ్రి నాకే ముచ్చటా జరిపించ లేదంటే ఎంత సిగ్గండీ...!"

అంటూ భైరవమూర్తిని ఉతికి ఆరేస్తోంది జానకి.

జానకి మాటలకి–

"... ఉష్... గట్టిగా అరవకు పిల్లలు వింటారు..." అన్నాడు భైరవమూర్తి.

"... గట్టిగా అరిస్తేనే వినిపించని మీకు సున్నితంగా చెబితే అర్థం అవుతుందా...!"

"... సర్లే అలాగే చేద్దాం..."

"... చేద్దాం అంటే కాదు మాటివ్వాలి..."

"అలాగే...!"

"... ఎలా చూసినా మన ఊర్లో దగ్గర బంధువులు వందమందుంటారు. మా అక్కలు బావలు మీ దగ్గర వాళ్ళు కలసి ఓ యాభై వేసుకోండి...."

భైరవమూర్తి గుండెల్లో విమానాలు స్వైర విహారం చేస్తున్నాయ్.

"... నువ్వు చెప్పిందాన్ని బట్టి చూస్తే కనీసం ఓ... ఐదు వేలు పై చిలుకే అయ్యేలా ఉంది. ఇంత సొమ్ము ఎక్కడ్నుంచి తేగలన్ను...?"

"... అవునుమరి... మీ అక్క చెల్లెళ్ళకయితే ఎక్కడలేని సొమ్మూ ఉరుక్కుంటూ వస్తుంది. సొంత కూతురి దగ్గర కొచ్చేటప్పటికి ఎక్కడలేని కూడికలు, 'సాకులు...!" అంటూ రెచ్చగొట్టింది జానకి.

భైరవమూర్తిలో సహనం నీరసించింది.

"... జానకీ..." అంటూ అరిచాడు దిక్కులు పిక్కటిల్లేలా..

ఫంక్షన్ నుంచి అప్పుడే ఇంట్లో కడుగు పెట్టిన జానకి భర్తని చూసి...

"... ఏమిటండీ...! అలా అరుస్తున్నారు. ఏమైనా పాడు కలొచ్చిందా..." అనడిగింది భైరవమూర్తి దగ్గరగా వస్తూ....

"... ఓ...హో... ఇది కలా..." అంటూ కళ్ళు నులుము కున్నాడు భైరవమూర్తి. అతని ముఖంలో రిలీఫ్ కొట్టొచ్చినట్లు కనిపిస్తోంది.

* * * * *

అప్పుడు సమయం రాత్రి 8 గం.లు అవుతోంది.

వరండాలో కుర్చీలు వేసుకొని కూర్చున్నారు భైరవమూర్తి, జానకి.

భైరవమూర్తి శూన్యంలోకి చూస్తున్నాడు. మధ్యాహ్నం అతను కన్న కల కళ్ళలో కరడు గట్టి అలాగే ఉండి పోయింది.

"... ఏమిటండీ...! అలా ఉన్నారు...? ఏమిటలా దీర్ఘంగా ఆలోచిస్తున్నారు...?"

"... ఏంలేదు జానకీ...! నాకూ కోరికలున్నాయ్. ఎదిగిన ఆడపిల్లకి చిన్న మెత్తు గొలుసయినా చేయించలేక పోతున్నాను..."



"  ఇప్పుడవన్నీ ఎందుకండి... ఎవరేమన్నారని "

"ఎవరో ఏదో అంటారని కాదు జానకీ ! రేప్రొద్దుట దీనికేమైనా జరిగి, మనం ఏ పంక్షనూ చెయ్యలేక పోతే తోటి పిల్లల్తో పోల్చుకొని అమ్మాయి బాధపడదూ ! ఏ అచ్చటా ముచ్చటా తీర్చలేదని ఆరోపించదూ !"

" ఏమిటండీ ! అన్నీ తెలిసిన మీరూ ఇలా మాట్లాడు తున్నారు ఈ రోజు ఏం ఫరవాలేదు లెండి, దానికి నేను నచ్చ చెబుతాను రోజు లెప్పుడూ ఒకలాగే ఉండవ్ మీరీ విషయంలో వర్రి కాకండి ' అంది జానకి అనునయంగా !

మధ్యాహ్నం కలలోని జానక్కి ఈ జానక్కి ఎంత వ్యత్యాసం

" జానకీ ! నిజంగా నీలాంటి అనుకూలవతైన భార్య దొరకడం ఆ బగవంతుడు ఇచ్చిన వరం నాకు

ఆ మాటలు భైరవమూర్తి నోటివెంట గాద్గథికంగా వచ్చాయి

ఆ కాస్సేపటికి లివింగ్ రూమ్‌లో చదువుకుంటున్న పిల్లల గదిలోంచి మాటలు వినిపిస్తున్నాయి చతుర ఏదో ఆవేశంగా గట్టిగా మాట్లాడుతోంది భైరవమూర్తి చెవులకి ఆ సంభాషణ ఆకర్షణీయంగా అనిపించి మరింత దగ్గరగా వినాలన్న కుతూహలంతో కూతురున్న గదిలోకి నడిచాడు ఆ వెనుకగా జానకి

కిటికీ కర్టెన్ని పక్కకి తొలగించి చూసిన చతుర తల్లి తండ్రి రాకన్ని గమనించి తన కంఠస్వరాన్ని మరింత తీవ్రత చేసింది

"ఇంకా వివరంగా చెప్పాలంటె ఈ సమర్త అన్న పరిస్థితి ప్రతి స్త్రీకి ఒక నేచర్ అదో గొప్ప విశేషంగా చూస్తూ దాన్ని ఎన్‌లార్జ్ చేసి సంప్రదాయం అనే చచ్చు పేరుతో ఉన్నా లేకపోయినా అప్పుకోసం అంగలార్చి ఆడంబరాలు చేస్తున్న మనవాళ్ళని చూసి మనం సిగ్గుతో తలలు వంచాలి

ఆ తరువాత పెళ్ళి పెళ్ళి అన్నది ఆడదానికెంత అవసరమో మగవాడికీ అంతే దానికోసం ఈ పెద్దలు అడుగులకి మడుగులొత్తడాలూ కాళ్ళు కడిగి కన్యాదానాలు కట్న కానుకలూ అలకలు తీర్చడాలూ ఎందుకు ? ఒళ్ళు ఇల్లు గుల్ల చేసుకోవడం ఎందుకు ?

అసలు ప్రతీ ఆడదీ కట్నం ఇచ్చే ప్రసక్తయితే పెళ్ళి చేసుకోనని భీష్మిస్తే ఈ మగజాతి అపరభీష్ము లవుతారా ? నెవర్

మనల్ని మనం కించపరుచుకొనే రోజులు పోయాయి ఎవరో వస్తారు వారే గంటకడతారు అన్న బావనకి తిలోదకా లివ్వాలి ! ఏదో విప్లవం ఎక్కడినుంచో పుట్టుకురాకూడదు ఒక లక్ష్యసాధన కోసం మనోధైర్యంతో మనం అందరం సంఘటితంగా చేతులు కలిపితే అదే విప్లవం జడలువిప్పి ఆటలాడు తున్న ఈ కట్నాల జాడ్యాన్ని వదిలించి కొట్టాలంటె మనం కలిసి కట్టుగా కృషి చెయ్యాలి

మనం పిల్లలం మనకేం తెలుసు పెద్ద వారు చూసుకుంటార్లే అన్నబావన అసమర్థతకి చిహ్నం ఈ రోజు పిల్లలే రేపటి పెద్దలు

నామటుకు నేను ఈ విషయంలో మనసా వాచా 'స్టాండ్' తీసు కుంటున్నాను ఇదే ఆ రోజు డిబేట్ పోటీలో నేనిచ్చిన లెక్చర్ అన్నయ్యా ' అంది చతుర

చెల్లెలు చతుర వాగ్ధాటికి, ఆమెలో గూడుకట్టుకున్న ఆధునిక బావనలకి ఆశ్చర్యంతో సంతోషంతో చప్పట్లు కొట్టడమే కాక మనసులో తనూ 'స్టాండ్' తీసుకున్నాడు రాఘవ

ఎప్పుడూ విషం అనే వర్తమానంలో కొట్టుమిట్టాడుతూ భవిష్యత్తు అనే ఆశలేక అనుక్షణం బయం భయంతో మిడిల్‌క్లాస్ అనే ఈ సముద్రాన్ని ఈదటానికి పిల్లల ప్రోత్సాహం ఉంటే చాలన్న బావన ఆ దంపతుల్లో మెదిలి వారి చేతులకి కూడా ఊతం వచ్చి జోరుగా చప్పట్లు కొట్టాయి

ఆ గదిలో చప్పట్లు మారు మ్రోగాయి

## "దిక్సూచి"



మతం అంటే-
మాయదారి మత్తు!
కులం అంటే-
కంపుకొట్టు కుళ్ళు!
ప్రాంతీయత అంటేనే,
పెరిగిన రాచపుండు!

భాషాభేదం అంటారా,
అది కల్తీలేని విషభాండం!

సమాజమంతా
కల్తీల అయోమయం
సంఘటితం కానిదే
జరగదెన్నటికీ న్యాయం

అందుకే-
స్వ పర భేదాలు మానాలి!
సంస్కారపుశక్తి రావాలి!
అన్నదమ్ముల మాదిరి,
అందరు కలిసి బ్రతకాలి!

మిన్నుమీదికొరిగినా
వెన్నువిరగబోయినా
చెక్కు చెదరని-
సైనికునిగా,
దేశమాతకు-
ఉక్కు కవచమై,
త్యాగభావపు,
నిండుకుండయై
శాంతి నింపాలి!
జగతిన-
క్రాంతి కురవాలి!!

- డా. కె.ఎల్.వి. ప్రసాద్

# ప్రహసనం

ఆ రోజు ప్రభాతం నాకు మామూలు ఉదయంగా లేదు,
వేయి మంది ఆదిత్యులు వెలుగు రథాలెక్కి
ఏడు వేల గుర్రాలతో పరుగెత్తి వచ్చిన రోజు!
ప్రథమ స్వాతంత్ర్య దినోత్సవాన
నిస్వార్థ స్వాతంత్ర్య సమరయోధుని గుండెలా
మొదట చంద్రుడ్ని జయించిన
సాహసి నీల్ ఆర్మ్‌స్ట్రాంగ్ మనస్సులా...

నా హృది దూది పింజై తేలిపోతోంది!
ఇన్నేళ్ళూ సాధించిన ప్రథమ తరగతి పట్టాలూ
బంగారు పతకాల అలంకరణలూ
నాకు మకుటం పెట్టబోతున్నాయి
ఉద్యోగ పట్టాభిషేకం చెయ్యబోతున్నాయి
నా మొదటి ఇంటర్వ్యూ స్వర్గంలోకి యక్షుడనై నడచి...

మౌఖిక పరీక్షకై మార్యుల ముందు కూర్చున్నాను!
గోదావరి వరద ప్రమాద సూచిక తాకినపుడు
కూనవరంవద్ద నీరు ఎన్ని క్యూసెక్కులు?
నార్వే దేశపు వార్షిక రక్షణ వ్యయమెంత?
శ్రావణ మేఘం అత్యధిక వేగమెంత?
జెముడు కాకి జీవన కాలమెంత?
దేశంలో జోగినుల శాతమెంత?

ఈ ప్రశ్నల కూడికలన్నీ కలసి
తీసివేత కార్యక్రమాన్ని చేబట్టాయి
ఆశ్రితుల సంక్షేమం కోసం
అధికారుల ఎత్తుగడ భేషుగ్గావుంది
కురు సభలో దిక్కుతోచని ద్రౌపదిలా
దీన బాంధవుడి కోసం నేను చేతులెత్తగా
ఎత్తుగడతో యుక్తిగా నన్ను ఇంటిదారి పట్టిస్తే
తేరుకోలేనంతగా తగిలింది విద్యుత్ ఘాతం
ప్రసూతి వైరాగ్యం బారసాలతో సరనుకొని
ఆశయ సిద్ధి కోసం అడుగు ముందుకు వేశాను!

-అడిగోపుల వెంకటరత్నమ్

# ఈ వారం లో మీ యోగం

## 21-9-1990 శుక్రవారం మొదలు 27-9-1990 గురువారం వరకు

**మేషం:** : రాజకీయంగా కొందరకు మేలున్నది. వ్యాపారరంగాన కొంద రకు సదవకాశాలు, పత్రికాధిపతులకు, పాత్రికేయులకు, పంపిణీదారులకు సద వకాశాలు. బంధుమిత్రులతో తగాదాలు, మనస్పర్ధలు రాకుండా చూచుకోవాలి. స్త్రీలకు: ఆదాయవృద్ధి, సుఖశాంతులు.

**వృషభం:** సభారంగాన అనుకూలం. వ్యవ హారరీత్యా అనుకూలం. బంధుమిత్ర సమాగమం. రచయితలకు, గాయకులకు, చిత్రరంగాన పనిపాటలు చేయువారికి అనుకూలతయున్నది. లాభమున్నది. వ్యాపారలోపం లేదు. స్త్రీలకు: పత్రి కారంగాన శ్రమించు వారికి, రచయి తలకు, గాయకులకు అనుకూల సమ యంగా భావించండి.

**మిధునం:** ప్రజారంగాన ప్రసిద్ధియు న్నది. ఇష్టబంధు సమాగమం. వ్యాపార రంగానుకూలత, వ్యవహార విజయం అను కొనని విధంగా ధనానుకూలత, ఏమ యినా దూర ప్రాంతాల నుండి యింటికి హఠాత్తుగా వచ్చిన బంధువు లకు తప్పనిసరిగా సహాయం చేయవలసిన అగత్యమున్నది. స్త్రీలకు: అప్రయత్న ధనలబ్ధి, అంతకు అంత వ్యయం.

**కర్కాటకం:** ప్రభుత్వరంగాన్నుండి రావలసిన పైకం నిరాఘాటంగా అందు తుంది. అప్రయత్న ధనానుకూలత, వ్యాపారమందు అనుకూలత, ప్రతిభ రాణించుటకు ఆస్కారం, విలాస వస్తు సేకరణ యిత్యాది విషయాలకు అను కూలం. స్త్రీలకు: 'గురు గ్రహరాశి స్థితి' బాధాకరం కానున్నది.

**సింహం:** 'వారమంతా యోగం' అనరా దుగాని సభారంగాన ప్రతిభరాణించటం, సాధుసజ్జన సాంగత్యం, అతిథి అభ్యా గతులను ఆదరించుటకు ఆస్కారం. నూతన వ్యక్తుల పరిచయం సర్వవి ధాల అనుకూలం. అప్రయత్నాదాయం. స్త్రీలకు: యత్నకార్యానుకూలం, రాజ కీయరంగానుకూలం.

**కన్య:** దినక్రమంగా యోగం వృద్ధినం దనున్నది. సభారంగాన అభివృద్ధి చేకూ రనున్నది. ప్రయాణ సూచనయున్నది. అదీ బహుదూర దేశాలకు, ఇప్పట్లో అంత దూరం ప్రయాణించటం శ్రేయస్కరం గాదు. గ్రహించండి. స్త్రీలకు: యోగం ఎలాగున్నా, యిబ్బందులు రాకుండా ఉంటే చాలు. చాలాకాలంగా రావలసిన పైకం అందనైన వారం, ఈవారం, గ్రహించండి.

**తుల:** రాశికి 'మూట' వక్రిగా స్థితి యందున్న శని యిటీవల చాలాకాలం యోగదాయకంగా ఉండటం గమనించి ఉంటారు. ఇలాగే ఈ వారమంతా జరు గుట గమనించగలరు. ఆరోగ్య లోపం లేదు. అన్ని రంగాల వారికి చక్కని అవ కాశాలు. స్త్రీలకు: ధనయోగం కలదు.

**వృశ్చికం:** గ్రహగమనం ఏ విధంగా లాభకారిగాదు. 'ఏలినాటి' శని బాధా గ్రస్తులే. మరీ ఈ వారం సదవకా శాలు చిక్కినట్లు చిక్కి దూరంగా వెళ్ళి మాయమవుతాయి. తగాదాలు రేకెత్తగల సమయం. స్త్రీలకు: వ్యర్థపు మాటలు, అనవసరపు తిరుగుడు, సుఖశాంతులు.

**ధనుస్సు:** సభామర్యాదయున్నది. వస్తు సేకరణకు ఆస్కారం. శుభదా యకం, ఆరోగ్యదాయకం అపూర్వ వస్తు సేకరణకు ఆస్కారం. సభా మర్యాద, నూతన మిత్రసమాగమం. అనుకోనని విధంగా ఆదాయం. స్త్రీలకు: ఇష్ట బంధు సమాగమం. వృత్తియందు పెంపు. రాజ కీయంగా అనుకూలం, గ్రహించగలరు.

**మకరం:** యోగదాయకం, అంటే వస్తు వాహన ధనవసతికి ఆస్కారం. శుభదా యకం, అనుకూలదాయకం అని అర్థం. సభామర్యాదయున్నది. వృత్తిలో సద వకాశాలున్నాయి. స్త్రీలకు: అనుకూల దినాలే, ధనలోపం లేదు, శుభ కార్యాలో చనలుంటాయి, ఆదాయమున్నా అధిక వ్యయమే.

**కుంభం:** సభామర్యాదయున్నది.వృత్తిలో సదవకాశాలున్నాయి. బంధు విరోధం ఏర్పడనున్నది. అందుకు కారణం 'గురువే'. వృత్తి యందు రాణింపు కని పిస్తుంది. స్త్రీలకు: సభామర్యాద, ఆదా యవృద్ధి, శుభసమయం. అంతా 'శని' గ్రహ కృషియే, గ్రహించాలి.

**మీనం:** దూర ప్రాంతాలకు వెళ్లవలసిన అగత్యం. చేసే వ్యాపారంలో పెంపు. ఈ సమయంలో నల్లటి వస్తు విక్రయం లాభప్రదం. ఏ విషయమయినా గ్రహచా రాన్ని అనుసరించి ఈ రాశి జాతకులకు యోగాధ్యమే. స్త్రీలకు: అపూర్వ వస్తు సేకరణకు ఆస్కారం. మిత్ర జనాను కూలం, యోగాధ్యం కాదా?

-విద్వాన్ కోటసత్యరంగయ్యశాస్త్రి

---

## పరమ్ వీర్‌చక్రకు ఆదరణ

**టీ.**వి. ప్రేక్షకులు 'పరమ్ వీర్ చక్ర' పట్ల మంచి ఆదరణ చూపుతున్నారట. ఈ సీరియల్ పట్ల 59 శాతం మంది ఆకర్షితులవుతుండగా, 'ది స్వోర్డ్ ఆఫ్ టిపుసుల్తాన్' సీరియల్‌ను 55 శాతం మంది వీక్షిస్తున్నారు. అన్ని సీరియల్స్‌తో పోలిస్తే 'పరమ్ వీర్ చక్ర' ప్రథమ స్థానంలో వుందని ఒక నివేదిక తెలుపుతోంది.

సీరియల్

# సాగరమథనం

## అడివి సూర్యకుమారి

[గత సంచిక తరువాయి]

*గత 500 సంవత్సరాలుగా ట్రైబల్స్ ప్రపంచవ్యాప్తంగా వస్తున్న విపరీతమైన మార్పులను తట్టుకుంటూ తమ ఉనికిని కాపాడుకోగలుగుతున్నారంటే వారి ఆత్మస్థైర్యం మెచ్చుకోదగ్గది.*

ప్రపంచ దేశాల్లో వున్న ట్రైబల్స్‌లో కెల్లా దక్షిణ ఆసియా ఖండంలోని భారతదేశం, బర్మా, పాకిస్తాన్, శ్రీలంక దేశాల్లో వీరు హిందూ, బుద్దిష్ట్ కల్చర్స్ వల్ల తమ వునికిని ఈరోజుకీ చక్కగా కాపాడుకోగలుగుతున్నారు. అంతేకాదు ఈ మత ప్రభావం వారి దైనందిన జీవితాల్లో అద్దం పట్టి ఆనాటి మన సంస్కృతిని గుర్తుకు తెస్తుంది.

శ్రీలంక పరిసర కొండ ప్రాంతాల్లోని గిరిజనులు అట్టి సంస్కృతికి ప్రతిబింబాలు. వ్యవసాయం చేసే వారికి ప్రాముఖ్యం ఎక్కువ. మిగతా వారు కొండ ప్రాంతాల్లో దొరికే వస్తువులు తెచ్చి పట్టణ ప్రాంతాల్లో అమ్ముకుంటారు. అయినా వీరి జీవనం చాలా కష్టమయంగా వుంటుంది.

శ్రీలంక నుండి ఎగుమతి చేసే రబ్బరు, మొదలైన వాటి ఖరీదు తక్కువ, దిగుమతి చేసుకొనే ఆహారధాన్యాల ఖరీదు ఎక్కువ అవటం చేత దేశంలో వ్యాపార సంబంధమైన ఆర్థిక దుస్థితి వుంది. దాంతో పల్లెజనం, అతి తక్కువ శ్రేణికి చెందిన గిరిజన మొదలైన తరగతి ప్రజలు తిండికూడా ఇబ్బంది పడే పరిస్థితి వుంది. వారు ఏదో పనులు చేసుకొంటూ పట్నాలకొచ్చి పొట్టపోసుకుంటున్నారు. కొందరు గారడీలు చేస్తుంటారు. కొందరు పాముల్నాడించి డబ్బులు చేసుకొంటారు, కొందరు అడవుల్లోని జంతువుల్ని, అంటే ఉదాహరణకి ఎలుగుబంటిలాంటి వాటిని తెచ్చి ఆడించి డబ్బులు అడుక్కోవటం లాంటివన్నపై జీవించే వాళ్ళు కొందరు-వారి జీవనం దుర్భర దారిద్ర్యంతో ఉందనే చెప్పాలి.

కొలంబోలో-

సమరసింఘెని అరెస్ట్ చేసిన మర్నాడు-అతనారోజు పోలీసు కస్టడీలో సెల్‌లోనే ఉన్నాడింకా.

దాదాపు మధ్యాహ్నం కావస్తోంది.

శ్రీలంకలో పాములకి బాగా ప్రసిద్ధి చెందిన అడవులున్నాయి.

రకరకాల పాములు అడపాదడపా ఫారెస్ట్‌కి దగ్గరగా వున్న గ్రామాల్లోకి రావడం కద్దు. రెండడుగుల నుండి, పన్నెండు పదహారు అడుగుల పొడవు గల పాములు కూడా ఆ అడవుల్లో ఉన్నాయి. రక్తపింజరి, నాగులతోపాటు అక్కడ ప్రఖ్యాతిగాంచిన 'శివ' సర్పం. ఈ పాము తల మీద అడ్డగీతలుంటాయి.

కొలంబో వీధుల్లో ఆ రోజు ఇద్దరు పాముల వాళ్ళు రకరకాల పాముల్ని ఆడిస్తున్నారు.

ఇద్దరికీ పొడవు పాటి జోలెలున్నాయి. ఆ జోలెల్లో పది పెట్టెలున్నాయి. ఒక్కో పెట్టెలో ఒక్కో పాముంది.

ఇద్దరూ దృఢంగా ఉన్నారు. చేతులకి రకరకాల తాయెత్తులున్నాయి. గిరిజాల జుట్టు దువ్వి వెనకముడివేశారు. చెవులకి తమ్మంట్లున్నాయి. చేతికి వెండి కడియం దళసరిగా వున్న మొద్దు చెప్పులు, ముతక పంచె, దానిపై అటువంటిదే ఒక చొక్కా ధరించారు. చేతుల్లో నాగస్వరం కాయ.

'చూడండి బాబూ! చూడండి! ఇది రక్తపింజరి. చూశారా ఎర్రగా ఎట్లా వుందో! ఇది కరిచిందా మరుక్షణం రక్తం కక్కుకొని చావాల్సిందె!' అనగానే వారి చుట్టూ మూగిన జనం భయంతో నాలుగడుగులు వెనక్కేశారు.

అది గమనించి వాళ్ళు నవ్వుతూ

**ఇంతవరకూ సాగిన కథ -6:** శ్రీలంక ఉగ్రవాదులను అరికట్టడంలో తమ వంతు కర్తవ్యాన్ని నెరవేర్చి స్వదేశం తిరిగి వెళ్తున్న భారత శాంతిసేనకు వీడ్కోలిచ్చేందుకు వచ్చిన ముగ్గురు అధికారులు దుండగుల బుల్లెట్లకు బలిఅవుతారు. ట్రింకోమలిలో శక్తి నెలకొల్పిన సేవాగ్రామంలో జయసూర్య డాక్టరుగా జాయినవుతాడు. అక్కడి ఒకామె పరిస్థితి చూసి జయసూర్య ఖిన్నుడవుతాడు.



'భయపడకండి. దాన్ని మంత్రకట్టుతో బంధించాం. ఇది ఇప్పుడు ఎవరినీ ఏమీ చేయలేదు' అన్నాడు.

తర్వాత రెండు తలల పామును బైటికి తీశాడు. 'చూశారా! ఇది శిఖండి. దీని రెండు తలలూ చూడండి' అంటూ రెండవతలను కర్రముక్క [illegible] చూపాడు [illegible] బాగా మెత్తుగా వుంది ఆడటంలేదు.

దాన్ని వదిలేసి మరో బుట్టతెరిచాడు. మూత తెరిచి తెరవటంతోనే అది బుస్సు బుస్సుమంటూ వాడి మొహం మీదికి వడగతో కొట్టబోయింది. దాని వడగపై అడ్డగీతలున్నాయి. దాని దెబ్బను తెలివిగా తప్పుకుంటూ వాడు దాని మూతిపై చురుగ్గా ఒక దెబ్బవేశాడు. అది ఒక్క క్షణం తలవాల్చింది. తర్వాత రివ్వున

కండి' అరుస్తూ అతను స్టేషన్‌లో అటు ఇటూ పరిగెత్తాడు. రెండు నిముషాల్లో సిపాయిలు అతని ముందుకొచ్చి 'సమర సింహె మాయమయ్యాడు సార్. స్టేషన్లో లేడు. తప్పించుకు పారిపోయాడు'

'ఆ! వెదకండి. ఎక్కడికి పోతాడు. ఎంతదూరం పోతాడని, వెదకండి, క్విక్. అతను కన్పించకపోతే మన ఉద్యోగాలు పోతాయి. జాగ్రత్త. గాలించండి వాడి కోసం' అంటూ అరిచాడు.

ఒక్కక్షణం ఆగి 'ఇంతకీ ఆ పాముల వాళ్ళేరి?'

'లేరు సార్, వాళ్ళప్పుడే పోయినట్లుంది'.

'పక్క వీధిలో చూడండి' అరిచాడు హెడ్ కానిస్టేబుల్.

'ఇంకా అర్థం కాలేదా! ఆ పాముల వాళ్ళు అతని మనుషులే. అతణ్ణి విడిపించుకుపోవటానికి తెలివిగా వ్యవహరించారు.'

'ఆ!!' నోరు తెరిచారు సిపాయిలు.

'వెళ్ళండి, అణువణువు, వీధి, వీధి గాలించండి. అతణ్ణి పట్టుకోండి. వెళ్ళండి' గట్టిగా అరిచాడు ఇన్‌స్పెక్టర్ తోకతొక్కిన పాములా బుసలు గొడ్తున్నాడు.

పోలీసుల ప్రయత్నాలన్నీ వ్యర్థమయ్యాయి. ఎంత గోప్యంగా ఉంచినా ఈ విషయం పి.వి.పి.కి. తెలిసిపోయింది.

మళ్ళీ గొడవలు మొదలయ్యాయి.

పి.వి.పి. నాయకులు పేపర్ స్టేట్‌మెంట్లివ్వసాగారు.

"ప్రభుత్వ అరాచకం నశించాలి"

"కసాయి ప్రభుత్వం దమననీతికి స్వస్తి చెప్పాలి."

"నరరూప రాక్షసులైన పోలీసులె సమరసింహెను పొట్టన బెట్టుకొని పారిపోయాడంటున్నారు. మేం ఇది సహించం. ఇలాగే ఎందరో విద్యార్థుల్ని 'ఇంటరాగేషన్' పేరుతో ప్రభుత్వం కొన్ని రోజుల పాటు సెల్స్‌లో వుంచి చిత్ర హింసలతో చంపింది. మరెందరో ప్రజాప్రతినిధుల్ని అరెస్ట్ చేసి అయిపు లేకుండా చేశారు. ఎందరో ఆఫీసర్లను అనుమానితులంటూ అరెస్ట్ చేసి చంపేశారు. వారి గురించి అడిగితే పారిపోయారన్నారు. వారంతా నిజంగా పారిపోతే వారి భార్యా పిల్లల్నో, తల్లిదండ్రుల్నో కలుసుకోకుండా ఉండగలరా! లేదు. ఇవన్నీ కట్టు కథలు. ఈ కాకమ్మ కథలు నమ్మేస్థితిలో ప్రజలిప్పుడు లేరు. ఆ మధ్య యూనివర్శిటీ పిల్లలు తమ ముఖాలకి మాస్క్‌లు వేసుకొని చర్చల్లో ఎందుకు పాల్గొన్నారో తెలుసా! ప్రభుత్వం ఎక్కడ తమను గుర్తుపెట్టుకొని తర్వాత ఏదో నేరం మోపి అరెస్ట్ చేసి చంపేస్తారని. ఈ దారుణాలు ఈ గడ్డ మీద పసిపిల్లనడిగినా చెబ్తుంది. మా నాయకుడు నిజంగా పారిపోయే వుంటే ఈ సరికే మమ్మల్ని కలుసుకొనేవాడు. ఇంతవరకూ మా దగ్గరికి రాలేదంటే ఇది మీ ఘనకార్యమే...24 గంటలలోపుగా సమరసింహె మా దగ్గరికి రాకపోతే జరిగే దారుణాలకి మేం బాధ్యులం కాదు. ఆ పేపర్ స్టేట్‌మెంట్ చదివి మేఘవర్ణ పిడికిళ్ళు బిగుసుకున్నాయి."

'రాస్కెల్స్! చెప్పినా నమ్మరు. నిజం చెప్పినా నమ్మరు. ఆ ఇడియట్ ఎలా పారిపోయాడు! నిన్న డ్యూటీ ఎవరిది? ఆ సబ్ ఇన్‌స్పెక్టర్‌ని, సెంట్రీలని పిలిపించండి' కర్కశంగా ఉందతని కంఠం.

పది నిముషాల్లో అక్కడ కావలా వున్న నల్గురు సెంట్రీలు, సబ్ ఇన్‌స్పెక్టర్ అతని ముందుకు తీసుకురాబడ్డారు.

మేఘవర్ణ వాళ్ళ వైపు చూస్తూ-"ఒక వ్యక్తికి ప్రొటెక్షన్ ఇవ్వలేని మీరు దేశ ప్రజలనేం ప్రొటెక్ట్ చేయగలరు? ఏనాడైనా పోలీసు స్టేషన్ ముందు పాముల వాళ్ళు వచ్చి ఆడించటం జరిగిందా? అంత ధైర్యం వుందా? అఫ్టరాల్ ఇద్దరు ట్రైబల్స్, ఇంత ప్లాన్డ్‌గా ఒక పోలీసు కస్టడీలో వున్న ఒక వ్యక్తిని ఇంత తేలిగ్గా తీసుకుపోగలిగితే మన డిపార్టుమెంటు మీద ప్రజలకేం నమ్మకం ఉంటుంది? అసలు బ్రతికుండటానికి మీ అర్హతేమిటి?" ఖంగు ఖంగుమంటోందా గదిలో అతని కంఠం. అంత కోపం రావడం ఎవరూ చూడలేదు, ఆ విగ్రహంలో కన్పిస్తున్న ఉద్రేకం, ఆవేశం చూసి హడలిపోతున్నారు వాళ్ళు.

'సార్.....' అంటూ నీళ్ళు నమలసాగారు. కనీసం వాళ్ళు చెప్పాకోబోయే ఎక్స్‌ప్లనేషన్ అయినా వినే స్థితిలో మేఘవర్ణ లేడు.

'నేను ఏదైనా సహిస్తానుగాని, అసమర్ధతను సహించను' అంటూ మేఘవర్ణ డ్రాయర్ సొరుగు లాగి పిస్టల్ తీసి ఐదు గుర్నీ కాల్చేశాడు.

అక్కడున్న ఐ.జి.పి. ఆ సంఘటనకి నిశ్చేష్టుడయ్యాడు.

ఒక్క క్షణకాలం అక్కడ జరిగిందేమిటో అర్థం కాలేదు.

తర్వాత నేల మీదపడి గిలగిల కొట్టుకుంటున్న ఆ ఐదుగుర్ని చూశాక అతని కర్థమైంది!!

[ఇంకా వుంది]

# యువతా! కవితా!!

## వెన్నెల

నెలనెలా వెన్నెల!
నింగినేలు చల్లని వెన్నెల
అంబరాన చుక్కలతో
ఒప్పారెడి వెన్నెల!
జగాన్ని మురిపించి
జనాన్ని మైమరిపించే
చల్లని వెన్నెల!!!
కమ్మని కథల నల్లించే
కమ్మని కైతలల్లించే
ప్రేమ జంటల కలలు పండించే
చల్లని వెన్నెల!! అందమిచ్చు వెన్నెల!!
నింగి నేలు వెన్నెల్ల!

- కంకటి శంకర్‌రావు

## శ్వాసను

కుల కులాన్ని కొల్లగొట్టి
మత మతాన్ని మార్చివేసి
ఏక కుల స్థాపనకై
వెన్నెముకను కావాలని
ఎదురు చూచు ఆశను
ఎగ్రబాకు శ్వాసను...

-పెరవలి రత్నాకర్

## లక్ష్యం

లక్ష్యం ఎప్పుడూ-
వీడని నీడలా వెంటాడుతూనే ఉంటుంది.
కలత నిద్రలో -
కుమ్మరి పురుగులా మెదడును
తొలుస్తూనే ఉంటుంది.
కానీ-
మెరిసే మిణుగురులా చేతికి మాత్రం
చిక్కదు.
నరాల్ని తాళ్లలా పేని అయినా సరే
దాన్ని బంధించి గుప్పెట్లో ఉంచుకోవాలి.
మన అవయవాలన్నీ కరగేసి అయినాసరే
వడివడిగా యీదుకుంటూ లక్ష్యంకోసం
సాగిపోవాలి

లక్ష్యం-
ఎప్పుడూ మంచిదే కావాలి.
లక్ష్యం కోసం-
రక్తదానాలు చేయాలే తప్ప,
రక్తపుటేర్లు పారించకూడదు.
ఒకవేళ మనం మరణించినా-
మన లక్ష్యాన్ని మాత్రం బ్రతికించుకోవాలి.

-గొంటు శ్రీనివాస్

## ప్రకృతి పాఠశాల

పూల పరిమళాలు
మంచితనపు మధురిమలు!
వలనెత్తుకెళ్ళిన విహంగాలు
ఐకమత్యానికి చిహ్నాలు!
సరదాకి పెంచే శునకాలు
విశ్వాసానికి ప్రతిరూపాలు!
గడ్డి తిని పాలిచ్చే గోవులు
నిస్వార్థ జీవనానికి నిర్వచనాలు!
రాళ్ళు వేసినా పళ్ళనిచ్చు వృక్షాలు
దాతృత్వానికి మాతృకలు!
బారులు తీరిన పిపీలికాలు
శ్రామిక శక్తికి చిహ్నాలు!
ప్రకృతి పాఠశాలలో
పరిశీలిస్తే ప్రతీది ఓ గురువు
అనుసరించే ప్రతి మనిషీ ఓ విద్యార్థి!

- పుల్లాపంతుల వేంకటసుబ్బారావు

## సున్న

నేడు
ఎన్నో విలువైన
వస్తువులన్నిటికన్నా
వరుని ధర మిన్న.
మొగుణ్ణి ఎంతిచ్చి కొన్నా
మగువ జీవితం సున్న.

- జి. బాలాజీ

# హల్లో డాక్టర్ నేనేం చేయాలి?



డా. కొత్త రవీంద్రబాబు

**సిహెచ్. శ్రీనివాసరావు, గౌరీపట్నం.**

చిన్నప్పుడు పసికర్లు వచ్చాయి. అప్పుడ్నుంచీ కళ్ళు పచ్చగా-వుంటాయి.

ముందుగా మీకు పసికర్లు వున్నదీ లేనిదీ డాక్టరుగారికి చూపించండి. పసికర్లు వుంటే చాలా వివరంగా పరీక్షలు స్కానింగ్ చేయించుకుని కారణం ఏమిటో తెలుసుకోవటం మంచిది.

**వినోద్‌ఖన్నా, పాడేరు.**

ప్ర: వయసు 17 సంవత్సరములు. పొడుగు పెరగాలి. లావెక్కాలి.

జ: యువకులు 18-21 సంవత్సరముల మధ్యపొడుగు పెరుగుతారు. లావెక్కటానికి మంచి పోషక పదార్థాలున్న ఆహారం తీసుకుంటూ స్ట్రాంబా రోజుకో బిళ్ల చొప్పున రాత్రి భోజనానంతరం నెలరోజులు వాడండి.

**సురేష్, విజయవాడ.**

ప్ర: మీ అభిమానిని. ఆటోగ్రాఫ్ పంపండి. యువతకు మీరిచ్చే సందేశం ఏమిటి.

జ: పై మెరుగులకు భ్రమపడకండి.

**పి.విజయలక్ష్మి, చీరాల.**

ప్ర: వయసు 16 సంవత్సరములు. పొడుగు పెరగాలి. సన్నబడాలి.

జ: ఆహారంలో కొవ్వు పదార్థాలు తీపి వస్తువులు తగ్గించుకొని పాండోరాక్స్ బిళ్ల రోజుకొకటి చొప్పున రెండు నెలలు వాడండి. పొడుగు పెరిగే వయసు ముందున్నది.

**ఓ పాఠకురాలు.**

ప్ర: అబ్బాయిగా మారాలని వుంది.

జ: గుంటూరు గవర్నమెంట్ హాస్పటల్‌లోని ప్లాస్టిక్ సర్జన్ గారిని సంప్రదించండి. ఆయన మీ కోర్కె తీరదని గనక చెబితే మానసిక నిపుణుని సంప్రదించండి. అవయవ నిర్మాణాన్ని బట్టి మీ కోరిక సఫలం అయేదీ, కానిదీ నిర్ణయిస్తారు.

**ఎస్. రాజ్యలక్ష్మి, అంగలకుదురు.**

ప్ర: చెవి ఆపరేషన్ చేయించుకున్నాను. 6 సంవత్సరముల తర్వాత రక్తము కారుచున్నది. చెవిలో నొప్పి, మందులు వాడినా తగ్గడం లేదు.

జ: ఒకోసారి ఆపరేషన్ తర్వాత కూడా అలా జరుగుతుంది. చెవిలోని ద్రవాన్ని కల్చర్ పరీక్షకు పంపి రిపోర్టును బట్టి మందువాడి చూడండి. ఫలితం లేకుంటే మరలా ఎక్స్‌రే తీయించి అవసరం అయితే ఆపరేషన్ చేయించుకోండి. ఎక్కువ రోజులు మందువాడితే బాధతగ్గవచ్చు.

**ఓ పాఠకుడు, ఆవులవారిపల్లి.**

ప్ర: 18 సంవత్సరములు. రెండేళ్ల నుండి ఆవుతో సంబంధం వుంది. అంగం పెద్దదిగా వుండి ఎరుపుగా వుండి మంటపుడుతున్నది.

జ: పశువులతో సంపర్కం మానండి. డాక్టారిన్ ఆయింట్‌మెంట్ స్నానానంతరం పురుషాంగం మీద రాసుకోండి వారం రోజుల పాటు. పురుషాంగం పెద్దదై పోయిందన్న భావన కేవలం అపోహ! చాలా మంది యువకులు అంగం చిన్నదైనదని భయపడుతున్నారు. మీ భావన అందుకు విరుద్ధం!

**ఎస్. కిరణ్‌కుమార్, అనంతపూర్**

16 సంవత్సరములు. మొటిమ లెక్కువగా వున్నాయి.

సబ్బు బదులు సున్నిపిండి వాడండి. టెట్రాసైక్లిన్ 250 మిల్లీ గ్రాముల బిళ్ళ రోజుకొకటి చొప్పున ఆరు నెలలు వాడండి. మొటిమలు గిల్లవద్దు.

**వి. ప్రసాద్, గుంటూరు**

వయసు 22 సంవత్సరములు. కామెర్లు వచ్చి 2 నెలలయింది. భార్యతో కలువవచ్చా?

నిరోధ్ వుపయోగించండి.

**వై. పి. ఎ, రేపల్లె**

ఇదివరలో స్వయం తృప్తి కలవడ్డాను. నిద్రలో వీర్యనష్టం జరుగుతుంది. మూత్రం మంటగా వుండి త్వరగా వెళ్ళవలసి వస్తున్నది.

నిద్రలో యింద్రియ స్ఖలనం వలన నష్టంలేదు. మూత్రం పరీక్ష చేయించుకుని మందులు తీసుకోండి.






ఆదివారం... రాత్రి ఏడుగంటల సమయం.
జోరున వాన పడుతోంది.
చీకట్లో ఉండుండి భయం కలిగేట్లు మెరుపులు, ఉరుములు, పిడుగులు.

వానమూలాన ఎటూ కదలలేక యింట్లోనే ఉండిపోయాడు విజయ్.

అతను బ్యాంక్‌లో పనిచేస్తున్నాడు. యింకా పెళ్లికాలేదు. బలంగా అందంగా ఉంటాడు. తనని చూసి అమ్మాయిలు పడిపోతారన్న గట్టి నమ్మకం ఉంది అతనికి.

ఆదివారాలు జల్సాగా తిరుగుతాడు. యివాళ వానని తిట్టుకుంటూ యింట్లోనే కూర్చున్నాడు.

తలుపుకొట్టిన చప్పుడైంది. వానహోరులో సరిగా వినిపించలేదు. ఏదో శబ్దంలే అనుకుని ఊరుకున్నాడు.

ఈసారి దభీ దభీమని తలుపుబాదిన చప్పుడైంది. వెళ్ళి గడియతీశాడు. గాలికి తలుపు దఢాలున తెరుచుకుంది. దాంతోపాటే మెరుపు తీగలాంటి ఒకమ్మాయి లోపలికి వచ్చింది.

గాలి విసురుకి నిలదొక్కుకోలేక అతని మీద పడింది ఆమె. తన చెయ్యి ఆమెకు ఆసరాగా యిచ్చి నిలబెట్టాడు విజయ్.

ఎవరు కావాలని అడగటం కూడా మర్చిపోయాడు ఆమె మొహాన్ని చూస్తూ.

చాలా అందంగా ఉన్నది ఆమె. పచ్చని మొహంలో నల్లటి కళ్ళు మిల మిల మెరుస్తున్నాయి. పూర్తిగా తడిసిన బట్టలలోంచి పుష్టిగా ఉన్న అవయవ సంపద కళ్ళకు విందుచేస్తోంది.

"పక్కింటి పరంధామయ్యగారు మా చుట్టాలండీ. వాళ్లకోసం వచ్చాను. యిల్లు తాళం పెట్టి ఉంది. ఎక్కడకు వెళ్లారండీ" అన్నది ఆమె ముద్దుగా.

పరంధామయ్యగారు కాకినాడ ట్రాన్స్‌ఫరై వెళ్లిపోయారు రెండ్రోజులక్రితమే.

ఆ సంగతే చెప్పాడు.

ఆమె గాభరా పడిపోయింది.

"అరె. యిప్పుడెలాగండీ. మా ఊరికి తిరిగి ట్రెయిన్ రేపు సాయంత్రం దాకా లేదు. ఆడపిల్లను ఒంటరిగా ఎక్కడ ఉండాలి" అన్నది భయంగా.

"మీరేం భయపడకండి. నన్ను మీ స్నేహితుడే అనుకుని హ్యాపీగా యిక్కడే ఉండండి. నాకేం అభ్యంతరంలేదు" అన్నాడు విజయ్. ఆమెని అతను అనుమానించలేదు. ఆమె దొంగ అయినా బ్రహ్మచారి గదిలో ఏం ఉంది ఎత్తుకుపోవటానికి.

ఆమె మొహంలో రిలీఫ్ కనిపించింది.

"థాంక్సండీ. మీకు శ్రమ కలిగిస్తున్నాను. సారీ అండీ" అన్నది. "నో. నో. ఇటీజ్ ప్లెజర్ ఫర్ మీ" అన్నాడు భుజాలెగరేసి.

ఆమె కిలకిల నవ్వింది.

ఒక్కసారి దొంతర మల్లెలు దోసిలితో తలమీద గుమ్మరించినట్లయింది విజయ్‌కి.

"మీరు చాలా బాగా నవ్వుతారు" అన్నాడు.

ఆమె మరీ మరీ నవ్వింది.

ఆ నవ్వుకి ఆమె ఒళ్లంతా పూలరథంలా కదిలికదిలిపోయింది.

"సంతోషం" అన్నాడు.

"ఎందుకూ"

"మీకు భయంపోయి మామూలు మనిషైనందుకు"

ఆమె మళ్లీ నవ్వింది.

అంతలోనే అతనికి గుర్తుకొచ్చింది ఆమె తడిసి ఉన్నదని.

"రండి. అదిగో బాత్‌రూమ్. మీరు

రిఫ్రెష్ అయి రావచ్చు" అన్నాడు.

ఆమె తన బ్యాగ్‌లోంచి నైట్ గౌన్ తీసింది.

"మీది చాలా ఫ్రెండ్లీ మైండ్" అన్నది.

"మీ పేరు చెప్పారు కాదు"

"మోహిని" నవ్వింది ఆమె.

"సూటబుల్ నేమ్" అన్నాడు.

"థాంక్యూ" ఆమె సిగ్గుపడింది.

ఆమె బాత్‌రూమ్‌లోకి వెళ్లి తలుపేసుకుంది.

అతను స్టౌ వెలిగించి అన్నం వండటం మొదలుపెట్టాడు.

ఆమె నిశ్శబ్దంగా ఎప్పుడు వచ్చి నిల్చుందో అర్థం కాలేదు. తల తిప్పి చూసేసరికి రంభలాగా కనిపించింది అతనికి.

పల్చని తెల్లటి నైటీల్లోంచి అందాలు మంచుతెరచాటున గులాబీలా మెరుస్తున్నాయి. ఆమె దగ్గర్నుంచి విదేశీ సెంట్ వాసన కాబోలు గుప్పున గుబాళిస్తోంది.

అతనిలో ఉద్రేకం ఉరకలు వేసింది.

బలవంతాన ఆమె మీద నుంచి చూపులు మరల్చుకొని కంచాల్లోకి అన్నం వడ్డించాడు.

కబుర్లు చెప్పుకుంటూ భోజనం పూర్తి చేశారు.

ఆమెకు మంచం యిచ్చి అతను చాప మీద పడుకున్నాడు.

ఎంతో బోర్‌గా ఉన్న వాతావరణం ఆమె రాకతో ఉల్లాసంగా మారిపోయింది.

లైట్ ఉంచాడు, ఆమె భయపడుతుందేమోనని.

అతని అణువణువు ఆమెని కోరుకుంటోంది.

అతను అమాయకుడు కాదు. యింతవరకూ, డబ్బిచ్చి ఎంతోమందిని అనుభవించాడు. యింకొంతమందిని పెళ్లి చేసుకుంటానని నమ్మించి సుఖించాడు. కానీ ఎక్కడా అల్లరికాలేదు. ఈమెతో తన కోరిక చెపితే ఒప్పుకుంటుందా. లేక అరిచి గొడవచేస్తే అనవసరంగా పరువు నష్టం. అతను ఆలోచిస్తున్నాడు.

యింతలో లైట్లు పోయాయి.

ఎక్కడో భయంకరంగా పిడుగు పడ్డ చప్పుడైంది.

మోహిని కెవ్వున అరిచింది.

యిదే సమయమని ఆమె దగ్గరకు వెళ్లి బుజ్జగిస్తున్నట్లు నటించి, భయంలేదన్నట్లు వీపు తట్టి చొరవ తీసుకున్నాడు విజయ్.

మోహిని అభ్యంతర పెట్టలేదు.

ఒక గంట గడిచింది.

మోహిని వెక్కి వెక్కి ఏడుస్తోంది.

విజయ్ ఓదారుస్తున్నాడు.

"ఛీ. మీరు యిలాంటి వాళ్లని తెలిస్తే అసలు ఉండేదాన్ని కాదు. బయట రక్షణ లేదనుకుంటే మీరు కూడా..." ఆమె మళ్లీ ఏడవటం మొదలుపెట్టింది.

విజయ్‌కి ఏం చెయ్యాలో తోచలేదు.

"నిజమే మోహినీ, నేను తొందరపడ్డాను. నీకు అన్యాయం చెయ్యను. పెళ్లి చేసుకుంటాను" అన్నాడు.

మోహిని ఆశగా చూసింది.

"నిజంగానా" అన్నది.

"ఒట్టు" అన్నాడు చేతిలో చెయ్యి వేసి.

పైకి ఒట్టు పెట్టాడే గానీ ఆమె ఎవరో తెలియకుండా, కట్నం లేకుండా పెళ్లి చేసుకోవడం ఎంతమాత్రం యిష్టం లేదతనికి.

మోహిని మీద అతనికి యింకా మోజు తీరలేదు. అది తీరాక పొమ్మని వెళ్లగొట్టొచ్చు. యిప్పుడు పైసా ఖర్చు లేకుండా పసందయిన పిల్ల పొందు లభిస్తుంటే ఎందుకు పోగొట్టుకోవాలి. పెళ్లి పేరు చెప్పి యింకొన్నాళ్లు సరదా చెయ్యొచ్చు అనుకున్నాడు.

మోహిని అతన్ని నమ్మి నిశ్చింతగా నిద్రపోయింది.

* * *

మోహిని వచ్చి యిరవై రోజులైంది.

యిరవైరోజులూ యిరవై క్షణాల్లా గడిచిపోయాయి. ఎందుకోగానీ రోజురోజుకీ నీరసించి పోతున్నట్లు అనిపించసాగింది విజయ్‌కి.

బరువు తగ్గిపోయాడు. మనిషికొంచెం నల్లబడ్డాడు. బలహీనంగా తయారయాడు.

ఒక్కొక్కసారి రాత్రిపూట భోజనం చేసి హాయిగా నిద్రపోదామా అనిపించే ది. అలాంటి సమయాల్లో మోహిని అతని దగ్గరకొస్తే యింకా నీరసంగా అనిపిస్తున్నది.

మోహినికి చెప్పకుండా డాక్టర్‌కి చూపించుకున్నాడు.

మందులు వాడుతున్నాడు.

ఫలితంలేదు.

"మన పెళ్ళి సంగతి మీ వాళ్లతో మాట్లాడతారా" అన్నది మోహిని.

"ముందు మీ వాళ్లని పిలిపించు. వాళ్లు వెళ్లి మా వాళ్లతో మాట్లాడతారు" అన్నాడు వదిలించుకోవటానికి.

ఆమె కళ్లల్లో బెరుకు, భయం లీలగా కనిపించాయి అతనికి. కారణం ఆలోచించాడు. అర్థం కాలేదు.

నెలరోజులైనా మోహిని కోసం ఎవరూ రాలేదు. మోహిని ఎవరికీ ఏ ఉత్తరమూ రాయలేదు తన క్షేమం గురించి.

ఆడపిల్ల వేరే ఊరు వెళితే క్షేమం కనుక్కోకుండా, పట్టించుకోకుండా ఎట్లా ఉంటున్నారు వాళ్లు.

ముందు తన నీరసం రోగం తగ్గితే మిగతా విషయాలు చూస్కోవచ్చు.

నెలగడిచిపోయింది.

యిప్పుడు బ్యాంక్‌కి వెళ్లి రావటానికి కూడా నీరసంగా అనిపిస్తోంది. యింత నీర

సంలో కూడా మోహిని అతన్ని రెచ్చగొట్టి సుఖం పొందుతున్నది.

ఆ రోజు ఒక్కడే పార్కులో కూర్చున్నాడు.

ఆ పచ్చిక, పూల చెట్లు, చల్లగాలికి ప్రాణం కాస్త తేరు కున్నట్లుగా ఉంది.

ఎదురుగా ఒక వ్యక్తి కూర్చుని తననే చూస్తున్నాడు. అతని మెడలో రుద్రాక్షలూ, తులసి పూసలూ ఉన్నాయి. ఎర్రటి బట్టలు ధరించాడు. నొసట బొట్టు, దట్టంగా విభూతి రేఖలూ ఉన్నాయి.

విజయ్‌ని చూసి రమ్మన్నట్లు పిలిచాడు.

అప్రయత్నంగా లేచి వెళ్లాడు విజయ్.

"ఎవరు నువ్వు" అడిగాడు అయన.

తన గురించి చెప్పుకున్నాడు విజయ్.

"నువ్వు ఒక స్త్రీతో ఉంటున్నావు కదూ" సూటిగా అడిగాడాయన.

"అవును"

"ఆమె తను ఎవరో చెప్పిందా"

"పక్కింటాయన బంధు వన్న"ది

ఆయన నవ్వాడు.

"వెర్రివాడా ఆమె మోహినీ పిశాచి" అన్నాడు.

# 'మోహినీ'కటాక్షం

విజయ్ ఉలిక్కి పడ్డాడు.

"ఏమిటీ" అన్నాడు వణుకుతూ.

మోహినీ పిశాచాల గురించి చిన్నతనంలో విన్నాడు. మనిషి రూపం ధరించి వస్తాయిట. అందగాడెవరన్నా ఒంటరిగా కనిపిస్తే పట్టుకొంటాయిట. కొద్ది రోజుల్లోనే వాడి రక్తం పీల్చి హతమారుస్తాయిట.

అతనికి ఒక్కొక్క విషయమే అర్థం అవుతున్నది. తన యింట్లో దేవుడి కాలెండర్‌గానీ, పటంగానీ లేదు. ఒకసారి అంజనేయస్వామి పటం తెబోతే మోహిని తీసుకురానివ్వలేదు. తనకు దేవుడంటే భక్తి ఎక్కువనీ, ఆ పటాలు యింట్లో ఉంటే, వాటిముందు ఆనందంతో పెళ్లికాకుండా సంసారం చెయ్యలేనన్నది. నిజమే కాబోలనుకొని అప్పటికప్పుడు ఎవరికో యిచ్చేశాడు.

అంతేకాదు. దయ్యంతో గడపటం వల్లనే కాబోలు తను బలహీనమై పోతున్నాడు.

అతనికి మోహిని మీద కొద్ది రోజుల్నుంచి ఉన్న అనుమానం గట్టి పడింది. వెన్నెముక లోంచి చలి పుట్టుకొచ్చింది.

మోహినిని ఎట్లా వదిలించుకోవాలి.

మనిషయితే తను ఎదుర్కోగలడు. మాయమాటలతోనో, బెదిరింపుతోనో వదిలించుకోగలడు.

కానీ దెయ్యాన్ని, అందులో మోహినీ పిశాచాన్ని ఎలా వదిలించుకోవాలి.

యింతవరకూ వినటమే కానీ అనుభవం లేదు. అసలు నమ్మేవాడే కాదేమో తనకి ఈ అనుభవం కలగకపోతే....

ఆయన కాళ్ల మీద పడిపోయాడు.

"స్వామీ, మీరే శరణం, రక్షించాలి" అన్నాడు.

ఆయన విజయ్ భుజాల మీద చెయ్యి వేసి లేవదీశాడు.

"ఏం భయంలేదు. సమయానికి నా కంటపడ్డావు. యింకొన్నాళ్లుంటే అది నీ రక్తం మొత్తం తాగి ఉండేది. నేను వచ్చి దాన్ని దిగ్బంధం చేస్తాను" అన్నాడాయన.

"రండి వెళదాం" అన్నాడు విజయ్.

యిద్దరూ కలిసి విజయ్ యింటికి వెళ్లారు.

మోహిని విజయ్‌నీ, అతనితో వస్తున్న

మనిషినీ కిటికీ లోంచి చూసింది.

వెంటనే అరవటం మొదలెట్టింది.

"వీడెవడు. ఎందుకు తెచ్చావు" అని అరిచేసింది.

"నీకు బుద్ది చెప్పాలని" అని ఆయన ముగ్గుతో యింటి చుట్టూ గీత గీయటం మొదలుపెట్టాడు.

మోహిని కీచుమని అరిచి వెనక తలుపులు తెరిచింది.

"బాబూ. అది పారిపోతోంది. పట్టుకో" అరిచాడాయన.

మోహిని కళ్ళెర్రజేసి చూసి బయటకు పారిపోయింది. విజయ్ ఆమెని పట్టుకోవటానికి సాహసించలేదు. వణుకుతూ మంచం మీద కూలబడ్డాడు.

"ఎంతో కష్టపడి దాన్ని దిగ్బంధం చేద్దామనుకున్నాను. అది కాస్తా పారిపోయింది. ఏం చేస్తాను. నీ ఖర్మ బాగున్నట్లు లేదు. మోహిని ఎలాంటి మంత్రవేత్తకూ చిక్కదు. నేనంటే తప్ప ఎవరన్నా దానికి ఖాతరు లేదు. నేను రేపు సాయంత్రం ఊరికి వెళ్లిపోవాలి" బాధ పడ్డాడాయన.

"మళ్లీ వస్తుందా"

"తప్పకుండా వస్తుంది. నిన్ను పీల్చి పిప్పిచేసిగానీ వదల్దు"

"ఎవరినన్నా తోడు తెచ్చుకుని పడుకుంటాను"

"అందరినీ మత్తులో ముంచి నిన్ను ఎత్తుకుపోతుంది. పిచ్చివాడా. అది దొంగ కాదు. దెయ్యం. అసలు శాస్త్రినే గల్లంతు చేస్తుందేమో"

"మరెలా" ఏడుపు గొంతుతో అడిగాడు.

ఆయన మౌనంగా లేచాడు.

"నిన్ను రక్షించడం యిక అసంభవం" అన్నాడు.

"మీరే దిక్కు" గత్యంతరం లేక ఆయన కాళ్లు పట్టుకున్నాడు విజయ్.

ఆయన సంచీలోంచి ఒక వేరు తీశాడు.

"యిది హిమాలయాల్లో అతి కష్టం మీద నా గురువు సాధించారు. దివ్య లతిక అంటారు దీన్ని. యిది దగ్గరుంటే ఎలాంటి భూతమూ దగ్గరకు రాలేదు" అన్నాడు.

"నాకా వేరు యిప్పించండి"

"కుదరదు. పాతికవేలపైన అవుతుంది దీన్ని సాధించటానికి అయే ఖర్చు."

విజయ్ ఒక్క నిమిషం తటపటాయించాడు.

కానీ, తన ప్రాణం ముందు పాతిక వేలెంత.

"మీరు ఇక్కడే ఉండండి రేపు మధ్యాహ్నానికి తెచ్చిస్తాన న్నాడు.

"సరే" అన్నాడాయన.

ఆ రాత్రి ఆయన నిద్రపోతుంటే మోహిని మళ్లీ వచ్చింది.

"రా" అన్నది నవ్వుతూ.

విజయ్ అడ్డంగా తల ఊపాడు.

"రావూ. నిన్నేం చేస్తానో చూడు" మోహిని వికృతంగా నవ్వి భయపెట్టింది.

విజయ్ నవ్వుతూ తన దగ్గరున్న వేరుతో సహా ఆమె దగ్గరికి వెళ్ళాడు.

ఆ వేరు చూస్తూనే కీచుమంటూ అరిచి వెనక్కు తిరిగి పారిపోయింది మోహిని.

నిశ్చింతగా నిద్రపోయాడు విజయ్.

* * * * * *

పాతిక వేలిచ్చి వేరు తీసుకుని దాంతో తాయత్తులు చేయించుకుని తిరుగుతున్నాడు విజయ్.

వేరు భయంతో కాబోలు మోహిని రావటంలేదు.

బతుకు జీవుడా అని హాయిగా తిరుగుతున్నాడు.

యికే ఆడదాని మొహమూ చూడలేదు ఆ తర్వాత.

నెలరోజులు గడిచాక బ్యాంక్ కి ఒక ఉత్తరం వచ్చింది. చించి చదివాడు.

"వెర్రి వెధవా,

ఆడది దొరికితే అలుసు తీసుకునే నీలాంటి వెధవను మోసం చేసి పాతిక వేలు సంపాదించినందుకు సంతోషిస్తున్నాము. దుష్టబుద్ధి, దురాశ, పరస్త్రీ వ్యామోహం కన్నా దెయ్యాలు వేరే లేవని యిప్పటికైనా గ్రహించు. యికపోతే నువ్వు నీరసించి పోవటానికి కారణం నీకు తెలియకుండా ఆహారంలో నేను కలిపిన మందులే. భూత వైద్యుడిగా నీకు పరిచయమైన మనిషి మా ముఠాలోని వాడే. నీ పాతికవేలతో మాకు కొన్నాళ్లు రెస్ట్ దొరుకుతుంది.

"మోహిని"

"మోసం, దగా" గొణుక్కున్నాడు విజయ్.

"ఏంటి గురూ" పక్కనే ఉన్న ఫ్రెండ్ అడిగాడు.

'చెప్పకుంటే సిగ్గుచేటు' అనుకుంటూ "ఏం లేదు గురూ" అని వెర్రి నవ్వు నవ్వాడు విజయ్.

●



# "ఉషశ్రీ" మరిలేరు

రామాయణ, భారతాలను "ఉషశ్రీ" చెపుతుంటే వినడమే లక్షలాది ప్రజలకు యిష్టం. రేడియోలో కొత్తరకంగా మాటల విరుపుద్వారా చిన్న చిన్న వాక్యాల నిర్మాణం ద్వారా అనితరసాధ్యమైన కీర్తి సంపాదించిన "ఉషశ్రీ"గారి రేడియో యితిహాస గ్రంథాలు విస్తారంగా అమ్ముడుపోయాయి. ఆయన కొన్నాళ్లపాటు ప్రత్యేక సభలలో తన వచన భారత రామాయణాలను వినిపిస్తూ తిరగవలసివచ్చింది. రేడియో స్క్రిప్టు రచయితగా, ప్రయోక్తగా విజయవాడ కేంద్రంనుంచి యింత పాప్యులారిటీ సంపాదించిన వారు మరొకరు లేరు. లోగడ నవలలు, కథలు కొన్ని రాసిన శ్రీ "ఉషశ్రీ" రేడియో వ్యవసాయ కార్యక్రమాల నిర్వహణ తరువాత-స్వాతి వీక్లీలో ఆధ్యాత్మిక ధర్మసందేహాలకి సమాధానాలు ఇస్తూ జనరంజన చేశారు. సంస్కృత ఆంధ్ర భాషలలో మంచి ప్రవేశం వున్న "ఉషశ్రీ" (65)ని వూపిరితిత్తుల క్యాన్సర్ బలితీసుకున్నది. అసలు పేరు పురాణపండ సూర్యప్రకాశదీక్షితులు-పురాణపండ రాధాకృష్ణమూర్తి- పురాణపండ రంగనాథ్ లు వీరి తమ్ముళ్లు-భార్య, నలుగురు కుమార్తెలను, మిత్రులను, అభిమానులను దుఃఖ సాగరంలో ముంచి "ఉషశ్రీ" సెప్టెంబరు 7న భౌతిక జీవితానికి "స్వస్తి" పలికారు-వారి కుటుంబ సభ్యులకు ప్రగాఢ సానుభూతి తెలియజేస్తున్నాము.

\- ఎడిటర్

హాస్య నవల

# పట్టు వదలని పతివ్రతలు!

శివల జగన్నాథరావు



"**అ**దిగదిగో నే! చూడెలా పరిగెత్తుతున్నారో?" అంది పంకజం కోపంతో.

"చూద్దాం! వీళ్ళ సంగతేంటో? ఆడదంటే ఏదో అమాయకం బొమ్మను కుంటున్నారు! పంతానికయినా వీళ్ళని మనం వెంటాడాలి! వేధించాలి!" అంది స్వరూప.

ఆ అమ్మాయి చేతిలో పెద్ద పర్సు మాత్రం వుంది. పంకజం, స్వరూప త్వరత్వరగా నడవసాగారటు.

"వాళ్ళు మనని చూసేరంటావా?" అంది పంకజం.

"చూడనీయ్! ఏం భయం? ఇంతదాకా ఒచ్చేకా? ఎలా పారిపోతారు? ఎక్కడికి పోతారు?"

(12)

ఆదో అడ్డుదారి.

"నేరకపోయి ఒచ్చేన్రా నీ పెళ్ళికి!హాయిగా మా వూర్లో నా గదిలో నో, మా ఆఫీసులో నో వుండక!" వాపోయాడు సౌభాగ్యరావు.

"బో లెడ్డబ్బూ వొదిలి పోయింది! శరీర కష్టం! కాఫీ నీళ్ళుకూడా గొంతులో పడలేదు! ప్చ్!గొప్ప శని రోజులు.!"

చంద్రం అతని చెయ్యి గట్టిగా పట్టుకుని లాక్కెళ్తున్నాడు.

(గత సంచిక తరువాయి)

"నా కయితే ఇష్టం లేదనుకో పెళ్ళి! నువ్వెందుకు స్వరూప నొద్దన్నావ్?"

సౌభాగ్యరావు వెదుత్తునే చెప్పాడు, తననా పిల్ల ఎంతగా ఆట పట్టించీ అవమానించిందో!

"ఓహో? అదా సంగతి! అలా అయితే ఒద్దులే! ముందే ఒదిలీడం మంచిది! పెళ్ళయ్యేక ఒదిలీస్తే అంతా మనల్నే తిడ్తారు!"

రైల్వే స్టేషన్ కెళ్ళారు వాళ్ళు.

"ఓ?" చిన్నగా కేకేసింది స్వరూప.

"చూశావుటే, పంకజం? వాళ్ళెంత దేవాంతకులో?! ఏకంగా రైలెక్కేసీ, వూరే వొదిలేసీ పారిపోతున్నారు!! సర్లే! మనం వాళ్ళకి తీసిపోయేంవా?హ!!పద!మనమూ రైలెక్కేద్దాం!"

ఒకళ్ళకి తెలియకుండా ఒకళ్ళు వేరొ కంపార్ట్మెంటులో ఎక్కిపోయారు ఆ జంట స్నేహితులు.

రైలు పెద్ద కూతేసీ వేగం అందుకుంది.

"అమ్మయ్యా! ఇప్పుడు నా ప్రాణం కుదుటపడిందిరా!" అన్నాడు చంద్రం.

"ప్చ్! నేరకపోయీ ఒచ్చేన్రా!" నిట్టూర్చాడు సౌభాగ్యరావు.

"ఛస్! వెధవ విచారించడం నువ్వూ! నా కోసం అయినా వచ్చేవని నేను ఆనందిస్తున్నా తెల్సా? నువ్వు రాబట్టి నేను ధైర్యం చేశానిలా! లేకపోతే నాకు ధైర్యం చెప్పేవాళ్ళు లేక, చచ్చినట్టూ పంకజానికి పుస్తెలు కట్టేవాడిని!"

రైలు బయలుదేరి పోతోందని, టిక్కట్టు కొనడానిక్కూడా టయిములేక వాళ్ళు రైలెక్కేశారు తొందర తొందరగా.

కంపార్ట్మెంటు రద్దీగా వుంది!

ఎక్కడా చోటే లేదు!

సౌభాగ్యరావు కెంతో అలసటగా వుంది.

"సార్! కొంచెం జరుగుతారా? ప్లీజ్!" చోటడిగాడు సౌభాగ్యరావు నిలబడలేక.

ఆయన చాలా ఖచ్చితంగా చెప్పేశాడు:

"నో ప్లీజ్!"

ఇద్దరన్నదమ్ములూ నిలబడే వున్నారలా.

రైలు కుదిపినప్పుడు రాడ్ పట్టుకుని నిలదొక్కుకొంటున్నారు.

చంద్రం జాలి జాలిగా అన్నాడు!

"ఎలారా, సౌభాగ్యం? ఆఫీసుకి నేను వారం రోజులు శలవు పెట్టేనంతే!అంతకంటే మా బాస్ శలవివ్వనన్నాడ్రా!"

"అదేవిట్రా? పెళ్ళికి ఒక్క వారంవా శలవు? మీ బాస్‌కి మనసూ, గుండే, హృదయమూ, వూపిరితిత్తులూ లాంటి వేవీ లేవా?"

"వాడి కూతుర్ని నన్ను పెళ్ళి చేస్కోమన్నాడ్రా!"

"ఎందుకు చేస్కోలేదూ? గుమ్మడికాయ

తప్పిపోను గదా?"

"నా ఖర్మ! ఒరే!! ఆ పిల్ల గుమ్మడి కాయకంటే అధ్వాన్నం!మహాపర్వతాన్ని చూసేవా నువ్వు?"

"ఆఁ! చూసేను, ఫోటోల్లో!సినీమాల్లో!"

"బాస్ కూతురు ఒక మహాపర్వతం! నేనయితే ఒక అణువుని! చిన్నరాయి బెద్ద నావిడ ముందు!!"

"బాబోయ్!"

సౌభాగ్యరావు అలా అంటూ, ఆ వయిపు చూసి వులిక్కిపడ్డాడు.

ఆ సీట్లో చాలా లావుగా వున్న ఒకమ్మాయి కూచుని వుంది.

ఆ అమ్మాయి వీళ్ళ మాటలు వింటోందిలా వుంది.

సౌభాగ్యరావుని, చంద్రాన్నీ మింగేసేలా చూడసాగింది.

"మిస్టర్! ఎలా వుంది ఒళ్ళు? నన్ను ఇండైరెక్టుగా ఎగతాళి చేస్తున్నారా?" అనీ, ఆ పక్కనున్న ముసలాయనతో ఏదో చెప్పింది. మరో పక్కన కునికిపాట్లు పడ్తోన్న శాండోలాంటి వాడితో ఏదో చెప్పిందంతే.

శాండో రఁయ్యీమంటూ వచ్చేశాడు చంద్రం, సౌభాగ్యరావుల మీదికి.

"చచ్చేం!" అనుకున్నారు వాళ్ళిద్దరూ.

శాండో చంద్రం చొక్కా పట్టుకున్నాడు. సౌభాగ్యరావుని మెడపట్టుకున్నాడు మరో చేత్తో.

"ఏటిబే! ఎట్టా వుంది ఒళ్ళు? ఒళ్ళు తిమ్మిరెక్కిందా?

ఆ పరిస్థితే మహా చెడ్డది!!

అప్పుడింక ఏం మాట్లాడినా చెడ్డే అవుతుంది గాని అది మంచి అవదు!!

కనక వూరుకోడమే నయం అనుకున్నారు అన్నదమ్ములు.

ఆ శాండోగాడికో నమస్కారం



పెట్టేసేరు.

ఒక్క గుంజు గుంజీ వొదిలాడు వాడు!

"ఈ వెధవ రైలు నేరకపోయి ఎక్కేంరా!" అన్నాడు సౌభాగ్యరావు.

"రైలెక్కకపోతే ఎలారా? వూర్లో వుంటే పట్టుబడిపోమూ వాళ్ళకి?"

"చాల్లే! వెధవ పిరికితనమూ నువ్వూను! ఇన్నేళ్ళొచ్చేయ్! వుద్యోగం చేస్తున్నావ్! ఎదిరించలేవూ? పెళ్ళా? మరోటా? జీవితాంతం సమస్య గదా?"

టక్కున రాడ్ తలకి తగిలింది.

"అబ్బ! చచ్చాను! చచ్చినా బావుండేది!"

చస్తే ఇంక బావుండడం ఏవిటి? నీ మొహం!" రైలాగింది ఏదో స్టేషన్లో!

వేగిరం బయల్దేరుతుందని చూశారిద్దరూ.

రిస్టువాచీలో టైము చూశాడు చంద్రం.

బయల్దేరి ముప్పావు గంట పైనే అవుతోంది! అంటే చాలా దూరమే వొచ్చేశామన్న మాట! ఫర్వాలేదు! ఇంత దూరం వాళ్ళ మొహం వాళ్ళేం వొస్తార్లే?

"నీ పిరికితనమే నిన్నింత దూరం తీసుకువచ్చింది! అన్నాడు చంద్రం. సౌభాగ్యరావుకి పౌరుషం వచ్చింది.

"అయితే నేను రైలు దిగి పోతున్నా ఒరే! వెనక్కెళ్ళి పోతున్నా!! పోతున్నా!" అంటూ, రైలు దిగిపోయాడు గబగబా.

చంద్రం కూడా దిగిపోయాడు.

"నువ్వెందుకురా దిగావ్?"

పలకలేదు చంద్రం.

ఆ వయిపు చూశాడంతే. కెవ్వుమన్నాడు.

"ఒరే! ఒరే! అలా చూడ్రా బాబూ! నా కళ్ళు అలా పని చేస్తున్నాయా? లేక నీ కళ్ళకీ వాళ్ళువుపిస్తున్నారా?"

సౌభాగ్యరావు కెవ్వుమన్నాడటు చూసి.

మరో పెట్టిలోంచీ బయటికి తొంగి చూసి, దిగి పోయేరు పంకజం, స్వరూపా!!

"ఇందాకటిది కాదు చావంటే!! ఇప్పుడే అసలైన చావు సంప్రాప్తం అయింది మనకి!!" అన్నాడు సౌభాగ్యరావు.

వాళ్ళిద్దరూ గబగబా రైలెక్కబోయీ, ఆలోచించుకున్నారు. రైలెక్కితే వాళ్ళు ఎక్కిపోతారు!

అంటే చిక్కిపోయినట్టే!

ఒక్కటే మార్గం!

త్వరత్వరగా నడవసాగారు వూర్లోకి.

నడుస్తూ చంద్రం వెనక్కి చూశాడు.

బాబోయ్! మిరపకాయ చిటపటలాడూ- గుమ్మడి కాయ గునగున నడుస్తూ తమనే అనుసరిస్తున్నారిప్పుడెలా నాయనోయ్! పరాత్పరా!

"పెళ్ళంటే నూరేళ్ళ పంటా!..."

దోవలో ఒక 'అంబరిల్లా విలాస్' లోంచి రేడియో పాట వినవస్తోంది!

## 'దిల్'లో మరో పాట

'దిల్' చిత్రం విజయవంతం అవుతున్నప్పటికీ అది ఆ నిర్మాత అశోక్ తకేరియాకు సంతృప్తి కల్గించలేదట. అందుకే కాబోలు మరో పాటను ఈ చిత్రంలో కలిపేందుకు ప్రయత్నిస్తున్నాడు. దానికిగాను షూటింగ్ కార్యక్రమాల్లో నిమగ్నమయ్యాడట. మరి ఈ పాట కూడా సినిమాలో జోడించిన తర్వాత ప్రేక్షకుల రియాక్షన్ ఎలా వుంటుందో వేచి చూడాలంటున్నారు.

"... నూరేళ్ళ మంటరా నాయినా" అన్నాడు సౌభాగ్యరావు.

"తాళి కట్టకుండానే ఎగతాళి అయిపోయేడు తను ఆవిడకి! కడితే ఇంకేమయినా వుందా?!"

అంబరిల్లా విలాస్ లోకి దూరిపోయారిద్దరూ.

"ఏం కావాలి సర్?" మొహమ్మీది కొచ్చీ అడిగాడు సర్వరు.

"ఆకలి దంచేస్తోందనుకో! అయినా అది తర్వాత సంగతి! ముందు మాకు రక్షణ కావాలి బాబూ!"

"ఏంటి సర్? రక్షణా?"

"అవున్నాయినా?"

"అదేంటో అది మా హోటల్లో లేదుసర్! అసలా వంటకమే నేనింతదాకా యిన్నేదు సర్!"

"నీ పిండాకూడూ! నా శ్రాద్ధమూను!పోనీ ఈ పేర్లు విన్నావా?" మెల్లిగా చంద్రం చెవిలో గొణిగాడు సౌభాగ్యరావు కోపంగా.

"నాకు చెబుతావేం? వాడికి చెప్పు!" చిరాకు పడ్డాడు చంద్రం.

"వాడితో గట్టిగా అంటే రక్షణకాదు!భక్షణ అయిపోతాం మనం!"

"ఇడ్లీ, పూరీ, వడా, పూతప్పమ్!"

చెవులదిరి పోయేలా అరిచాడు సర్వర్.

చంద్రం "ఒరే! వాళ్ళు ఇక్కడికే వొచ్చేస్తున్నార్రోయ్!" అని చెప్పాడు. ఇద్దరూ హోటలు లోపలికి వెళ్ళిపోయి, వంటగదిలో దాక్కున్నారు.

"ఏయ్ ఏంయ్! ఏటిసార్ ఈ పనీ? ఎవరు మీరెవరసలు?" హోటలు యజమాని గదమాయించాడు.

చంద్రం అతనికి మెల్లిగా చెప్పాడు!"ప్లీజ్! కాస్సేపే ఇక్కడుంటాం! ఆ ఆడాళ్లిద్దరూ వస్తున్నారిటే! మీరు వాళ్ళతో ఇక్కడి కెవరూ రాలేదని చెప్పేయండి!"

"ఏం? ఎందుకలా చెప్పాలి?" అరిచాడు అతగాడు కోపంగా.

"మీరు దొంగల్లా వున్నారేముందిక్కణ్ణుంచీ వెళ్తారా? లేదా?"

అంతలో స్వరూప, పంకజం హోటల్లోకి వచ్చారు.

"ఇద్దరు మగవాళ్ళిలా వచ్చేరు గదా?" అడిగింది స్వరూప సర్వర్ని.

"అయ్ వొచ్చేరదిగో! లోన...."

హోటల్లో పలహారాలు చేస్తున్న వాళ్ళు విడ్డూరంగా చూడసాగారు వాళ్ళని.

పంకజం వురిమి వురిమి చూసింది లోపలికి.

హోటలు యజమాని చంద్రాన్నీ, సౌభాగ్యరావునీ బయటికి తీసుకు వచ్చాడు చేతులు పట్టుకుని.

"దేశంలో ఎక్కడ చూసినా అనేక రకాల ఘోరాలు! రేడియో, పేపరు, టీవీలో

ఎక్కడ చూసినా!" అన్నాడు ఒకతను ఆవేశంగా.

"ఎవరమ్మా? ఏటయింది?" అడిగాడు హోటలతను.

"వాళ్ళు మమ్మల్ని వెన్నాడుతున్నారయ్యా!" అన్నాడు సౌభాగ్యరావు చిరాగ్గా.

"ఆడపిల్లలు! అయినింటోళ్ళలా వున్నారే? వూరికే ఎందుకయ్యా మిమ్మల్ని వెంటాడ్తారు?" అనుమానంగా అన్నాడు హోటలు యజమాని.

"ఏమ్మా? ఎవరీళ్ళు? చెప్పండి? మీకూ ఈళ్ళకీ ఏటి సంబంధం? లేక దొంగలా వీళ్ళు?"

పంకజం వెంటనే, "మా భర్తలండీ!" అని చెప్పింది.

"ఆఁ!" అందరూ ఆశ్చర్యంగా చూశారు.

"భర్తలా? అయితే ఇదేం పనిలా పారావడం?"

"నో! నో! ఎంతమాత్రం కాదుసార్! మేం వాళ్ళకి భర్తలం కాము!" ఆక్రోశించాడు చంద్రం. సౌభాగ్యరావు కోపంగా, "వాళ్ళ మాటలు నమ్మకండి సార్!" అన్నాడు.

"పోనీ నమ్మంసరే! అయితే మీ రెందుకు వాళ్ళకి భయపడ్డం?" అడిగాడో కాయన.

"భర్తలు కాకపోతే ఎందుకు భయపడాలీ?" అన్నాడు సర్వరు.

స్వరూప రౌద్రంగా చూస్తూ, "ఛీ ఛీ! న్యూసెన్స్! మా పరువు వీధిన పడేస్తున్నారు! పారిపోయి వచ్చింది. చాలక! ఏవయినా వుక్రోషాలు వుంటే, ఇళ్ళల్లో చూస్కోవాలి! పారిపోవడం ఏవిటిలా?రండి! పదండి! ఇళ్ళదగ్గర చూస్కుందాం!" అంది.

"ఏంటి చూస్కోడం? మేం రాము! మాకూ మీకూ సంబంధం లేదు!" అన్నాడు చంద్రం విసురుగా.

"సంబంధం లేదంటే మేం వూర్కుంటామా? కట్టుకున్న పెళ్ళాల్ని వదిలేసీ పారిపోతే, వాళ్ళేవయిపోతారయ్యా? మీరే చెప్పండి!"

చంద్రం, సౌభాగ్యరావు ఆ మాటలకి విస్తుపోయారు.

'ఎంత ఘోరం? ఎంతకి తెగించేరు వీళ్ళు' అనుకున్నారు.

"మేం వాళ్ళకి తాళి కట్టలేదు!కావలిస్తే చూపించ మనండి!" అన్నాడు సౌభాగ్యరావు వుక్రోషంతో.

పంకజం గఁయ్యిమంటూ, "మాతో కయ్యాలాడీ, మా పుస్తెలు తెంపేసీ పారేసీ, పారిపోయి వచ్చేసేరండీ!చూడండి! చేసిందంతా చేసీ, ఎలా అబద్ధాలాడుతున్నారో?" అంది.

నలుగురూ చంద్రాన్నీ, సౌభాగ్యరావునీ చుట్టేసారు.

"మీ భార్యలతో ఎళ్తారా? లేదా?"

"ఎముకలిరిచీగలం! జాగర్త!"



చంద్రం, సౌభాగ్యరావు మొహాలు చూసుకున్నారు.

ఎముకలు విరిగిపోతే అతకడం చాలా కష్టం!!

ఇప్పటికీ గండం గడవాలంటే, నోర్మూసుకుని, వాళ్ళతో వెళ్ళాలి!!

నెమ్మదిగా, బుద్ధిగా నడిచారు వాళ్ళతో.

రోడ్డు మీద వెడుతోంటే, "ఎలావుందే మనతడాఖా?" అంది స్వరూప పంకజంతో.

"పదముందు!రైలుకి!" అంది.

స్వరూప మగాళ్ళిద్దర్నీ కంట కనిబెడ్తోంది, సరిగ్గా వస్తున్నారా? లేదా? అని.

తలలొంచుకునీ కొంతదూరం నడిచారు.

"రైలుస్టేషనిటు! అటు ఎక్కడికి? ఇలారండి!" అంది పంకజం.

సౌభాగ్యరావు చంద్రాన్ని చూశాడు. అతను బుద్ధిగా నడుస్తున్నాడు! తిట్టుకున్నాడు. వాడు వాళ్ళ మాట వింటేవిననీ! శుభలేఖలు కూడా అచ్చేసీ, అందరికీ పంచేసే వరకూ, పీటమీదిక్కూడా ఎక్కి కూచునేదాకా తెచ్చేసుకున్న వెధవ అనుభవించక, ఏం చేస్తాడు?

తనకేం ఖర్మ? తనింకా మాటల్లోనే వున్నాడు!

తనని వాళ్ళు సాధించడానికి హక్కులేదు!

"హక్కు లేదు!" అన్నాడు ఆవేశాన్నాపుకోలేక గట్టిగా.

స్వరూప ఇటొచ్చింది. "ఏవిటంటున్నారు? ఏం మళ్ళీ ఏదో ప్లానేస్తున్నారా?" అంది కోపంగా.

"హక్కులేదు!" అన్నాడు సౌభాగ్యరావు.

"నన్ను ఎవరూ ఏమీ అనడానికి, నిందించడానికి హక్కు లేదు! నేనేమీ నిన్ను అంగీకరించలేదు! శుభలేఖలు వెయ్యలేదు! అదిగో! పీట ఎక్కేదాకా వచ్చీ పీకమీదికి తెచ్చుకున్నాడు! వాణ్ణి పట్టుకు పోండి! కావలిస్తే"

"కావలిస్తే నా? ఎవరికి కావలిస్తే?"

"మీక్కావలిస్తే! ఇద్దరూ వాణ్ణి పట్టుకుపోండి!"

"ఎలావుంది ఒళ్ళు? మాటలు జాగర్తగా రానీండి! ఇద్దరికీ అతనొక్కడెందుకు? అతను పంకజం మొగుడు! నాకు కాదు!"

"అదేమో నాకు తెలీదు! నేన్రాను!నువ్వు పోరావాళ్ళతో!"

"చంద్రం బిక్కమొహం పెట్టాడు.

"ఇంతదాకా తెచ్చీ నన్ను ముంచేస్తావేవిట్రా? సౌభాగ్యం?" అని వాపోయేడు.

"ఏ భాగ్యం లేదు! నన్ను నా ఖర్మాని కొదిలీస్తే అదే నాకు మహా భాగ్యం!!"

"చంపుతా గాడిదా! నన్ను అంతదాకా

తీసుకొచ్చిన వెధవ్వి! ఒదిలేస్తే చంపుతాను!" అన్నాడు చంద్రం మెల్లిగా.

అంతలో ఏదో వూరేగింపు వచ్చేసిందా రోడ్డు మీదికి. ఇదే సందుఅని చంద్రం, సౌభాగ్యరావు వాళ్ళల్లో కల్సిపోయారు. పంకజం, స్వరూప వెతికారు వాళ్ళని.

వాళ్ళు కనిపించడం లేదు.

ఏరి? ఏమయ్యేరు చెప్మా?

చాలా పెద్ద వూరేగింపు అది.

పంకజం, స్వరూప కాస్సేపు నిలిచిపోయారు, కదలడానికి వీలు అవక.

ఆ సందడి తగ్గింది!

గబగబ అటు ఇటు చూశారు.

★ ★ ★ ★ ★ ★

"ఎవరు మీరు? ఏం కావాలి?" అడిగాడాయన.

ఆయన నోట్లో పెద్ద చుట్ట వుంది. వెడల్పాటి ముఖం మీద బుంగమీసాలు ప్రత్యేక అలంకారంలా వున్నయ్.

రెండంతస్తుల మేడ, వరండాలో, వాలు కుర్చీలో కూర్చుని, వీధివయిపు చూస్తున్న ఆయన, వీధిగేటు తోస్కుని ఇద్దరు వయసులో వున్న కుర్రాళ్ళు రాగానే, అడిగాడెవరని.

"మేం పనులకోసం వచ్చేమండీ!" అని చెప్పాడు ఇద్దర్లో ఒకడు.

"ఏం పని?"

"జీతానికి చేసేపని ఏదయినా...."

"ఈ వూరా? పైవూరామీది?"

"పైవూర్నించీ ఒచ్చేం..."

వాళ్ళిద్దరూ ఆయనతో మాట్లాడుతూ, మధ్యమధ్య వీధి వయిపు చూడటం చూసి, "ఏవిటలా చూస్తున్నారు?" అడిగాడాయన.

"ఏంలేదండీ!" అని సర్దుకున్నారు వాళ్ళిద్దరు.

"నేను భూస్వామిని! నాదగ్గర చేసేపని ఏముంటుంది మీకు? మీరు చూస్తే చదువుకున్న వాళ్ళలా వున్నారు...." అన్నాడాయన.

గేటుదగ్గర చప్పుడయింది.

వులిక్కిపడి చూశారటు.

పంకజం, స్వరూప!!!

చంద్రం సౌభాగ్యరావు వూపిరి బిగబట్టారు.

"ఈ అమ్మవార్లనించీ తప్పించుకోవడం మనవల్లకాదు!" అన్నాడు సౌభాగ్యరావు చంద్రంతో

"ఎవరమ్మా మీరూ? ఏం కావాలి?" అడిగాడు మీసాలాయన.

"వాళ్ళు కావాలండీ!" చెప్పింది స్వరూప.

"మతిస్థిమితం లేక మా మగవాళ్ళిలా పారిపోయి వచ్చేసేరండీ! ఎక్కడికి పోతారో, ఏమయిపోతారోనని మేం వాళ్ళ వెనక తిరుగుతున్నాం! అంతా మా ఖర్మనుకోండి బాబాయ్‌గారు!"

"హారి! మీ అబద్దాలు కూలిపోను! మీ నోటికి తాళం లేదు! మీ సాహసానికి అంతులేదుసుమా!" అన్నాడు సౌభాగ్యరావు మెల్లిగా చంద్రం దగ్గర వాపోతూ.

"అలాగా?

అయ్యయ్యో!పాపం!మతిస్థిమితం లేకపోతే చాలా చికాకే!" అన్నాడు మీసాలాయన.

మీసాలాయన భార్య వచ్చి, "పిచ్చాసుపత్రిలో చేర్పలేదా?" అనడిగింది.

"చేర్పుదామనుకుంటే పారిపోయి వచ్చేసేరండీ!" అంది పంకజం.

స్వరూపకి లోపల్నించీ నవ్వొస్తోంటే బలవంతాన ఆపుకుంది.

పంకజంకీ నవ్వొచ్చి ఎలాగో బిగబట్టి వాళ్ళని చూసింది.

ఆముదం తాగినట్టు వున్నాయి వాళ్ళిద్దరి మొహాలు!!

"అయితే వూర్నించీ వూరిక్కూడా పడీ వచ్చేరన్నమాట?! పాపం!!"

"ఏం చేస్తారు మరి? కట్టుకున్నాక తప్పుతుందా? పిచ్చాళ్ళని ఒదిలేస్తారా? తీసుకువెళ్ళండమ్మా జాగర్తగ!"

"హేయ్! నేనురాను! నాకూ నీకూ..." సౌభాగ్యరావు వుక్రోషంతో కసరబోతే, చంద్రం నెమ్మదిగ, "వూర్కోరా!బాబూ!మనరోజులు బాగోలేవు!ప్రస్తుతం మనం పిచ్చి వెధవలం అయిపోయీ వున్నాం! మనం ఏం వాగినా అదంతా పిచ్చే అవుతుంది!..." అని చెబితే, సౌభాగ్యరావు వూరుకున్నాడు.

స్వరూప సౌభాగ్యరావుని,

పంకజం చంద్రాన్నీ చేతులు గట్టిగా వుడుంలా పట్టుకుని, నడిపించుకు గేటుదాకా వెళ్ళి "వెళ్ళొస్తాం బాబాయ్ గారు!" అని చెప్పారు.

రోడ్డుమీది కెళ్ళాక, "వదలండి వదలండి!" అన్నారు చంద్రం, సౌభాగ్యరావు.

"వుహు! వదలడానికా ఇంతదూరమూ వచ్చింది?" అంది పంకజం.

"ఏవిటి? ఏదో పెళ్ళయిపోయినట్టే దబాయిస్తున్నావ్?" అన్నాడు చంద్రం కోపంగా.

పంకజం వెంటనే "నా పర్సులో శుభలేఖ మాటేవిటిసారూ? పీట కూడా



ఎక్కి, ఇప్పుడు దులిపేసుకుందామను కుంటున్నారా? కుదర్దు!! పదండి ఇంటికి!'' అంది.

"ఆకలేస్తోందే, పంకజం" అంది స్వరూప.

సౌభాగ్యరావుకి "ఆకలి" అనే మాట వింటే, అప్పుడు తెల్సింది ఆకలి.

"అదిగో! మంచి హోటలు! ఫ్యామిలీ రూం కెళదాం!"

మొగవాళ్ళని చేతులు పట్టుకు వెళ్తున్న ఆడవాళ్ళని జనం విడ్డూరంగా చూశారు.

హోటలు "ఆహ్వానం"లోకి వెళ్ళారు వాళ్ళు.

అప్పుడు టైము. సాయంత్రం అరవు తోంది!

"ఆహ్వానం" కళకళలాడ్తోంది!!

ఫ్యామిలీ రూంలోకి వెళ్ళి కూచున్నారు.

"పర్సు పెద్దదే తీసుకు వచ్చేం! బిల్లు అంతా మనమే ఇచ్చుకోవాలేమోనే" అంది స్వరూప మెల్లిగ.

"బిల్లు కూడానా? కట్నం పదివేలు చాలక! అంత డబ్బు పుచ్చుకున్నానీ ఏమీ సంబంధం లేదుట చూడవే! ఎంత అన్యాయం!?" అంది పంకజం.

సౌభాగ్యరావు వెంటనే అన్నాడు! "నా కేమీ పైసా ఇవ్వలేదు!

అయితే నన్నెందుకు ఇలా అవమానాల పాలు చేస్తున్నారు?, చా లా అన్యాయం ఇది!"

స్వరూప నవ్వాలాగో ఆపుకుంది.

"మీ అన్నదమ్ముడిని. రెచ్చగొట్టి నందుకు మీ కీ శిక్ష తప్పదు!!అయినా నాకేం తక్కువని? నేను తగనామీకు?''

"తగవు!"

"హు! ఎలా తగనో చూస్తాను"

"పెళ్ళంటే పందెం కాదు స్వరూపా!! ఆటకాదు!"

"నన్ను పెళ్ళింట్లో అవమానించడం బాగుందా మీకు?"

"నేనేం అవమానించేను?"

"మొగాడికి మొగుడినా నేను? మొగాడికి మొగుడు గట్రా అలాంటి మాటలు బాగున్నాయా? మా ఫ్రెండ్సు ఏదో సర్దాకి హాస్యం చేస్తే అదంతా సీరియస్‌గా తీస్కునీ పుడికిపోయేరు!



## మీనాక్షి ప్రేమలో రాజ్‌కుమార్!

మీనాక్షి శేషాద్రి ప్రేమలో పడ్డానంటు న్నాడు రాజ్‌కుమార్. ఈ రాజ్‌కుమార్ పాత హీరో అనుకునేరు. కాదు. 'ఘాయల్' చిత్ర దర్శకుడు రాజ్‌కుమార్ సంతోషి. తన ప్రేమకు గ్రీన్ సిగ్నల్ యిచ్చిందని ఆమె మౌనమే అర్థాంగీకారంగా భావి స్తున్న రాజ్‌కుమార్ చెప్తున్నాడు. తన పేరు చెప్తే చాలు. మీనాక్షి ముసి ముసిగా నవ్వుతుందట. నవ్వినంత మాత్రాన ప్రేమలో పడిపోయిందని అనుకుంటున్న రాజ్‌కుమార్‌ని ఏమనాలో? ష్...!

నేనేదో తమ పాలిట విలనులాగా భావించుకున్నారు!"

"నిజంగా నా పాలిట విలనే నువ్వు!" కసిగా అన్నాడు సౌభాగ్యరావు.

భోజనాలు వచ్చేయి.

అవురావురని వున్నవాళ్ళు ప్లేట్లమీద ప్రతాపాన్ని చూపెంచారు.

"రెండ్రోజులు!" అంది పంకజం.

"ఏమిటి?" అడిగింది స్వరూప.

"రెండ్రోజులయ్యి నాకు సరిగ్గా భోజనం లేదు! పెళ్ళి హడావుడి కొంతా! ఈయన హడావుడి కొంతా!"

"నిన్ను పెళ్ళి చేసుకుంటే జీవితాంతం నేను అవమానాలు పొందాలి అందర్లోనూ!" అన్నాడు చంద్రం.

"ఏ అవమానాలు? స్వామీ?"

"నీ పర్సనాల్టీకీ, నా పర్సనాల్టీకి సరిపడదని అంతా రకరకాల కామెంట్స్ చేశారు అక్కడ! విన్లేదా?"

"ఓహో! ముందే ఈ అభిప్రాయం చెప్పొచ్చుగా?"

"అప్పు డెవరూ నా దగ్గరన్లేదు..."

"చాల్లెండి! సిల్లీగా వుంది మీ అబ్జెక్షను!! వింటే నవ్వుతా రెవరైనా!" అంది స్వరూప.

"అదిగో! నవ్వుతారంట నను ఒప్పుకోడం లేదు! నా బతుకంతా నవ్వుల పాలవడం నా కిష్టంలేదు..."

"అబ్బా! బతుకంతా ఇలాగ పిచ్చాసుపత్రి పాలవడమా? ఇది అవమానంకాదా?"

చంద్రం నోటికి తాళం పడింది.

"లేద్దామా? రైలు సిద్ధంగా వుందో లేదో?" అంది స్వరూప

"సౌభాగ్యరావు హోటలు వెనుక వయిపు నడిచాడు.

"అటెక్కడికి స్వామీ?" అంది స్వరూప.

అతను విసుగ్గా చిటికెనవేలు చూపెంచేడు, ఎవరూ చూడకుండా.

ఆ హోటలు వెనుకవయిపు వుంది టాయిలెట్. దానిలో కెళ్ళి ఆలోచించాడు సౌభాగ్యరావు. ఎలా అక్కడనించీ పారిపోవడం?

చంద్రం అటుగా వెళ్తుంటే పంకజం అంది! "ఏదో ప్లానులో వున్నట్టున్నారే వీళ్ళు?"

"మీరెందుకు?" అడిగిందతడిని.

"వాడెందుకో నేనూ అందుకే"



# అమితాబ్, మాధురిలకు ఉత్తమ అవార్డులు



1989వ సంవత్సరానికి ఉత్తమ నటీ నటులుగా అమితాబ్‌బచ్చన్, మాధురీదీక్షిత్‌లు ఎన్నికయ్యారు.

పశ్చిమ బెంగాల్ జర్నలిస్టుల సంఘం 'బిషారి' హిందీ చలన చిత్రాలకు అవార్డులను ప్రకటించింది

'మై ఆజాద్‌హూ' చిత్రంలో నటించిన అమితాబ్ ఉత్తమ నటుడిగాను, రామ్‌లఖన్ లో నటించిన మాధురీదీక్షిత్ ఉత్తమ నటిగాను ఎంపికయ్యారు మీరానాయర్ ఉత్తమ దర్శకురాలిగా లక్ష్మీకాంత్ ప్యారేలాల్ (రామ్‌లఖన్) ఉత్తమ సంగీత దర్శకుడిగా అవార్డులు పొందారు

సలాంబాంబే ఉత్తమ చిత్రంగా ఎన్నికైంది

## పట్టువదలని పతివ్రతలు

"ఆయనకి శుభలేఖ లేదు! మీకుంది నా పర్సులో! నన్నొదిలి వెళ్ళడానికి వీల్లేదు!!" పంకజం చంద్రం చెయ్యి పట్టుకుని చిన్నగా చెప్పింది.

"ఓహో! నా మొగుడినయితే నేను వదిలేయొచ్చన్న మాట? అబ్బా! నీకో రూలు నాకో రూలూనా?" అంది స్వరూప.

సౌభాగ్యరావు టాయిలెట్‌లోంచీ ఆ పక్కగా వెళ్ళాడు. అక్కడనించీ మరో తోవ కన్పించిందా వయిపు రోడ్డు మీదికి! అది చిన్న గతుకుల దారి! ఇళ్ళేవో పాతవి కొట్టేసి వున్నాయి! పెరటి తోవలు ఇలాగే వుంటాయి మరి! అనుకున్నాడు. హోటలు పెరట్లోంచీ గబగబా నడవసాగాడతను.

దబదబా అడుగులు వేస్తూ, పరుగులు పరుగుల్తో నడవసాగాడు సౌభాగ్యరావు. హోటలు వాళ్ళు తనని చూడలేదు అదృష్టం!

వుండుండీ తలతిప్పి చూస్తున్నాడు. వాళ్ళుగానీ ఇటు వస్తున్నారేమోనని కనుచూపు మేరలో వాళ్ళు కన్పించలేదు! ఆడాళ్ళు రావడం లేదు!

అమ్మయ్య! ఫర్వా లేదు!

అయితే, ఇప్పుడు తనేం చెయ్యాలి?

ఆలోచించాడు.

వూరికెళ్ళిపోవాలి! అవునంతే!!

తనుద్యోగం చేస్తున్న వూరికి!! తన నివాసానికి! తన ఆనందధామానికి! తన సామ్రాజ్యానికి!!

రైలెక్కాలి! తప్పదు గురుడా! అనుకున్నాడు.

రైలు కాకుండా, మరేదో వాహనం పట్టుకునీ వెళ్ళడానికి వీలులేదు తన వూరికి!!!

వెనక్కి చూడకుండా స్టేషను వయిపు నడవసాగాడు సౌభాగ్యరావు గబగబ.

బుంగ మీసాలాయన గబగబా వచ్చి సౌభాగ్యరావు చెయ్యి పుచ్చుకున్నాడు.

సౌభాగ్యరావు ఆయన చెయ్యిని ఒక్క గిల్లు గిల్లి చెయ్యి వదిలించుకుని వెనక్కి చూడకుండా బాణంలా దూసుకుపోసాగాడు.

(ఇంకా వుంది)



ఇంటింటి పత్రిక: "ఇంతుల" పత్రిక

కులాల కురుక్షేత్రం మీద రావి నూతల సువర్నాకన్నన్ వ్రాసిన కత్తి "బల్లకట్టు"!

క్రైమ్ కథల జోరులో కొట్టుకుపోతున్న పాఠకులకు ప్రగతిబాట మార్గదర్శకం

చూపే సమాజ కథ!

**అంతేగాక శీర్షికలు!**

భలే పిల్లాయి, ఇల్లాలితనం ఒక ఉద్యోగం లాంటిదా?, పిన్నారి పిలిపి పనులు, పాకశాస్త్రం, స్త్రీలకు కాలేజీల్లో సీట్ల కోటా, నేనిలా అనుకుంటున్నాను, పెళ్లికి లాంఛనాలు అవసరమా!, మహిళా వికాసం- ఇలా ఎన్నో... అనేకం చేత అర్థం

ఇది అందరికీ అర్థం యిది!



రవుతామని స్వంత పూచీకత్తు సంతకం చేసిన తర్వాత వాళ్లని విడిచిపెట్టారు. మేజిస్ట్రేటు వారంటుతో కోర్టుకు హాజ రవటం, ఎంత సిగ్గుచేటు! అవమాన భారంతో వాళ్లు ఆఫీసుకి చేరారు.

## 2

తర్వాత చాలా కథ జరిగింది.

సూపరింటెండెంటు జిల్లా కోర్టులో పిటిషను పెట్టాడు. తాను మొదటి తరగతి గెజిటెడ్ అధికారిననీ, ప్రభుత్వంవారి అనుమతి లేనిదే తనమీద పోలీసు కేసు పెట్టటానికి లేదనీ..

జిల్లా జడ్జిగారు సూపరింటెండెంటు గారి స్నేహితుడవటం మూలాన పిటిషన్‌లో పాయింటు వుంది కనుక ఆయన పిటీషను గెలిచింది. ప్రభుత్వం వారి నుంచి పోలీసు వారు అనుమతి పొందేటంతవరకు ఆయన పేరు దోషుల లిస్టు నుంచి తొలగించాలి అంటూ ఆయన ఆర్డరు జారీ చేసారు. ప్రభుత్వం నుంచి పోలీసులకు అనుమతి ఎప్పుడు వస్తుంది?

కాగా ఆయన పేరు ఛార్జిషీటు నుంచి తొలగించబడింది. పోతే మిగిలినవాళ్లు సెక్రటరీ సూర్యం. అకౌంటెంటు తంగవేలు, యు.డి.సి. భాస్కరం.

# విడిపోయిన మబ్బులు

వాళ్లు ఏ పాప మెరుగరు. అయినా వాళ్లచుట్టూ కేసు బిగుసుకొని, వాళ్లు కోర్టుచుట్టూ ప్రతి వాయిదాకు తిరగటం తప్పలేదు.

ఈ లోగా సూపరింటెండెంటు భయంకరంగారిని ప్రభుత్వం శ్రీకాకుళానికి బదిలీ చేసింది. ఆయన తన క్రింది సిబ్బందిని పట్టించుకోకుండా రిలీవ్ అయి, శ్రీకాకుళం వెళ్లి, ఆరు నెలల్లో అక్కడే రిటైరు అయినాడు. వీళ్లమొఖం కూడా చూడలేదు.

సూర్యానికి యింకా రెండు సంవత్సరాల సర్వీసు వుంది. ఆయన దరఖాస్తుని మన్నించి డైరెక్టరు ఆయన కుటుంబం వున్నవూరి ఆస్పత్రికే బదిలీ చేసాడు. అయినా కోర్టు పీడవదలలేదు.

లాయర్ల కథనం- అడమేజిస్ట్రేటు చాలా నిర్దయురాలనీ, ఏ మాత్రం కేసు రుజువయినా ముద్దాయిలకు శిక్ష విధిస్తాందనీ.. అలా శిక్ష పడితే ఉద్యోగం వూడుతుంది. వచ్చే జీతమూ, పెన్షనూ రాదు. తన పిల్లలు ఏమయిపోతారు" ఇదీ సూర్యం భయం!

తంగవేలుకు ఉద్యోగం వూడుతుందని భయం..!!

భాస్కరానికి వుద్యోగం ఊడినా పర్వాలేదుగానీ శిక్ష పడితే వూళ్లో పరువు పోతుందని భయం!!!

పుల్లయ్యకు సాక్ష్యం బలంగా ఉంది. నల్గురు రిటైర్డు పోలీసులు సాక్ష్యమున్నారు. దొంగ మెడికల్ సర్టిఫికెట్టు వుంది.

ఇంక లాభం లేదని భాస్కరం, పుల్లయ్య తో రాజీ బేరాలు సాగించాడు మధ్యవర్తుల ద్వారా.

అసలు సంగతి....భయంకరంగారు తాను వెళ్లేలోగా, తాసీల్దారుద్వారా నోటీసు యిప్పించి, పుల్లయ్యను ప్రభుత్వ క్వార్టర్సు ఖాళీ చేయించిగాని వెళ్లలేదు. ఆయన తాను అనుకొన్న పని నెరవేర్చుకొన్నాడు.

పోతే ఏమీ తెలియని ముగ్గురు ముద్దాయిలపట్ల కేసునడుస్తున్నది.

ఆస్పత్రిలో క్రొత్త సూపరింటెండెంటు భూషణంగారూ, క్రొత్త సెక్రటరీ రాజారావు గారూ వచ్చారు. ఎంతదబ్బి

# వీక్లీ పోస్ట్

(4 వ పేజీ తరువాయి)

యస్వీ

శ్రీ సిద్ధి వినాయకుడి ముఖచిత్రం అత్యంతాకర్షణీయంగా వుంది! చిత్రకారుడు శ్రీ కాశీకి అభినందనలు! విఘ్నమూర్తి విశేష రూపాలు శీర్షికన అందించిన వ్యాసం, చిత్రాలు, ఫోటోలు సూపర్బ్‌గా వుంది, ఇంతవరకూ మాకు తెలియని ఎన్నో విషయాలని విఘ్నేశ్వరుడి గురించి తెలిపినందుకు శ్రీ భాగవతుల సుబ్రహ్మణ్యంకి నా అభినందనలు తెలియజేస్తున్నాను. యశశ్వీ రంగారావు తొలి అగ్రిమెంట్ నన్ను ఆశ్చర్యచకితుణ్ని చేసింది. ఆ రోజుల్లో నటీనటులని జీతాలపై కుదుర్చుకొనే వారని తెలిసి ఆశ్చర్యపోయాను. అప్పటికీ ఇప్పటికీ ఎంత మార్పు వచ్చింది?ఇప్పుడు నటుడు అనేసరికి వేల మీద తీసుకొంటున్నారు. కాస్త పేరు వస్తే చాలు లక్షలు అడుగుతున్నారు. ఇప్పటి నటులు ఎస్. వి. రంగారావులాంటి వారి గురించి తెలుసుకొంటే ఎంతో మంచిది! చక్కటి వ్యాసం అందించిన ఆరిపాక



సూరిబాబుగార్కి అభినందనలు! ఇక సంపాదకీయంలో రిజర్వేషన్ వ్యతిరేక ఉద్యమం ఉధృతి గురించి చక్కగా తెలియజేసారు. కులమతాలకి అతీతంగా ఆర్థిక ప్రాతిపదిక మీద కొంత రిజర్వేషన్ విధించాలని అందరూ కోరుకుంటూండగా, మన రాజకీయ పార్టీలు, ప్రభుత్వమూ, బి. సి. లూ, ఒ. సీలూ, యస్. టి. లూ, యస్. సి. లు అంటూ ప్రజలని విడదీయడం ఎంతైనా అనర్థదాయకం! అట్లే ప్రతిభకి పట్టం కట్టవలసింది పోయి నూటికి అరవై శాతం రిజర్వేషన్ల పేరుతో తక్కువ ప్రతిభ గలవారి చేతుల్లో విద్యనీ దేశ ప్రగతినీ పెడితే, మనదేశం అభివృద్ధి దిశగాగాక, తిరోగమన దిశగా పయనించడం ఖాయం! ఇది అక్షర సత్యం! ఈ విషయాన్ని మన రాజ కీయ నాయకులు తమ స్వప్రయోజనాలని ప్రక్కకి పెట్టి పరిశీలించాలని నా మనవి.

-సి. రవితేజస్వి, చింతలూరు, ఆలమూరు మండలం, తూ. గో.-533232

Editorial Adviser: *S. RADHAKRISHNA*, Editor: *VEERAJI*,
Printed and Published by *S. NAGESWARARAO* for Nageswara Rao Estates Ltd.,
at the Andhra Patrika Press, Gandhi Nagar, Vijayawada-520003.
Phones: Editorial: 75667, Business: 61247, 61248.

స్తామన్నా పుల్లయ్య కేసు తీసి వేయించు కోటానికి ఒప్పుకోలేదు. వీళ్ల బలహీనతను సొమ్ము చేసుకోదలచాడు పుల్లయ్య!

మరేం కావాలి అతనికి

గుమాస్తాగా ప్రమోషనుట! అతను స్కూలు ఫైనలు ప్యాసయినాడు వార్డు బాయీల నుంచి అయిదేళ్ల సర్వీసుతో గుమాస్తాగా రావచ్చని జి ఓ వుంది తనకి ఆస్పత్రిలోనే గుమాస్తాగా ప్రమోషను యిప్పించమన్నాడు ఖాళీలున్నాయిట!

భాస్కరం, సూర్యంగారినీ, తంగవేలునీ వెంట పెట్టుకొని క్రొత్త సూపరింటెండెంటుని లే సెక్రటరిని బ్రతిమాలాడు అన్నట్లు భాస్కరానికి గూడా ఇంకో ఆఫీసుకు బదిలీ వచ్చి, రిలీవ్ అయ్యాడు పోతే అస్పత్రిలో మిగిలింది తంగవెలు ఒక్కడే.

ఇంకో సంగతి కూడా యిక్కడ చెప్పాలి భయంకరంగారు వెళ్లగానే, స్థానిక నాయకులను పట్టుకొని, ఇన్‌ఛార్జి సూపరింటెండెంటుకి రికమెండు చేయించుకొని, పుల్లయ్య తిరిగి డ్యూటీలో చేరాడు సస్పెన్షను రద్దు చేయించుకొని, దానిమీద విచారణ జరగకుండానే తర్వాత క్రొత్త సూపరింటెండెంటు చార్జి తీసుకొన్నారు

సూర్యం, భాస్కరం చెప్పినదంతా విని, వాళ్లదేమీ లోపం లేదనీ, వాళ్లని కోర్టు శిక్షనుంచి విడిపించాలంటే, పుల్లయ్యకు గుమాస్తాగా ప్రమోషను యివ్వక తప్పదనీ భావించి భూషణంగారు అతనికి గుమాస్తాగా ప్రమోషనిచ్చారు తన ఆస్పత్రిలోనే ఆర్డర్లు తీసుకొన్న మరునాడు మేజస్ట్రేటు ముందు తల్లితో హాజరై కేసు విరమించుకొంటున్నట్లు చెప్పాడు పుల్లయ్య. ముద్దాయిలకు శిక్ష విధించాలనీ, ఆడవాళ్లజోలికి రాకుండా బుద్ధిచెప్పాలని ఆశపడ్డ ఆడమేజస్ట్రేటుకు, ఆశాభంగమే అయింది. ఆమెకు కేసు కొట్టివేయక తప్పలేదు.

ఆనందంతో బ్రతుకుజీవుడా! అంటూ బయటపడ్డారు నేరం చెయ్యని ముగ్గురు ముద్దాయిలు కోర్టు నుంచి.

చివరకు గెలిచింది ఎవరు?

ప్రమోషను తెచ్చుకొన్న పుల్లయ్య!

అతని చేత క్వార్టర్సు కాళీ చేయించిన సూపరింటెండెంటు భయంకరం!

ఓడిపోయిందెవరు? ఏమీ నేరం చెయ్యని లే సెక్రటరీ సూర్యం, అక్కౌంటెంటు తంగవేలూ, యు.డి.సి భాస్కరం?

ఎందుకంటే వాళ్లు అనవసరంగా శిరోవేదనకు గురి కావటమే కాకుండా, స్వంత డబ్బు కూడా ఖర్చు పెట్టుకొన్నారు

మరి చట్టానికి చెవులేగాని, కళ్లులేనంటే నిజం కాదా?

సూర్యం తర్వాత లే సెక్రటరీగా, పదవీ విరమణ చేసాడు

ఏ తప్పూ చెయ్యకుండానే అతను క్రిమినల్‌గా కోర్టులో నిలబడాల్సివచ్చింది తన సర్వీసు చివరలో

పుల్లయ్యతో రాజీ పడకపోతే కోర్టులో ఏమి తీర్పు వచ్చేదో? తమ గతి ఏమయ్యేదో?

తన సర్వీసులో భయంకరం లాంటి సూపరింటెండెంటు తగిలినందుకు యిప్పటికి భయపడుతుంటాడు అతను!

పుల్లయ్య తమందరిమీదా, దొంగ కేసు బనాయించడం, తాము మేజస్ట్రేటు ముందు దోషులాగా నిలబడాల్సి రావడం, భయంకరంగారి భయంకర ప్రవర్తన, తలుచుకొంటే సూర్యానికి యిప్పటికీ భయంగానే వుంటుంది

తను కేసు నుంచి బయటపడినందుకు ముందు దేవుడికీ తర్వాత భాస్కరానికీ మనసులోనే జోహారు అర్పించుకొన్నాడు సూర్యం

అయితే ఈ వృత్తాంతం వలన ఒక గుణపాఠం నేర్చుకొన్నాడు సూర్యం

అదేమంటే, అధికారి చెప్పింది, చెయ్యబోయేది, తప్పయినప్పుడు, క్రింది వుద్యోగులు దానిని ధైర్యంగా ఎదిరించాలి

లేకపోతే అనవసర యిబ్బందులకు గురి కావల్సి వస్తుంది

భయంకరంలాంటి అధికారులే అందరూ అయితే, ఆ కార్యాలయాలు ఎలా బాగుపడతాయి?

పుల్లయ్యని అతని తల్లి నాంచారమ్మ తెలివిని ఎవరయినా అభినందించకతప్పదు. ఎందుకంటే తమ పరాజయాన్నే, శాశ్వత లాభంతో, జయంగా మార్చుకొన్నారు గనుక!

○





## చిట్టిబాబు, శోభానాయుడు నసీరుద్దీన్‌లకు సంగీత అకాడమీ అవార్డులు

1990వ సంవత్సరానికి ప్రముఖ వీణా విద్వాంసుడు శ్రీ చిట్టిబాబు, ప్రముఖ కూచిపూడి నృత్య కళాకారిణి శోభానాయుడు, హిందీ చలనచిత్ర నటుడు నసీరుద్దీన్‌షాలకు కేంద్ర సంగీత నాటక అకాడమీ అవార్డులు లభించాయి.

ఈ అవార్డు క్రింద ఒక్కొక్కరికి 25 వేల రూపాయల నగదు, ప్రశంసాపత్రం లభిస్తాయి.

సంగీత, నృత్య, నాటక రంగాలలో విశేష కృషి చేసిన వారికి గుర్తింపుగా ఈ అవార్డులు బహూకరించటం ఆనవాయితీగా వస్తున్నది.

ప్రఖ్యాత రంగస్థల కళాకారుడు శ్రీ ఉత్పల్‌దత్, ప్రముఖ డ్యాన్సర్ రాంగోపాల్‌లకు అకాడమీ ఫెలోషిప్‌లు లభించాయి.

వయొలిన్ విద్వాంసుడు శ్రీ ఎన్.



రాజాం, తబలా కళాకారుడు శ్రీ జాకీర్ హుస్సేన్‌లు కూడా ఈ అవార్డులు లభించిన వారిలో వున్నారు.

వచ్చే ఏడాది ఫిబ్రవరిలో జరిగే ఒక కార్యక్రమంలో వీరికి ఈ అవార్డులు ప్రదానం చేస్తారు.



"బొబ్బిలిరాజా"లో వెంకటేష్, దివ్యభారతి

మంజు, వంకాయల, బ్రహ్మానందం, బాబూ మోహన్, ప్రసన్న కుమార్, హుసేన్, అక్కిరాజు రామకృష్ణ, హరిమూర్తి పాత్రధారులు. పరుచూరి సోదరులు కథ, మాటలు రాశారు. విద్యాసాగర్ సంగీతం, జయరాం ఛాయ, కళాధర్ శిల్పం, స్పైడర్ విక్కీ సాహసాలు, కళ నృత్యాలు, ఎం. బాలు సంయుక్త దర్శకత్వం, గోపాలకృష్ణ- వెంకట్రామన్ నిర్వహణతో వై. నాగేశ్వరరావు దర్శకుడు.

( 39 వ పేజీ తరువాయి)

"ప్రార్థన"

"అక్టోబర్ 20 నుంచి నవంబర్ 30 వరకు ఒకే షెడ్యూల్లో షూటింగ్ పూర్తవుతుంది," అన్నారు కందేపి సాంబశివరావు. ఈయన నిర్మించే నిక్కి ఫిలిమ్ సర్క్యూట్ "ప్రార్థన" చిత్రంలో సురేష్, బేబీ సుజిత, చిన్న, వినయ్ జాకీ, దినేష్, మాస్టర్ సురేష్ ఆదిగా గలవారు పాల్గొంటారు. సీతారామ శాస్త్రి గీతాలు, దేవేంద్రన్ సంగీతం, ప్రతాప్ ఛాయ, కొండపనేని రామలింగేశ్వరరావు శిల్పం, మలేషియా భాస్కర్ సాహసాలు, సుందరం నృత్యాలు, ఆకుల చిన్నకృష్ణ నిర్వహణ, వెంకట్ ప్రొడక్షన్, కృష్ణారెడ్డి కూర్పుతో కె. విజయభాస్కర్ కథ సమకూర్చి, దర్శకత్వం వహిస్తున్నారు.

"శ్రీశైల దేవాలయం ప్రాశస్త్యం, ఆ గుడి గోపురాన్ని నిర్మించిం దెవరు. భ్రమరాంబ- మల్లికార్జునలకు ఆయా పేర్లెలా వచ్చాయనే విశేషాలు, వారు భూలోకానికి ఎందు కొచ్చారనే వివరాలు ఈ చిత్రంలో పొందుపరుస్తున్నాం," అన్నారు 'జానపద బ్రహ్మ' బి. విఠలాచార్య. ఈయన కథ, స్క్రీన్ప్లే, దర్శకత్వం వహించే శ్రీ సత్యనారాయణ కంబైన్స్ "శ్రీశైల భ్రమరాంబిక కటాక్షము" చిత్రంలో కె. ఆర్. విజయ, భానుచందర్, కాంతారావు, నరసింహరాజు, సుధాకర్, దగ్గుబాటి రాజా, సారథి, మాడా, వైష్ణవి, సిల్క్ స్మిత, సాగరిక, అంజలీదేవి, డిస్కో శాంతి, సి. ఐ. డి. శకుంతలతో పాటు ఏనుగు, పాము ముంగిసలు కూడా కీలక పాత్రలు వహిస్తాయి. కర్పూరపు ఆంజనేయులు సంభాషణలు, మల్లెమాల? 